# “కోడిగుడ్డులో పోషణ ఉంది.
# అది టియారాలో ఉంది”






“నా జుట్టు మునుపు చిట్లిపోయి, కాంతిహీనంగా ఉండేది. అప్పుడు అమ్మ చెప్పింది, టియారా ఎగ్ షాంపూ వాడమని. దానినిండా జుట్టుకు పోషణయిచ్చే ఎ, డి లాంటి విటమిన్లు ఉన్నాయి. మీరూ టియారా ఎగ్ షాంపూ వాడండి. మీ జుట్టుకి ఊగితూగే ఆ మధురానుభవాన్ని యివ్వండి.”

ఏ రకమైన జుట్టుకైనా
సరిపడే టియారా షాంపూ:

- టియారా బ్యూటీ షాంపూ
  పుష్కలమైన నురుగు కోసం.
- టియారా లెనోలిన్ షాంపూ
  పొడి పొడి జుట్టు సంరక్షణ కోసం.
- టియారా షీకాకాయ్ షాంపూ
  పొడుగైన జుట్టు సంరక్షణ కోసం
  విసిరి, బహ్మీ పదార్థాలతో
- టియారా లెమన్ షాంపూ
  జిడ్డువోడే జుట్టు సంరక్షణ కోసం
- టియారా హెయిర్ కండిషనర్
  కూడా దొరుకుతుంది

- టియారా బేన్ + డేన్ క్రీమ్ షాంపూ
  చుండ్రువున్న జుట్టు సంరక్షణాకోసం.




HELENE CURTIS

# టియారా
## షాంపూ




**కేశ సంరక్షణ విషయాల్లో ప్రపంచ నాయకులు: హెలిన్ కర్టిస్**

everest/78/JKH/40-11

# మీపిల్లలకు అధిక శక్తినిస్తుంది...
# అగ్రస్థానం చేకూర్చుతుంది...
# కోకో-రుచిగల బోర్న్‌విటా!



బోర్న్‌విటాలో ఇప్పుడు అధికంగా కోకో ఉన్నది. దానిని మరింత రుచికరంగా-ఆరోగ్యంగా చేసేందుకు

అంతేకాక బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది.

వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది. మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి. రోజుకు రెండుసార్లు వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది మీకు గూడా బోర్న్‌విటా అవసరం. వారికి తగ్గటుగా ఉండేందుకు!

క్యాడ్‌బరీస్
## బోర్న్‌విటా
అధిక కోకో గలది: అధిక రుచి, అధిక పోషకత్వం!







OBM 8376 B/TL

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 4 సంచిక : 4

అక్టోబర్ : 1978

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవై నాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026




ఈ పేజీలలోని ప్రతి లేఖకూ చిన్న పారితోషికం— ఐదు రూపాయలు

వనిత అభిప్రాయాల శీర్షికలో శ్రీమతి బులుసు రామలక్ష్మిగారు 'ఆంగ్ల భాషపై సంస్కృత భాషా ప్రాచుర్యం' గురించి వ్రాస్తూ తెలుగు భాష సంస్కృతం నుండి ఉద్భవించిందని వ్రాశారు. (ఆగస్టు '78). ఈ సిద్ధాంతం వాస్తవానికి దూరంగా వుంది. సంస్కృతం, ఆంగ్లం ఒకే భాషా కుటుంబానికి చెందినవి కాబట్టి రెండింటి మధ్య సామ్యం వుంది. ఆంగ్ల సంస్కృతాలే కాదు. సంస్కృత, హిందీ, లాటిన్, గ్రీక్, మొదలగు భాషలలో కూడా ఈ సామ్యాలున్నాయి. కాని తెలుగు వేరే భాషా కుటుంబానికి చెందినది కాబట్టి ఈ పోలిక లేదు. ఉదాహరణకు కొన్ని పదాలను పరిశీలిద్దాం.

| తెలుగు | సంస్కృతము | హిందీ | గ్రీకు | లాటిన్ | ఆంగ్లము |
|---|---|---|---|---|---|
| తండ్రి | पित्र (పితృ) | पिता (పితా) | Pater | Pater | Father |
| నేను | अहम् (అహమ్) | मैं (మై) | Ego | Ego | I |
| మూడు | त्रि (త్రి) | तीन (తీన్) | Treis | Tres | Three |

భౌగోళిక పరిస్థితిని అనుసరించి ప్రపంచంలోని భాషలన్నింటిని కొన్ని శాఖలుగా వర్గీకరించారు.

1. ఉత్తర, దక్షిణ అమెరికా భాషా శాఖలు
2. ఆస్ట్రేలియా, న్యూజిలాండు భాషాశాఖ
3. ఆఫ్రికా భాషాశాఖ
4. యూరేషియా భాషాశాఖ.

మనకు ప్రస్తుతం కావలసిన భాషలు తెలుగు, సంస్కృతం కాబట్టి యూరేషియా భాషాశాఖను పరిశీలించాలి.

యూరేషియా భాషాశాఖను ఏడు కుటుంబాలుగా విభజించారు. 1. సెమెటిక్ 2. కాకేషియన్ 3. యూరల్ అల్టాయిక్ 4. చైనీస్ 5. ఆగ్నేయ 6. ద్రావిడ 7. భారోపీయా.

ఇందులో ద్రావిడ పరివారమునకు చెందిన భాషలలో తెలుగు ఒకటి. అదే విధంగా భారోపీయా పరివారమునకు చెందిన భాషలలో ఇంగ్లీషు, సంస్కృతం మొదలగునవి. ఆకృతం సంస్కరింపబడి సంస్కృతం, సంస్కృతం నుండి అపభ్రంశము, అపభ్రంశం నుండి హిందీ భాషలు పుట్టినవి.

ఈ విధంగా భాషా కుటుంబాలే వేరైనప్పుడు తెలుగు సంస్కృతము నుండి పుట్టిన దనడం సమంజసం కాదు. కాని ప్రాచీన కాలములో ద్రావిడులు ఉత్తర భారతదేశంలో నివశించారు. అందుచేత ఆర్యులు ద్రావిడులు ఒకరివల్ల ఒకరు ప్రభావితం అయ్యారు. అంతేగాక సంస్కృత సాహిత్యంలో చాలా భాగం ద్రావిడులే రచించారు. కాబట్టి మనకు తెలిసిందేమిటంటే శతాబ్దాలుగా దక్షిణ భారతదేశంలో సంస్కృతభాష వున్నందున సంస్కృత ప్రభావం ద్రావిడ భాషలైన తమిళ, తెలుగు, మలయాళం, కన్నడం మీద పడింది. అంతేగాక ప్రతి భాషలోని అవసరమైన పదాలను గ్రహించడమే జీవిత భాష యొక్క లక్షణం. అందువల్ల కూడా సంస్కృత పదాలు తెలుగులో కలిసిపోయాయి.

ఎస్. రమాదేవి — కావలి

జీవితాన్ని గురించి కొందరేవో సిద్ధాంతాలు ఏర్పరచుకుంటారు. ఆ లక్ష్య సాధనలో తాము క్రొవ్వొత్తిలా కరిగిపోతుంటారు. అది పదిమందికీ ఉపయోగపడేది అయితే ఫర్వాలేదు కాని ఎవరికి ప్రయోజనం లేనప్పుడు ఆ సిద్ధాంతాలకూ, ఆ త్యాగాలకూ అర్ధమేమున్నది? సరిగా 'స్వయంకృతం' కథలోని కథానాయకిలా నా స్నేహితురాలొకామె బంధాలకూ—అనుబంధాలకు తనకు తోచిన భాష్యం చెప్పుకుని, బాంధవ్య బంధితులమై ఆ ఝంఝూటం నుండి బయటపడలేక బాధలు కొని తెచ్చుకోవటం ఎందుకని అన్ని బంధాలకు అతీతురాలై, చదువులో తన లక్ష్యాన్ని సాధించి నేడొక గొప్ప స్థితిలో ఉన్నది. కాని ఇవ్వాళ తను కోల్పోయిన దానికోసం తను పడుతున్న మనోవేదన చూస్తుంటే మనిషికి డబ్బు ఒకటే కాదు అవసరం, మనిషి తోడు కూడా కావాలి అనిపిస్తుంది. అందుకే 'వాసిరా' వ్రాసిన 'స్వయంకృతం' చదివి ఆశ్చర్య పోయాను.. రచయి(త్రు)తలు — తమ చుట్టూ ఉన్న సమాజం నుండే కథలకూ, నవలలకూ 'ముడి పదార్థాన్ని' సేకరించుకున్నా — ఎక్కడో తప్ప అన్ని కథలూ, నవలలూ; వాస్తవానికి, వర్తమానానికి దగ్గరగా ఉండవు. వాస్తవానికి దగ్గరగా ఉండే కథలే మనలో చైతన్యాన్ని కలిగిస్తాయి.

శైలజ — బాపట్ల

సెప్టెంబరు మాసపు వనితలో "తరతరాలుగా స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలు" వ్యాసంలో బులుసు రామలక్ష్మిగారు హిందూ సమాజంలో వనితల స్థాయిని చాలా యథార్థంగా చిత్రించారు. యుగయుగాల నుంచి సమాజంలో స్త్రీలే అణగారిన వర్గంగా చెల్లుబడి అవుతున్నారు. దీనికి కారణం మనలో ప్రబలిన మూఢ విశ్వాసాలు. స్త్రీలు తమ స్థాయిని తక్కువగా చిత్రించుకుని తమకు తామే అన్యాయం చేసుకుంటున్నారు. కట్టుబాట్లకు నైతికంగా లోబడటం వల్లనే ఈ దుష్పరిణామం ప్రాకిప్రాకి పురాణయుగం నుంచి నేటి ఆధునిక యుగం వరకు వనితలు తక్కువ స్థాయిలోనే ఉండిపోయారు. ఈ సమస్యను విజయవంతంగా ఎదుర్కోవాలంటే విద్యావంతులైన స్త్రీలు ఆచరణతో కూడిన కార్యక్రమాలను చేపట్టాలి. పౌరాణిక ప్రమాణాలకు స్వస్తి చెప్పి క్రొత్తతరం యువతులను చైతన్యవంతులుగా చేయాలి. అనేక సందర్భాలలో పురుషుల ఆధిక్యతను కాలతన్నగల

దీపావళి పండగనాడు ఎంత కళ! ఎంత కాంతి! ఎంత ఆనందం! ఎంత ఆహ్లాదం! రకరకాల మతాబులు, చిచ్చుబుడ్లు, కాకర పువ్వులు, పటాసులు దీపావళిని శోభాయమానం చేస్తాయి. ఇంతటి ఆహ్లాదానికి కారణమైన బాణా సంచాను తయారు చెయ్యడంలో స్త్రీల పాత్ర ఎంతగానో వుంది. ఈ బాణా సంచా పరిశ్రమలో (శివకాశి) 90 శాతం స్త్రీలే శ్రమిస్తున్నారు. ఆ విశేషాలు, వివరాలు, ఛాయాచిత్రాలుగల ప్రత్యేక వ్యాసం —

వచ్చే సంచికలో

సాంఘిక మార్పులు కుటుంబ జీవితంలో తేవాలి. పురుషుల మనస్తత్వంలో మార్పు తేవాలి. కనీసం తమ పుత్ర సంతానంలోనైనా ఈ మానసికమైన మార్పు తేవటానికి ప్రయత్నించాలి. ఈ సంకల్ప సిద్ధి సాధించినప్పుడే భారత వనితలు తమ స్థాయిని పెంచుకోగల్గుతారు. వితంతు వివాహం చేసుకున్న వనితకు సాటి స్త్రీలు సంఘంలో సమాన గౌరవ ప్రతిపత్తులు ఇచ్చిననాడు ఆమె పునర్వివాహాన్ని ఎవరు కాదనగలరు? "అపుత్రస్య గతిర్నాస్తి" అన్న ఆరోక్తిని స్త్రీలే ఎక్కువగా నమ్ముతారు. కుమారుడు కలగకపోతే పురుషులకంటే స్త్రీలే ఎక్కువ తహతహలాడుతారు. ఈ మనస్తత్వం స్త్రీలు విడనాడాలి.

తులసీమూర్తి హైదరాబాద్

తరతరాలుగా స్త్రీలకు జరిగే అన్యాయాలను గూర్చి వ్రాస్తూ "సీతకేనా అగ్నిపరీక్ష? రాముడికెందుకు ఉండకూడదు?" అని ఆక్రోశించిన రచయిత్రి అదే రామాయణంలో, కైక కారణంగా కన్న కొడుకును కానలకంపి, ధృతిచెడి, మృతి పొందిన దశరథుడు, అడవులపాలైన రామలక్ష్మణుల గూర్చి ఎందుకు మరచిపోయినట్లో???



ఈ సంచికలో వచ్చిన (73వ పేజీ) 'తరతరాల సంస్కృతిలో భారత స్త్రీ' అన్న వ్యాసం రాసిన శ్రీమతి గుంటి సరస్వతి—లోగడ కొన్ని వ్యాసాల ద్వారా 'వనిత' పాఠకులకు పరిచితురాలు. ఇతర పత్రికల్లో కూడా ఆమె కొన్ని వ్యాసాలు రాశారు. చీరాలలో పదవతరగతి వరకూ చదువుకున్న శ్రీమతి సరస్వతి — ప్రస్తుతం శ్రీకాకుళంలో వుంటున్నారు. తీరిక సమయాల్లో పుస్తకాలు చదవడం, వ్యాసాలు రాయడం చేస్తూ వుంటారామె.

కాలాన్ని బట్టి, నాటి సమాజస్థితిగతులను బట్టి శాస్త్రీయదృక్పథంతో ఆలోచించి విమర్శకు పూనుకోవాలిగాని — నాటి సమాజాన్ని నేటి దృక్పథంతో ప్రశ్నిస్తే—ఆ ప్రశ్నలు హేతువాదం ముందు తోక ముడవక తప్పదు. తరతరాల నుండి పురుషాధిపత్యం లేదనడం ఎంత సాహసమో—స్త్రీ ఆధిక్యత అన్న స్థితి అసలే లేదనడం అంతే సాహసం అవుతుంది. గౌతమపుత్ర శాతకర్ణి, వాశిష్టపుత్ర-పులమావి, మౌర్య చంద్రగుప్తుడు మొదలగు చారిత్రక పురుషుల పేర్లు తమ తమ తల్లుల పేర్లతో పిలువబడేవనుట చారిత్రక సత్యం. అంతేకాక "సీతా రాములు, రాధా కృష్ణులు, పార్వతీ పరమేశ్వరులు" ఈ పేర్లలన్నింట స్త్రీ నామమే (బామ్మగారి పేజీ: ఆగస్ట్ సంచిక) ముందుండడం గమనించగలం. వీటినిబట్టి స్త్రీలను గౌరవించి వారి ఆధిక్యతను గుర్తించిన కాలం కూడా ఒక చారిత్రక సత్యమని తెలుస్తుంది.

ఆధునిక సమాజంలో స్త్రీని గూర్చి వ్రాస్తూ "పునర్వివాహం పురుషులేగాని, స్త్రీలెందుకు చేసుకోకూడదు?" అని రచయిత్రి వాపోయారు. నిజమే! చేతలకు దూరమై అక్షరాలకే పరిమితమైన రాతలతో పఠితలను, కేవలం అధరాలకే పరిమితమైన కూతలతో శ్రోతలను ఉర్రూతలూగించి తమ విశాలభావాలను సువిశాలంగా ఉద్ఘాటించేవారేగాని, వాటిలో ఏ ఒక్కటైనా పాటించేవారు మన సమాజంలో ఎంతమందున్నారు? ఒకవేళ ఉంటేగింటే వారి ఉత్సాహానికి ప్రోత్సాహం ఎంతవరకు లభిస్తుంది? కులమతాల ప్రసక్తిలేని సమసమాజాన్ని ఆశిస్తున్న ఈ రోజుల్లో స్త్రీల గోత్రనామాల పేరిట పూజలు జరిపించాలి అని ఆవేశంగా శాసిస్తున్న రామలక్ష్మిగారు ఆశించేది ఈ సమాజ పురోగతా? తిరోగతా?

ఎన్. స్వరాజ్యలక్ష్మి హైదరాబాద్

## వనిత సంవత్సర పరీక్ష

వనిత సంవత్సర పరీక్షలో వేలాది పాఠకులు ఉత్సాహంగా పాల్గొనడం ఆనందించదగ్గ విషయం. అయితే చాలామంది టిక్కులు పెట్టడంలో పొరపాట్లు చేశారు. కొందరు అనుమానం వచ్చేలా టిక్కులు పెట్టారు. అలాంటివన్నీ తీసెయ్యగా—ఇందులో గెలుపొందినవారు 1391 మంది వచ్చారు! ఇది నిజంగా సంతోషించదగ్గ విషయం. అయితే, ఇంతమంది పేర్లూ స్థలాభావంవల్ల 'వనిత'లో వెయ్యడం లేదు గాని, నెగ్గినవారికి పోస్ట్ ద్వారా వెంటనే తెలియజేస్తున్నాము. 'బహుమతి' కూడా కొద్ది రోజుల్లోనే వారికి చేరుతుంది. అయితే, ఈ విషయంలో కార్డులు ఇంకా చేరలేదనో, ఆ తర్వాత బహుమతి చేరలేదనో-ఉత్తరాలు రాయడం వల్ల ప్రయోజనం వుండదనీ, ముందుగా కార్డులు అక్టోబర్ 5వ తేదీలోగా అందరికీ చేరగలవనీ గెలుపొందినవారికి మనవి చేస్తున్నాము.

—వ. సం

మీరు ప్రచురిస్తున్న 'లోకజ్ఞానం' శీర్షిక క్రొత్త క్రొత్త విషయాలను తెలియజేస్తోంది. అందుకు కృతజ్ఞులం. కాని సెప్టెంబరు సంచికలోని 'లోకజ్ఞానం' శీర్షికలో మెదక్‌జిల్లా ముఖ్య కేంద్రం ఏది? అన్న దానికి సమాధానంగా 'మెదక్' అని రాశారు. కాని మెదక్‌జిల్లాకు సంగారెడ్డి ముఖ్యపట్టణం. ఈ పొరపాటు ఎలా జరిగింది?

—పి. యశోద, హైదరాబాదు

**[మెదక్‌జిల్లా ముఖ్య కేంద్రం సంగారెడ్డి. జరిగిన పొరపాటుకు చింతిస్తూ ఇక మీదట ఈ శీర్షికలో అలాంటి పొరపాట్లు దొర్లకుండా జాగ్రత్త పడగలము. వ. సం]**

ఆగస్టు సంచికలో కడియాల వసుంధరాదేవిగారు తెలియచేసిన దూదితో పావురాలు ప్రయత్నించి చూశాము. స్వల్ప సమయంలో, తక్కువ ఖర్చుతో, అందంగా తయారయినది.

—కె. శోభారాణి, చీపురుపల్లి

నీడ వెనుక నిజం కథానిక చాల చక్కగా ఉన్నది. ఈ మధ్య అంత మంచి కథానిక చదువనే లేదు. రచయిత్రి జలంధరగారికి నా అభినందనలు.

—ఇందిర, ఒలపనూర్

సెప్టెంబర్ నెల 'వనిత' ఎక్కువ పేజీలతో మమ్మ ఎంతో ఆనందపరచింది. 'వైకుంఠపాళి' ఎంతో బాగుంది. లోకజ్ఞానము, టెస్ట్ ట్యూబ్ బేబి, సుప్రసిద్ధ వ్యక్తులను గురించి చదివి చాలా సంతోషించినాము.

—కె. సరోజిని, గుడివాడ

To,
The Editor
VANITHA
Chandamama Building
Madras
PIN 600026.

సెప్టెంబర్ వనిత అంత ఇంట్రెస్టింగ్‌గా లేదు. పోతే డైరీఫార్మ్ గురించి చక్కగా వివరించారు. కృష్ణవేణి సీరియల్ చాలా బాగా సాగుతోంది. కథలు బాగున్నాయి. శిరోజాలంకరణ పూర్తిగా మానివేశారు. మరలా క్రొత్త విధానాలేవైనా ఉంటే దయచేసి ప్రచురించండి.

—ఇంద్రాణి రత్నాకర్, విశాఖపట్నం

నీడ వెనుక నిజం చదువుచున్నప్పుడు హృదయము బరువెక్కింది. రచయిత్రికీ, వనితకూ అభినందనలు.

—లీల, హైదరాబాదు

సెప్టెంబరు వనితలో, రంజాన్ పర్వదినం గూర్చి తెలియని పాఠకులకు చాలా బాగా వివరించి తెలిపారు.

—బి. పాతిమా, సికింద్రాబాదు

స్త్రీలకు ఉద్యోగ అవకాశాలు, వారికి ఉన్న రకరకాల ట్రైనింగులను గురించి ప్రతి నెలా 'ఉద్యోగ వార్తలు' అని ఒకటి ప్రారంభించవచ్చును కదా.

—బి. ఉమా మల్లీశ్వరి, ఏలూరు

వనితలో కథలు మూడు లేక నాలుగు ఉంటే బాగుంటుంది.

—కె. సుశీల, లాల్‌కోట

సెప్టెంబరు '78 'వనిత'లో మీరు ప్రచురించిన 'ఉద్యోగాలు - జీవితభీమా' అనే శీర్షిక నన్నెంతో ఆకర్షించింది. ఈ శీర్షికతో వనితలకు-కృషి, పట్టుదల, దీక్ష, ఆత్మ విశ్వాసం వుంటే సాధించలేనిది లేదు అనే ధైర్యాన్ని కలిగించారు.

—ఎ. రేవతి, హైద్రాబాదు

సెప్టెంబర్ వనిత నన్నే కాకుండా మా యింటి వాళ్ళందరినీ ఆకర్షించింది. ఏకైక మహిళా కార్టునిస్టు రాగతి పండరిగారిని పరిచయం చేసినందుకు మా కెంతో ఆనందంగా వుంది.

—వెంకుమహంతి లలితా పట్నాయక్, బరంపురం

సెప్టెంబరు వనిత ఎంతో ఆకర్షణీయంగా వుంది. టి. వి. గర్ల్స్ పరిచయం ఎంతో బాగుంది. ఎప్పట్నుంచో తెలుసుకోవాలని వున్న రాగతి పండరిగారి గురించి తెలియజేసినందుకు కృతజ్ఞతలు.

—వి. ప్రతిమ, నాయుడుపేట

వనితలో క్రొత్తగా 'లోపల' శీర్షికను మొదలుపెట్టినందులకు చాలా సంతోషం. అయితే మీరు నాటకరంగం గురించి పూర్తిగా మరచిపోయినారు. తెలుగు నాటకరంగంలోని వనితలను పరిచయం చెయ్యగలరని తలుస్తాను.

—నాళం కమలాదేవి, తెనాలి

వైకుంఠపాళి పెద్ద కథను రచయిత్రి చాలా త్వరగా ముగించారేమో అన్పించింది నాకు. కృష్ణవేణి సీరియల్ చాలా బాగా సాగుతోంది.

—అల్లంరాజు మాధవి, రాజమండ్రి

## వనిత మాటల కొలువు - 38

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 ఉ | ప | 15 ద్ర | 16 ప | 17 ము | ■ | 2 బా | 18 కా |
| చి | ■ | 3 వ్యా | యు | ప్ర | 19 యూ | స | లు |
| 4 త | 20 కృ | ము | సే | ■ | చ | ■ | డు |
| 5 ము | షి | ■ | ■ | 6 బా | న | ■ | ■ |
| ■ | ■ | 7 తీ | గె | ■ | ■ | 8 బ | 21 లి |
| 9 ఎ | 22 వ | రు | ■ | 10 థ | 23 క | ట్టి | పి |
| 11 లు | హా | ■ | 24 కొం | ■ | 12 లు | త | ■ |
| క | ■ | 13 ఈ | గె | ■ | 14 ప | ల | వు |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారు ఇరవై మూడు మంది. వారు :

1. ఆర్. సుగుణ, రేపల్లె 2. సుబ్బలక్ష్మి, హైద్రాబాదు 3. యం. వేంకటమణి, సాత్నాల క్వార్టర్స్ (అదిలాబాదు జిల్లా) 4. ఎస్. పద్మ, కర్నూలు 5. విజయ సచీవ్, విజయవాడ 6. శ్రీమతి కృష్ణ, బెంగళూరు 7. బి. లీలాబాయి, కాకినాడ 8. ఎస్. విజయలక్ష్మి, తెనాలి 9. కె. వి. ఉపాకల్యాణి, ఏలూరు 10. కె. కృష్ణకుమారి, రాజమండ్రి 11. వి. రత్నమాల, వరంగల్లు 12. జి. కాళి, హనుమకొండ 13. వి. ఇందిర, తెనాలి 14. ఎస్. జగన్నాథమ్మ, జమ్‌షడ్‌పూర్ 15. ఆర్. గుణ్రవతి, సిరిసిల్లా 16. ఎస్. వి. రత్నమాల, ధవళేశ్వరం 17. మైథిలి, కర్నూలు 18. జె. శైలజ, మచిలీపట్నం 19. బిందుమాధవీకుమారి, కలికిరి 20. ఇందిరా ప్రియదర్శిని, కలికిరి 21. కె. అన్నపూర్ణ, ఆకివీడు 22. జి. జయలక్ష్మి, నగరం (గుంటూరు జిల్లా) 23. అలివేలు మంగతాయారు, తణుకు.

బహుమతి మొత్తం
రూ. 150 లను
వీరికి సమానంగా పంచి అందజేస్తున్నాము.

## లోపల

# ప్రపంచం

**1945** సంవత్సరం ఆగస్టు నెలలో జపాన్‌లోని రెండు నగరాలు హిరోషిమా, నాగసాకిల మీద అమెరికా పరీక్షార్థం అణుబాంబులు ప్రయోగించింది. ఆ ప్రయోగం అమెరికాకి ఎంత లాభం చేకూర్చిందో కాని జపాన్‌మటుకు తీరని నష్టానికి, తీర్చలేని బాధలకి గురయింది. జపాన్‌లో పిల్లలు వికలాంగులుగానూ, మతి స్థిమితం లేనివారుగానూ జన్మించారు. అయితే అన్ని అవరోధాలు అధిగమించి జపాన్ పారిశ్రామికరంగంలో ప్రపంచదేశాలతో పోటీపడి ముందుకు రాగలిగింది.

ఈ రోజున అంతర్జాతీయరంగంలో జపాన్ ప్రభావం ఎంతో పెరిగింది. కొద్ది రోజుల క్రితం జపాన్ చైనాతో శాంతిస్నేహాలను కాంక్షిస్తూ ఒక ఒప్పందాన్ని కుదుర్చుకుంది. ఈ ఒప్పందంలో ప్రధానాంశం ఇతర దేశాల ఆధిక్యతను గుర్తించబోమని రెండు దేశాలు చెప్పడము. ఈ అంశాన్ని కొన్ని దేశాలు విపరీతంగా అర్థం చేసుకున్నాయి. రష్యా జపాన్‌కి హెచ్చరికా చేసింది. అయితే రష్యాతో తన సంబంధాలు క్షీణించవని జపాన్ వివరించడంతో ఉద్రిక్తత ప్రారంభంలోనే చల్లారిపోయింది. భారతదేశం కూడా జపాన్‌తో తనకున్న సంబంధాలకి ఈ ఒప్పందం వలన అవరోధం ఏర్పడదని భావించింది. భారత జపాన్ దేశాల మధ్య మైత్రి వృద్ధిచెంది, ఆసియాలో శాంతి సామరస్యాలకి అది దోహదం చేసే విధంగా వాతావరణం మారింది. మన విదేశాంగ శాఖామంత్రి జపాన్ పర్యటన పరిస్థితులని మార్చింది.

'ప్రపంచం'లో జపాన్ పాత్ర ఏమిటో తెలుసుకోవలసిన అవసరమూ ఈ సందర్భంలో వుంది. గత కొన్ని సంవత్సరాలుగా చైనా వియత్నాం సంబంధాలు దిగజారిపోతున్నాయి. వియత్నాం రష్యా నుంచి సైనిక సహాయం స్వీకరించడానికి సిద్ధపడుతున్నది. వియత్నాం ప్రాంతంలో రష్యా ప్రాబల్యం పెరగకుండా జపాన్ చైనాతో సంబంధాలు పెంచుకుందని రాజకీయ వ్యాఖ్యాతల అభిప్రాయం. అయితే వియత్నాం మీద మటుకు జపాన్‌కి దురభిప్రాయం లేదు. వియత్నాంకి జపాన్ ఆర్థికసహాయం అందచేసింది. ఈ వాతావరణంలో చైనా రష్యాల మధ్యనున్న విభేదాలు తనకి ఎలా అసక్తి కలిగిస్తాయో భారతదేశానికి అలాగే అసక్తి కలిగించవచ్చని జపాన్ విశ్వాసం. అందుకే ఆసియాలోని అగ్రదేశమయిన భారతదేశానికి జపాన్ సన్నిహితమవుతున్నది. తన సాంకేతిక సహాయం అందచేయడానికి సిద్ధంగా వుంది.

## దశాబ్దానికి మారుతున్నదశ

దక్షిణ అమెరికా దేశాలనే లాటిన్ అమెరికా దేశాలంటారు. ఈ దేశాలలో ప్రజాస్వామ్యం కన్నా మిలిటరీ పాలనే కనిపిస్తూ వుంటుంది. గత ఎనిమిది సంవత్సరాలుగా 'మిలిటరీ చేతుల్లో' వున్న పాలన మారాలని అక్కడి ప్రజలు కోరుకుంటున్నారు. దక్షిణ అమెరికాలో అర్జింటీనా, బ్రెజిల్, చిలీ ప్రధానదేశాలు. ఆంగ్ల అక్షర క్రమంలో చూస్తే ఇవి ఎ, బి, సి దేశాలవుతాయి.

అర్జింటీనా అధినేత జనరల్ జార్జిరాఫెల్ విదెలా పది సంవత్సరాల వరకూ పాలన తన చేతుల్లోనే వుంటుందని బెదిరించాడు. అలాగే బ్రెజిల్ అధ్యక్షుడు జనరల్ ఎర్నెస్టోగెసెల్ రాజ్యాంగానికి అనుగుణంగా పాలన సాగుతుందని ఐదు సంవత్సరాల క్రితం వాగ్దానం చేసినా అది నీటిలో కరిగిపోయింది. ఇక చిలీ అధ్యక్షుడు జనరల్ అగస్టోపినోచెట్ ఉగర్తే పది సంవత్సరాల దాకా ఎన్నికలమాట మరచిపోమని ప్రజలకి చావు కబురు చల్లగా చెప్పాడు.

అయితే మూడు దేశాలలోనూ మిలిటరీ పాలన కొనసాగుతున్నా ఈ మూడు దేశాలకూ పడదు. అర్జింటీనా బ్రెజిల్‌ని, చిలీని రెండు కళ్ళూ కనిపెట్టూనే వుంటుంది. బ్రెజిల్ అర్జింటీనా అంటే రాత్రింపగలూ 'నిద్రపోదు.' దక్షిణ పసిఫిక్ తీరంలోని చిలీ ఎప్పుడూ అర్జింటీనా పెద్ద శత్రువు క్రిందే భావిస్తూ వుంటుంది. ఈ ఆపోహలు పోయి ఒక దేశానికి మరొక దేశం సన్నిహితమవడానికి ప్రజాస్వామ్యం పునరుద్ధరించబడడమే మార్గమని పరిశీలకులు భావిస్తున్నారు.

## అఫ్ఘనిస్తాన్‌లో....

సెంట్రల్ ఆసియాలో వున్న అఫ్ఘనిస్తాన్‌లో జరిగే పరిణామాలు ఈ మధ్య కొంత విపరీతంగా కనిపించడం ప్రారంభమైంది. అఫ్ఘనిస్తాన్‌లోని 'విప్లవ ప్రభుత్వా'నికి నాయకుడు నూర్ మహమ్మద్ తరకి. దేశంలో విప్లవ చర్యలకి వ్యతిరేకంగా 'కుట్ర' జరుగుతోందని, ఈ 'కుట్ర'కి విదేశీ సహాయం వుందని నూర్ మహమ్మద్ తరకి చాలా దిగులుపడ్డాడు.

దావుద్ ప్రభుత్వాన్ని పడగొట్టి విప్లవ ప్రభుత్వాన్ని ఈ ఏప్రియల్‌లో నెలకొల్పడంలో ప్రముఖ పాత్ర వహించిన మేజర్ జనరల్ అబ్దుల్ ఖాదర్ తన రక్షణ మంత్రి పదవిని కోల్పోయాడు. అలాగే సైన్యాధ్యక్షుడు, మరో ఇద్దరు మంత్రులు పదవుల నుంచి ఆగస్టు నెలలో తొలగించబడ్డారు.

నూర్ మహమ్మద్ తరకి పాలనా బాధ్యతలు నిర్వహిస్తున్న విప్లవ సంఘానికి అధ్యక్షుడుగానూ, ప్రధాన మంత్రిగానూ వెలుగులోకి రావడంతో దేశంలో రాజకీయ విభేదాలు వెలుగులోకి వచ్చాయి. అఫ్ఘనిస్తాన్‌లోని 'పరచమ్', 'ఖల్క్' తెగలకి చెందిన ప్రజల కలయికతో ఏర్పడిన పార్టీయే విప్లవ ప్రభుత్వానికి సారథ్యం వహిస్తోంది. 'పరచమ్' తెగ నాయకుడు బబరక్ కర్మల్‌ని మొదట ఉపాధ్యక్షుడిగానూ, ఉపప్రధానిగానూ నియమించినా, ఆయన దేశంలో వుండడం అంత క్షేమం కాదని దౌత్య రాయబారిగా బయటకు పంపేశారు.

అలా విప్లవ ప్రభుత్వస్థాపనకి కారకులైన వ్యక్తులకి పట్టిన గతి చూస్తే అఫ్ఘనిస్తాన్‌లో సంభవించే పరిణామాలు ఎలా వుంటాయోనని 'ప్రపంచం' ఎదురు చూస్తున్నది. జనరల్ తరకి తన పీపుల్స్ డెమోక్రటిక్ పార్టీ జాతీయతని కోల్పోలేదని విప్లవ సిద్ధాంతాల ప్రత్యేకతకి అది కట్టుపడి వుంటుందని పదే పదే చెప్తున్నా మరో మార్గంలో మార్పులు వస్తూనే వున్నాయి. విప్లవ సారథులను దేశద్రోహులుగా చిత్రించి జనరల్ తరకి అధికారం కోసం జరుగుతున్న-అంతఃకలహానికే త్రోవ చూపాడు. అసలు సిద్ధాంతాలలో లోపం వుందా లేక నాయకుల మధ్య తీవ్ర విభేదాలు చోటు చేసుకుని రాజకీయ కల్లోలం వస్తున్నదా అన్నదాని గురించి ఆలోచించే కన్నా అఫ్ఘనిస్తాన్‌లో సంభవించిన విప్లవం పనికిరాని పగటి కలగా సరిపెట్టుకుంటున్నారు అక్కడి పౌరులు. □

ముఖచిత్రం

# వీణా విద్వాంసురాలు గాయత్రి



"విమర్శలనేవి సహేతుకంగా వుంటే బాగుంటాయి. ఆచరణలో పెట్టాలనీ అనిపిస్తాయి. అంతేకాని కేవలం విమర్శ కోసం విమర్శలు చేయకూడదు. గౌరీ మనోహరి రాగంలోంచి కొన్ని స్వరాలు తీసుకుని అన్నమాచార్యుల వారి కీర్తన కొకదానికి నేను స్వయంగా మరికొన్ని స్వరాలు సృష్టించి స్వర కల్పన చేశాను. నేను చేసిన యితర స్వర కల్పనల వలెనే ఈ రాగాన్ని కొందరు విమర్శకులు విమర్శించారు. కాని అది నేను పట్టించుకోలేదు. నవ్యత ద్యోతకమయ్యేది ఏది వచ్చినా ప్రారంభంలో దానికి ఆదరణా, అపనిందలు-రెండూ వుంటాయి. కాని అందులోని స్వారస్యం గ్రహించిన తరువాత అభాండాలు కూడా ఆదరణగా మారతాయని నా విశ్వాసం" అన్నారు ప్రముఖ వీణా విద్వాంసురాలు కుమారి గాయత్రి 'వనిత' జరిపిన ఇష్టాగోష్ఠిలో మాట్లాడుతూ.

అలా ఆమె కనిపెట్టిన రాగాన్ని ప్రఖ్యాత సంగీత విద్వాంసులు బాలమురళీ కృష్ణగారికి వినిపించి వారి అభిప్రాయం అడిగారు గాయత్రి. "ఆ రాగం ఆయనకు ఎంతో నచ్చింది. దానికి 'గాయత్రీ రాగం' అని పేరు పెట్టమని చెప్పారు. కాని 'గాయత్రి' అంటే భక్తి ప్రపత్తులతో కూడుకున్నట్టిదై వుండాలి. నేను కనిపెట్టిన రాగమేమో శాస్త్రీయపరమైనదీ, భక్తి ప్రధానమైనదీ కాదాయె. సాయం సమయాలలో ప్రేమికులు ఆలపించడానికి అనువైన ప్రణయ సంబంధమైన రాగం యిది. అందుకే ఆ రాగానికి 'ప్రియ బాంధవి' అని పేరు పెట్టాను" అంటారు గాయత్రి.

తన ఏడవ ఏటనే వీణ నేర్చుకోవడం ప్రారంభించిన గాయత్రి తొమ్మిదవ ఏట ప్రథమ కచేరి చేశారు. ఆమె తండ్రి ప్రఖ్యాత సంగీత దర్శకులు స్వర్గీయ అశ్వత్థామ, తల్లి కమల. ఆమె కూడా వీణా విద్వాంసురాలు. మద్రాసులో 'మాతా సంగీత విద్యాలయం' పేరిట ఒక సంగీత పాఠశాల నడుపుతున్నారు ఆమె. గాయత్రి తన తల్లివద్దనే వీణ నేర్చుకున్నారు. 'నా అభిమాన వీణా విద్వాంసుడు ఈమని శంకరశాస్త్రిగారు' అంటారు గాయత్రి.

అప్పట్లో అంత చిన్నవయసులోనే ఆమె ఎంతో అనుభవం గల దానిలా వీణ వాయించడం చూసి చాలామంది ఆశ్చర్యపడేవారు. 'ఆ రోజులు తలుచుకుంటే ఎంతో వుత్తేజం కలుగుతుంది. నవ్వూ వస్తుంది. ఎందుకంటే చిన్నప్పుడు నేను వీణ వాయిస్తూంటే చాలామంది వెనుక టేప్ రికార్డర్ వుందేమోనని భ్రమపడేవారు. కొందరైతే వచ్చి పరీక్షించారు కూడా' అంటారు గాయత్రి.

చిన్నప్పుడు చదువుమీద కన్న సంగీతం మీద ఆమెకు ప్రీతి అధికంగా వుండేది. దాంతో స్కూల్ ఫైనల్‌తో చదువుకి స్వస్తి చెప్పారు. అంతమాత్రాన ఆమెలో విద్యాభిలాష కుంటువడలేదు. జాపనీస్ భాషలో డిప్లొమా పొందారు గాయత్రి. ప్రస్తుతం జర్మన్ భాష నేర్చుకుంటున్నారు. "ఆ తరువాత ఫ్రెంచి, రష్యన్ భాషలు కూడా నేర్చుకోవాలని వుంది. భారతీయ సంగీతంలోని పోకడలు విదేశస్థులకి విడమరచి చెప్పడానికి వారి భాషలో అయితే సులభంగా అర్థమవుతుందని-విదేశీ భాషలు నేర్చుకుంటున్నాను" అన్నారు గాయత్రి.

గత సంవత్సరం రోటరీ – జేసీ సంస్థలు యువతరంలో అత్యుత్తమ వ్యక్తిగా నిర్ణయించి గాయత్రికి ఆ బహుమానం అందజేశారు.

గాయత్రి యింతవరకు 600 కచేరీలు చేశారు. మలేషియా, సింగపూర్ దేశాలు పర్యటించారు. అక్కడ ఆమె వీణా వాయిద్యం విన్నవారు 'భారతదేశపు అద్భుత బాలిక' అని ప్రశంసించారట! త్వరలో ఆమె జపాన్ దేశం కూడా పర్యటించనున్నారు.

ఇవన్నీ ఒక విశేషమయితే ఆమె తన తొమ్మిదవ ఏటనే గ్రామఫోన్ రికార్డు వెలువరచడం మరో విశేషం! ఆ తరువాత ఆమె మరో రెండు ఎల్. పి. రికార్డులు వెలువరచారు. త్వరలో పాశ్చాత్య – శాస్త్రీయ సంగీతానికి ప్రాధాన్యతను యిస్తూ మరో లాంగ్‌ప్లే రికార్డు వెలువరచనున్నారు.

"ఇతరులు చేయని ప్రయోగాలు నేను చేయాలని అనుకుంటాను." అనే గాయత్రి మన చిత్రాలకి నేపథ్యంలో వీణ వాయించడం గురించి ప్రస్తావిస్తూ "మా నాన్నగారి సంగీత దర్శకత్వంలో వీణ వాయించేదాన్ని. అలాగే కొన్ని తమిళ చిత్రాలలో నేనే వీణ వాయించాలని పట్టుబడితే వాయించడం జరిగింది. కాని నాకు శాస్త్రీయ సంగీతం మీద వున్న వుత్సాహం సినిమాల మీద లేదు" అంటారు.

పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్ విద్యార్థుల డిప్లొమా చిత్రం 'వన్య జీవితం' (మలయాళం)కు ఆమె సంగీత దర్శకత్వం వహించారు కూడా!

ఎందరి ప్రశంసలో అందుకున్న గాయత్రి చిన్నతనంలోనే తమిళనాడు నాట్య ఇసై మండ్రం వారి ప్రథమ బహుమతి అందుకున్నారు. గాయత్రి వీణ మాత్రమే కాక గిటార్ కూడా వాయిస్తారు.

అంతేకాదు. ఆమె లలిత సంగీతంలో చక్కని గాయని కూడా।

ఆమెకు గల బిరుదులు కోకొల్లలు – 'వీణా గాన వినోదిని', 'వీణా సరస్వతి', 'వీణావాణి', 'యాళ్ ఇసై సెల్వి', 'వీణా భారతి' – యిలా చెప్పుకుపోతే లెక్కలేనన్ని.

కచేరీలు చేయడానికి ముందు ఆమె తన వీణానాదాన్ని చిత్తూరు వి. నాగయ్యగారికి, ప్రొఫెసర్ సాంబమూర్తిగారికి వినిపించారు – వారు ముగ్ధులయి ఆమెను 'అద్భుత బాలిక'గా అభివర్ణించారు. ఆమె పదవ ఏట ప్రముఖ ఆంగ్ల దినపత్రిక 'ది హిందూ' ఆమె ఫొటోతో సహా ప్రముఖంగా ఆమె గురించి ప్రచురించడం జరిగింది. దాంతో 'ఎవరీ అద్భుత బాలిక' అన్న కుతూహలం అందరికీ కలిగింది. అప్పటి నుండి నేటివరకు మేటి విద్వాంసురాలైనా — 'బేబి గాయత్రి'గానే అందరి మన్ననలు అందుకుంటున్నారు కుమారి గాయత్రి.

ఆమె వీణా వాయిద్యాన్ని అభిమానించేవారిలో పండిట్ రవిశంకర్ ఒకరు. ఆయన ఎప్పుడు మద్రాసు వచ్చినా ఆమె వీణ వినకుండా వెళ్ళరట.

తన జీవితంలో మరపురాని సంఘటనలను గురించి ప్రస్తావిస్తూ – "బెంగళూరులో ఒక కళాభిమాని వున్నారు. ఆయన యింట తరచు ఎవరిదో ఒకరిది గాత్రమో, సంగీత కచేరీయో జరుగుతూ వుంటుంది. ఒకసారి నేను అక్కడ వీణ వాయించడం జరిగింది. వారి యిల్లు నాలుగు రోడ్ల కూడలిలో ఒక మెయిన్‌రోడ్ మీద వుంది. ఆ కూడలిలో జనం గుమిగూడారు. ట్రాఫిక్ స్థంభించిపోయింది. అందరూ నన్ను చూడాలని గొడవపెట్టారు. పై అంతస్థుకి నన్ను తీసుకువెళ్ళి వాళ్ళకి చూపించిన తరువాతగాని అలజడి తగ్గలేదు. అలాగే మరోసారి మద్రాసు మ్యూజిక్ అకాడెమీలో హాలు నిండి, బయట కూడా జనం గుమిగూడారు. అంతటి అభిమానం పొందడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఇవి నేనెన్నటికీ మరచిపోలేని సంఘటనలు.

అందుకే అంటాను. నేను విమర్శకులని, విసర్శలని లెక్కచెయ్యనని. ప్రేక్షకులని మాత్రమే లెక్క చేస్తాను. వారి ఆదరణ, అభిమానం పొందడమే నా ధ్యేయం" అంటారు గాయత్రి. □

## బాతుల ముగ్గు

బాతుల ముగ్గు వెయ్యడానికి, నిలువుగా పదమూడు, అడ్డంగా పదమూడు – చుక్కలు పెట్టుకోవాలి. తర్వాత మొదటి బొమ్మలో చూపినట్టుగా, మధ్య పువ్వుతో ఆరంభించి, చుక్కలు కలుపుకుంటూ రావాలి. రంగుల పొడితో వేస్తే ఈ ముగ్గు మరీ అందంగా కనిపిస్తుంది. — కె. రామతులసి



# రాజమండ్రిలోని కే.వి. స్టేట్ హోమ్



**ఆ రోజుల్లో....**

దేశమంతటా బాల్య వివాహాలు విరివిగా జరిగేవి. వధువుకి, వరుడికి వయసులో చాలా తేడా వుండేది. అసలు చాలామంది సంసార జీవితంలోకి అడుగు పెట్టకముందే భర్తలను కోల్పోవడం జరిగేది. అలా వితంతువులైన వారిని, వారి అప్పులే పరాయివాళ్ళని, పాపాత్ములను చూసినట్లు చూసేవారు. వారికి ఎన్నో ఆంక్షలు విధించబడేవి. అప్పటి సాంఘిక దురన్యాయాలలో ముఖ్యమైనవి – బాల్య వివాహాలు, తద్వారా సంప్రాప్తించిన వైధవ్యం.

ఇటువంటి పరిస్థితులను రూపుమాపి స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలని నిర్మూలించడానికి బెంగాల్‌లో రాజా రామమోహన్‌రాయ్, ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగంపంతులు తీవ్రమైన కృషి సలిపారు.

ఈ సాంఘిక దురన్యాయాన్ని రూపుమాపడానికి గల ఏకైక మార్గం–స్త్రీలకు విద్యాబుద్ధులు గరపడం అని భావించారు కందుకూరి వారు. అంతవరకు 'స్త్రీ వంటింటి కుందేలు. ఆమెకు ప్రాథమిక విద్య కూడా అనవసరం' అసి భావించేవారు. అసలు చాలామంది స్త్రీలు – అప్పట్లో తమకు జరుగుతున్నది అన్యాయం అని భావించేవారేకాదు. అదేదో ప్రకృతి సహజంగా జరుగుతున్నదనే అనుకునేవారు.

వీరేశలింగం పంతులు తన రచనల ద్వారా స్త్రీల సమస్యల గురించి ప్రజలకు తెలియజేశారు. అంతేకాదు. తాము జరిపిన పోరాటంలో విజయం సాధించారు కూడా. వితంతు వివాహాలు జరిపించారు. అంతవరకు సంఘంలో గూడు కట్టుకుని వున్న బూజుపట్టిన సాంఘిక దురాచారాలకు స్వస్తి వాక్యం పలికించారు.

అయితే వితంతువులను వివాహం చేసుకునేందుకు అంత త్వరగా ఎవరూ ముందుకు రారు. అందులో ఆ రోజుల్లో వారు అనాఘ్రాత పుష్పాలని తెలిసినా మగవారి అహం అంత పని చెయ్యనిచ్చేదికాదు. ఛాందసత్వం జీర్ణించుకు పోయిన మనుషులు వారు. ఎక్కడో ఏ ఒకరో యిద్దరో సంఘాన్ని వ్యతిరేకించగల వ్యక్తులు వుండేవారు. అంతే. అటువంటి పరిస్థితులలో వితంతువులకు రక్షణ శిబిరాన్ని ఒకదాన్ని నెలకొల్పాల్సిన అవశ్యకత ఎంతైనా వుందనిపించింది పంతులు గారికి.

ఆ విధంగా 1905 లో రాజమండ్రిలో వెలసింది 'విక్టోరియా వితంతు గృహం.'

వీరేశలింగం పంతులు ప్రారంభించిన హితకారిణీ సమాజం (1907) ఆధ్వర్యంలో 1957 దాకా ఆ సంస్థ కార్యకలాపాలు జరిగాయి.

1958 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు స్త్రీ, శిశు సంక్షేమ విభాగం విస్తరణ పథకాలకు పూనుకుంది. ఆ పథకంలో ఒక భాగంగా హితకారిణీ సమాజం నుంచి ఆ 'గృహాన్ని' నడిపే బాధ్యత స్వీకరించింది. దాంతో 'విక్టోరియా వితంతు గృహం' పేరు 'కందుకూరి వీరేశలింగం స్టేట్‌హోం'గా మారింది. రాష్ట్రంలో









ఇటువంటి గృహాలు మొత్తం నాలుగు వున్నాయి.

కేవలం వితంతువులకే కాక పరిచ్యుతులకు, నిరాశ్రితులకు కూడా ప్రస్తుతం ఇక్కడ వసతి సౌకర్యాలు కల్పించబడుతున్నాయి. సాంఘికంగానూ, ఆర్థికంగానూ, నైతికంగానూ పతనం చెందిన బాధితులకు ఇక్కడ ఆశ్రయం లభిస్తుంది. వారికి స్వయం ఉపాధి కల్పనకు శిక్షణ యివ్వబడుతుంది.

అసలు ఈ హోమ్ ముఖ్య లక్ష్యాలు—'ఆదరణ', 'సంస్కరణ', 'పునరావాసం'. ఈ లక్ష్యాలను ఆచరణలో పెట్టి ఘన విజయాలను సాధించడం విశేషం!

రాజమండ్రిలోని 'కె. వి. స్టేట్ హోమ్' కార్యకలాపాలను అసిస్టెంట్ డైరక్టర్ లక్ష్మీతులసి నిర్వహిస్తున్నారు. ఇక్కడ చేర వచ్చిన వనితల వివరాలు తెలుసుకుని వారికి తగిన సలహాలు, సహాయం అందించడానికి కేస్ వర్కర్‌గా వి. రంగమ్మ వున్నారు.

"రాజమండ్రిలోని ఈ గృహం ప్రస్తుతం వందమంది దాకా నివసించడానికి అనువుగా వుంది. 18 నుంచి 35 ఏళ్ళ వయసుగల వితంతువులను, భర్తచే పరిచ్యుతులైన భార్యలను, అనాథలను ఈ హోమ్‌లో చేర్చుకుంటాము. ఆ విధంగా వారు మూడేళ్ళ దాకా వుండవచ్చును. ఈ మూడేళ్ళలో వారికి వివిధ శాఖలలో తర్ఫీదు యిస్తాము. ఆ శిక్షణను ఆసరాగా చేసుకుని వారు తమ కాళ్ళ మీద తాము నిలబడగల శక్తి సముపార్జించుకోగలరు" అన్నారు రంగమ్మ.

ఈ మూడేళ్ళలో వారికి మెట్రిక్‌వరకు విద్య నేర్పిస్తారు. కుట్టు పని, ఎంబ్రాయిడరీ నేర్పుతారు. అచ్చు యంత్రాలలో పని చేయడానికి కావలసిన శిక్షణ యిస్తారు. గ్లాస్ ఏంప్యుల్స్ (ఇంజెక్షన్ సీసాలు) తయారు చేయడం కూడా నేర్పుతున్నారు.

ఈ హోమ్‌లో వివిధ సంస్కృతులకు, ఆచార వ్యవహారాలకు, అభిరుచులకు చెందిన వ్యక్తులు వచ్చి చేరుతూ వుంటారు. అయితే వారందరూ కూడా తమ కులమతాల గురించి మరచిపోయి కలిసి మెలిసే వుంటున్నారు. అసలు, అక్కడ ఆ పట్టింపు, ప్రసక్తి వుండవు.

వారు కూడా సంఘంలో బాధ్యతాయుతమైన వారుగా జీవించడానికి తగిన సహాయం చేస్తాయి ఈ 'ఆఫ్టర్ కేర్‌హోం'లు. అంతే కాదు. ఆ తరువాత వారికి తగిన ఉద్యోగావకాశాలు కల్పించడంలో కూడా సహాయపడతారు. అర్హతలు గల కొందరిని నర్స్ ట్రైనింగ్‌కి కూడా పంపుతారు.

వివాహం చేసుకుని సంసార జీవితంలో స్థిరపడతామన్న అభిలాషగల వారికి వివాహ ప్రయత్నాలు చెయ్యడం కూడా ఈ హోమ్ నిర్వహిస్తున్న కృత్యాలలో ఒకటి.

ప్రభుత్వం ఈ స్కీమ్ ప్రారంభించినప్పటి నుంచి పరిశీలిస్తే – 1626 మంది స్త్రీలు, పిల్లలు కె. వి. స్టేట్ హోమ్‌లో చేర్చుకోబడ్డారు. అందులో 1531 మంది సంస్కరింపబడి నూతన జీవితంలోకి అడుగుపెట్టారు. ఇంతవరకు 33 వివాహాలు హోమ్ ఆధ్వర్యంలో జరిగాయి.

ప్రస్తుతం ఈ 'హోమ్'లో–76 మంది స్త్రీలు, 5 గురు పిల్లలు వుంటున్నారు. వీరిలో 20 మంది వితంతువులు, 30 మంది భర్తలచేత పరిచ్యుతులైన వారు, 24 మంది నిరాశ్రితులు, ఇద్దరు అనాథలు.

రేడియో కార్యక్రమాలు వినడం, పుస్తక పఠనం, పత్రికలు చదవడం, అప్పుడప్పుడు చక్కటి కుటుంబ కథా చిత్రాలు, పౌరాణికాలు చూడడం–మానసిక ఉల్లాసం వినోదం కలిగిస్తాయి వీరికి.

'హోమ్'లో చేరినవారు జట్టుగా విడిపోయి కొందరు వంటపని, కొందరు బట్టలు వుతకడం, కొందరు పరిశుభ్రత–యిలా నిర్దేశింపబడిన పనులు చేస్తూ వుంటారు. అందుకోసం వారు ప్రధాన మంత్రి, ఆహారమంత్రి, ఆరోగ్యమంత్రి, విద్యామంత్రి – యిలా ఎన్నుకోబడుతూ వుంటారు. ఈ విధంగా ఎన్నికయినవారు 'హోమ్' నిర్వహణ క్రమబద్ధంగా జరగడంలో అసిస్టెంట్ డైరక్టర్‌కి సహాయం చేస్తూ వుంటారు.

ఇక యిక్కడ శిక్షణా విభాగాలు ఏమిటంటే – ప్రింటింగ్ ప్రెస్ విభాగాన్ని 1960 లో ప్రారంభించారు. ప్రస్తుతం నలుగురు కంపోజిటర్లు, ఇద్దరు ట్రెడిల్ నడిపే స్త్రీలు, ఇద్దరు బైండర్స్ ఒక సూపర్‌వైజర్ వున్నారు. ప్రస్తుతం ఈ ప్రెస్‌లో 35 మంది దాకా శిక్షణ పొందుతున్నారు. సాధారణంగా యిక్కడి ప్రెస్‌లో శిక్షణ పొందినవారికి స్థానిక ప్రెస్‌లలో కంపోజిటర్లుగా వుద్యోగాలు లభిస్తూనే వుంటాయి. అసలు శిక్షణ పూర్తయ్యేలోపలే కొందరికి వుద్యో

# చుట్టూరా చూడండి

## ఇంకా వీటిని మీరు కేమెల్ క్రైలిన్ రంగులతో శాశ్వతంగా అందంతో నింపగలరు ?

దీపక్ టీ షర్ట్ పైన డోనాల్డ్ డక్...



పడకటింటి గోడ పైన
ఓ పూల కుండీ...



మీ షాపింగ్ బ్యాగ్‌కు
మరో కొత్తదనం...



సోఫా కుషన్‌పై ప్రేమ పక్షులు...



చీరపై మురిపించే రీతిలో మీ
సొంత డిజైన్!...



కేమెల్
క్రైలిన్®




కలర్స్

అందం చిందించే క్రైలిన్ రంగులు. ఎన్నో రకరకాల రంగులు మామూలు పెయింట్ బ్రష్‌తో త్వరగా, సులభంగా వీటితో రంగులు వేయండి. కాటన్ లేక సింథెటిక్ బట్టలు, కొయ్య, గోడలు, గాజు పలకలు, నార ఉత్పాదనలు, లెదర్ వస్తువులు— వేటిపైన అయినాసరే. ఒక్కసారి ఆరితే రంగులు వెలిసిపోకుండా శాశ్వతంగా వుంటాయి. మీ కుటుంబానికీ, మీయింటికీ మీరిచ్చే అందాల కానుక!



కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్ డివిజన్,
బొంబాయి 400 059 (ఇండియా)

వీటితో మీరు లెఖ్ఖలేనన్ని
తీరుతెన్నులతో అందాన్ని
నింపవచ్చు!

Vision 769-Tel



గాలు లభించడం కూడా జరుగుతూ వుంటుంది.

కుట్టు నేర్చుకోవాలన్న అభిలాషగల 34 మందికి ఎమ్. విమలాదేవి యిక్కడ కుట్టుపని నేర్పుతున్నారు. ఇలా కుట్టుపని నేర్చుకున్నవారిలో కొందరికి బయట వృత్తిపనులు లభిస్తూ వుంటాయి. మరి కొందరికి హోమ్‌వారే వారి ప్రావీణ్యతను బట్టి కుట్టు మిషన్‌లను వుచితంగా యిస్తూ వుంటారు. సమితి కార్యాలయాల్లో వారికి రూ. 75 చొప్పున పార్ట్‌టైం ఉద్యోగాలు కూడా లభిస్తూ వుంటాయి.

ఇక ఇంజక్షన్ ఏంప్యూల్ యూనిట్. ఈ విభాగం 1961 లో ప్రారంభించబడింది. ఇక్కడ 1 సి. సి. నుండి 25 సి. సి. దాకా ఏంప్యూల్స్ తయారు చేస్తున్నారు. 1975 – 76 సంవత్సరంలో సైంటిఫిక్ పరికరాలు చేయడం కూడా ప్రారంభించారు. ఇక్కడ తయారు చేసిన పరికరాలను మద్రాసు, విజయవాడ, హైద్రాబాదు, బెరహాంపూర్‌లలోని మందుల కంపెనీలకు, అధికంగా సరఫరా చేస్తున్నారు.

"అయితే ఈ విభాగం మాత్రం అంత ఉత్సాహకరంగా లేదు. కారణం వాటి ఖరీదు ఎక్కువైనా యంత్రాలతో చేసిన వాటి మీదే వాడకందార్లు మోజు చూపడం. మేము తయారు చేసే – ఏంప్యూల్స్, నాణ్యతలో వాటికి ఏమాత్రం తీసిపోవు. పాఠశాలలూ, కళాశాలలూ మేము తయారుచేసిన పరికరాలు తప్పనిసరిగా కొనుగోలు చెయ్యాలని చెప్పడానికి ప్రయత్నిస్తున్నాము. అప్పుడు మేము తయారు చేసినవాటిని పంపిణీ



చెయ్యడానికి మాకు ఎటువంటి సమస్య వుండదు. ఉత్పత్తి కూడా అధికమవుతుంది." అన్నారు లక్ష్మీతులసి.

"అసలు ఈ పథకం ప్రారంభించినప్పుడు 'హోమ్'లో చేర్చుకోవడానికి కనీస వయో పరిమితి 18 ఏళ్ళుగా నిర్ణయించాము. అప్పట్లో ఆ నియమావళి ప్రకారం ఆ విధంగా వయో పరిమితి నిర్ణయించడం జరిగింది. కాని నేడు బజార్లో లభిస్తున్న చవకబారు సాహిత్యం, సినిమాలు పదహారేళ్ళవాళ్ళ మీద కూడా అనారోగ్యకరమైన ప్రభావం చూపెడుతున్నాయి. దాంతో నైతికంగా పతనమయినవాళ్ళలో పదహారేళ్ళవాళ్ళని కూడా స్వీకరించాల్సి వస్తోంది" అన్నారు ఆమె.

ఇక్కడ చేరినవాళ్ళు ఎప్పుడుబడితే అప్పుడు యిక్కడి నుంచి వెళ్ళిపోవచ్చును. కొందరు వారికి కావలసిన వసతులన్నీ హోమ్‌లో కల్పించినా అప్పుడప్పుడు తమ గత జీవితానికి స్వస్తి చెప్పలేక వెళ్ళిపోతూ వుంటారు. ఇక్కడి వారిని ఒంటరిగా బయటకు పంపడమంటూ జరగదు. సినిమాలకు వెళ్ళినప్పుడు కూడా స్టాఫ్‌లో ఎవరో ఒకరు తోడుగా వుంటారు. ఇక్కడ వాతావరణానికి అలవాటు కాలేని వారిని వారి దగ్గర బంధువులకు కబురు పంపి, పంపేస్తూ వుంటారు.

రాష్ట్రంలోని యితర 'హోమ్'ల కంటె రాజమండ్రిలోని కె. వి. స్టేట్ హోమ్‌లో వివాహాలు అధికంగా జరుగుతూ వుంటాయి.

ఇలా వివాహాలు జరిగి వెళ్ళినవాళ్ళందరూ కూడా హోమ్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే వుంటారు.

"ఇళ్ళల్లోంచి పారిపోయి, ఎవరి మాయలోనో పడి మోసపోయినవాళ్ళు – యిళ్ళకు వెళ్ళడానికి భయపడో, గోదావరిలో దూకబోయి రక్షింపబడో యిక్కడికి చేరుకుంటూ వుంటారు. ఒక్కోసారి వీళ్ళ కథలు వింటే ఎంతో బాధకలుగుతుంది. కాని మేము చెయ్యగలంతలో వీరికి కొంత ఉపాధి కల్పనకి కృషి చేస్తున్నప్పుడు, వాళ్ళు జీవితంలో స్థిరపడినప్పుడు–ఎంతో ఆనందం కలుగుతుంది. ఏదో సాధించామన్న సంతృప్తి మిగులుతుంది.

"ఈ హోమ్‌లో చేరే–నిస్సహాయులు, పరిత్యక్తులు, అనాథలు, ఏదో ప్రలోభంతో మోసపోయిన వాళ్ళు – యిలా ప్రతి ఒక్కరూ దీనిని చక్కగా ఒక ఆదర్శంతో వుపయోగించుకోవాలి. ఇక్కడ నేర్చిన విద్యను ఆచరణలో పెట్టి, తమ గత జీవితాన్ని మరచి తమ జీవితాలను చక్కదిద్దుకోవాలి. తమంతట తాము సంఘంలో నిలబడగలగాలి. అలా స్వయం కృషితో పైకి రావడమన్నది ఎంతో గొప్ప విషయం." అన్నారు లక్ష్మీతులసి. □

# ఆధునిక నాట్యకళాకారిణి

## ఆశాకూర్లవాలా

అదో పెద్ద హాలు....ప్రేక్షకులతో కిటకిట లాడుతూంది.

ఆధునిక పద్ధతిలో ఒక యువతి అందంగా నాట్యం చేస్తూ వుంది. శరీరాన్ని బంతిలా చుట్టి 'బాలే' లాంటి నృత్య భంగిమలలో ఆమె చేసే నాట్యంతో పాటు ప్రేక్షకుల హృదయాలు కూడా నాట్యం చేస్తున్నాయి.

ప్రదర్శనసాంతం చూసి బయటికి వచ్చిన ఒక ప్రేక్షకుడు "ఏమండీ!....ఇలాంటి నాట్యప్రదర్శనే చాలా రోజుల క్రితం చూసినట్టు జ్ఞాపకం. అయినా అప్పటి ప్రదర్శనలిచ్చిందెవరో మాత్రం నాకిప్పుడు సరిగా గుర్తులేదు." అని అన్నాడు ప్రక్కన వస్తున్న మిత్రునితో.

"ఔనండీ. రెండు దశాబ్దాలకు పూర్వమే నాట్య కళలో గొప్ప మార్పులు తీసుకొచ్చిన ఆ కళాకారిణి–మార్థాగ్రహామ్. ఈ అమ్మాయి కూడా అచ్చం అలాగే నాట్యం చేస్తుంది." అని బదులు చెప్పారాయన.

ఇంతకూ ఎవరీ కళాకారిణి?

హైదరాబాదులో పుట్టి–బొంబాయిలోనూ, అమెరికాలోనూ విద్య నేర్చుకున్న ఆశా కూర్లవాలా — అమెరికాలో సుప్రసిద్ధమైన "మార్థా గ్రహామ్ నాట్య పాఠశాల"లో ఆధునిక నాట్య పద్ధతులు నేర్చుకున్నారు. అలాగే–హార్లెమ్ డ్యాన్స్ థియేటర్‌లోనూ జూలియార్డ్, మెర్సీ కానింగ్‌హామ్ పాఠశాలలోనూ నాట్య శిక్షణ పొందారు.

ఆశా నాట్యశిక్షణ పొందిన మార్థాగ్రహామ్ పాఠశాలలోనే, ఆమెకు ఉపాధ్యాయినిగా పనిచేసే అవకాశం లభించింది!

'మండలా' అనే పేరుతో ఆశా ఒక నాట్య బృందం స్థాపించారు. 1973-74 సంవత్సరాలలో ఈ బృందం భారత దేశం పర్యటించి, ప్రదర్శనలిచ్చింది.

ముఖ కవళికలలో మాత్రమే కాకుండా శరీరాంగాల కదలికలలో సైతం భావోద్రేకాలను సువ్యక్తం చేసే ఈమె నాట్యం చూసినప్పుడు "ఈమె కాలివ్రేళ్ళమీదే నాట్యం చేస్తుందా?" అనిపిస్తుంది. 'శరీర దారుఢ్యం కోసం మీరు ఏవైనా ప్రత్యేకమైన జాగ్రత్తలు తీసుకుంటారా?' అని ప్రశ్నించినప్పుడు– "నేను నాట్యం మీదనే అధిక శ్రద్ధ చూపించాను. కాని శరీర వ్యాయామం పట్ల అంత శ్రద్ధ వహించలేదు"–అన్నారు నవ్వుతూ.

ప్రస్తుతం–హోమీ బాబా ఫెలోషిప్‌లో ఈమె భారతీయ సాంప్రదాయ నాట్య పద్ధతులలో శిక్షణ పొందుతున్నారు.

ఈ రెండేళ్ళ శిక్షణను పూర్తి చేసుకుని అమెరికా వెళ్ళి అక్కడ నాట్య ప్రదర్శనలు ఇవ్వడానికి నిశ్చయించుకున్నట్టుగా ఆశా చెప్పారు.

"నాకు భారత దేశంలో నాట్య పాఠశాలను స్థాపించే ఉద్దేశం లేదు. ఎంచేతంటే ఇక్కడ నేను నేర్చుకోవలసిన విషయాలే ఇంకా చాలా వున్నాయి" అంటూ సవినయంగా కారణం కూడా వివరించారామె.

పాశ్చాత్య నాట్య. పద్ధతులను భారతీయ సాంప్రదాయ నేపథ్యంతో మేళవించి "అమృత్" 'పూరీనైట్' అనే రెండు నాట్య ప్రదర్శనలు ఇవ్వబోతున్నారు ఆశా.

## పళ్ళు

పంటికి ఏదైనా రోగం వస్తేనే పళ్ళ డాక్టర్ని చూస్తారు గాని, మామూలుగా అయితే ఎవరూ చూడరు. కాని, ఆరు నెల్లకో సారయినా దంతవైద్యుడిని సంప్రతిస్తూ వుంటే, పళ్ళ ఆరోగ్యం ఎలా వుంటోందో తెలుస్తుంది. పళ్ళు ఆరోగ్యంగానే వున్నాయని మనం అనుకుంటాము గాని, అవి ఆరోగ్యంగా వుండకపోవడం కూడా జరగవచ్చు! మాంసం, చేపలు, కోడిగుడ్లు, పాలు, ఆకుకూరలు మొదలైనవి పంటి ఆరోగ్యానికి మంచివి. అలాగే ఆపిల్ పండు ముక్కలు, పచ్చి కారెట్ దుంపా కూడా బాగా నమిలితే పళ్ళకు మంచి మేలు కలుగుతుంది. అయితే, తీపి పదార్థాలు మాత్రం పళ్ళకు చెడు చేస్తాయి. ముఖ్యంగా బిస్కట్లు, చాకొలేట్స్, కేక్స్, తక్కిన తీపి పదార్థాలు, తీపి గల పానీయాలు (వేడివి, చల్లనివీ) పళ్ళకు మంచి చెయ్యవు. అందుకు ఒకటి చెయ్యవచ్చు. తీపి పదార్థం తిన్న వెంటనే, నోరు బాగా పుక్కిలించి కడిగేసుకోవాలి. ముఖ్యంగా రాత్రి పడుకునే ముందు పళ్ళు 'బ్రష్' చెయ్యడం మాత్రం చాలా అవసరం.

ఈమె నాట్య ప్రదర్శనలలో భారతీయ సంగీత వాద్యాలు మాత్రమే ఉపయోగింపబడతాయి.

"నేను, సాంప్రదాయికంగా పురాణ గాథలను ప్రదర్శించే పద్ధతులను అనుసరించ తలచుకోలేదు. కాని ప్రాక్ పశ్చిమ నాట్య రీతులను ఆమూలాగ్రం ఆకళింపు చేసుకుని ఈ రెండు పద్ధతుల కలయికతో - ఈనాటి సామాజిక స్థితిగతులకు అనుగుణంగా— మానసిక ఉత్తేజం కల్గించే వినూత్న రీతిలో నాట్య ప్రదర్శనలు జరపాలని నా ఆశ" అంటారు ఆషా కూర్ల వాలా. *



" చాలామంది 'పలావ్'లు చేస్తారుగాని, 'మహ్మదీయుల పలావ్' మాదిరిగా కుదరటం లేదు" అంటూ వుంటారు. వండే విధానం తెలుసుకుంటే ఎవరైనా చేయవచ్చు. అదెలాగో చెబుతాను.




### కిచిడి

'మసూరి'పప్పు దొరికినట్లయితే ఆ పప్పుతో చేసుకోవచ్చును. లేదా-వేయించిన పెసరపప్పుగాని, పచ్చి కందిపప్పుగాని వేసుకోవచ్చును. శేరు బియ్యానికి $\frac{1}{4}$ పెసరపప్పు, నెయ్యి $\frac{1}{4}$ శేరు, అల్లం 25 గ్రాములు, వెల్లుల్లి పెద్దవి 3, గసగసాలు 10 గ్రాములు.

ముందుగా బియ్యం, పప్పును కలిపి ఒక చెంబుతో అంచువరకే కొలవాలి. రెండు చెంబులు అయితేసరేసరి లేదా ఒక చెంబుడయి, ఇంకేమైనా మిగిలిన కొద్ది బియ్యం వుంటే అవి ఏ గ్లాసుతోనో కొలవాలి, చెంబుడు బియ్యానికి, చెంబున్నర నీళ్ళు కొలవాలి, అంటే శేరు బియ్యానికి శేరున్నర నీళ్ళన్నమాట. గ్లాసు బియ్యానికి గ్లాసున్నరనీళ్ళు. కొలతలు మర్చిపోకూడదు.

కిచిడి చేస్తామనగా ఇవన్నీ ముందుగా కొలిచి అట్టే పెట్టుకోవాలి. అప్పుడు పప్పుతో కలిపిన బియ్యాన్ని శుభ్రంగా కడిగి వార్చివుంచాలి. నీళ్ళన్నీ ఒడిగిపోవాలన్నమాట. అల్లం, వెల్లుల్లి, గసగసాలు విడివిడిగా రుబ్బాలి. రుబ్బిన ముద్దలను అందులో వెల్లుల్లి, అల్లం ముద్దలు రెంటినీ కలిపి వుంచాలి లేదా విరిగిపోతుంది.

దళసరిపాత్ర పొయ్యి మీద పెట్టి అందులో సగం నెయ్యి పొయ్యాలి. అది కాగిన తర్వాత రుబ్బి వుంచుకొన్న అల్లం, వెల్లుల్లి ముద్దలను వేసి బాగా వేగనివ్వాలి. ఆ తర్వాత గసగసాల ముద్దను వేసి కొద్దిసేపు దోరగా వేగనివ్వాలి. అడుగంటకూడదు. అందులో కొలిచిన నీళ్ళు పోసి-కావలసినంత ఉప్పు, కాస్త పసుపు వేసి మరగనివ్వాలి.

ఎసరు మరిగేటప్పుడు వార్చి వుంచుకొన్న బియ్యాన్ని ఎసరులోపోసి పెద్ద అట్లకాడతో త్రిప్పి మూత పెట్టాలి. అది కళపెళా వుడికేటప్పుడు క్రింది మంటను తగ్గించాలి. ఇప్పుడే మీరు 'అన్నాన్ని' పాడవకుండా చూసుకొనేది – మధ్య మధ్య అట్లకాడతో అన్నం చితకకుండా జాగ్రత్తగా త్రిప్పాలి. అన్నం యిగిరేటప్పుడు మిగిలిన నెయ్యి పోసెయ్యవచ్చు. ఎక్కువ బియ్యాన్ని వండాలనుకున్నప్పుడు, నిప్పులను తీసి మూత పైన వేస్తే పై అన్నం మ్రగ్గుతుంది. ఇక్కడొక విషయం గమనించాలి. అడుగున పెద్ద మంటగాని వున్నట్లయితే అన్నం వుడకదు. నిప్పులు తగుమాత్రమే వుండాలి. నింపాదిగా అన్నం యిగురుతుంది. మధ్య మధ్య కలుపుతూ వుండాలి.

### పలావ్

అన్నీ పైకొలతలు మాదిరిగానే - కాకపోతే సరుకులు వట్టిక ఎక్కువవుతుంది. శేరు బియ్యానికి - నెయ్యి $\frac{1}{2}$ కేజి, అల్లం 50 గ్రాములు, వెల్లుల్లి 50 గ్రాములు, గసగసాలు 25 గ్రాములు, యాలకులు $\frac{1}{2}$ తులం, దాచిన చెక్క $\frac{1}{2}$ తులం, లవంగాలు $\frac{1}{2}$ తులం, దనియాలు 10 గ్రాములు, జీడిపప్పు $\frac{1}{4}$ కేజి, జాపత్రి 25 పైసలు, కప్పు పెరుగు, పచ్చిమిర్చి 8 కాయలు, టొమాటోలు 5, కొబ్బరి కాయ 1, ఉల్లిపాయలు 5, కొత్తిమిర – లేక, పుదీనా కట్ట.

ముందుగా దనియాలు దోరగా వేగనిచ్చి పొడుంచేసి జల్లించుకోవాలి. ఆ తర్వాత యాలకులు, దాచిన చెక్క, లవంగాలు ఈ మూడూ కలిపి మెత్తగా పొడుం చెయ్యాలి, జీడిపప్పు సగం తీసుకుని మెత్తగా పొడుం చెయ్యాలి, అలాగే కొబ్బరి కోరు రుబ్బి ఒక కప్పు పాలు తీసుకోండి, టొమాటోలు రెండేసి ముక్కలు చొప్పున చేయండి. ఉల్లిపాయలు సన్నగా పొడుగ్గా తరిగి అన్నీ రెడీగా వుంచుకోండి. బియ్యం మాత్రం చాలా పాతవిగా, సన్నగా వుండాలి. సన్న బియ్యం అయితే నెయ్యి పీల్చదు సరిగదా అందంగా, రుచిగా వుంటుంది.

దళసరి పాత్ర పొయ్యిమీద పెట్టి సగం నెయ్యి పొయ్యాలి, అది కాగిన తర్వాత ఉల్లిపాయ ముక్కలు వేసి ఎర్రగా వేగాక-అల్లం, వెల్లుల్లి ముద్దను వేసి వేగనివ్వాలి. అది వేగిన తర్వాత గసగసాల ముద్దను వేసి వేగనివ్వాలి. ఆ తర్వాత జీడిపప్పు, పచ్చిమిర్చి, జాపత్రి వేసి కాస్త వేగనివ్వాలి. 'కిచిడీ'కి చెప్పిన కొలత ప్రకారమే, దీనికి కూడా ఎసరు పొయ్యాలి. ఐనా, కాస్త తగ్గించి పొయ్యటం మంచిది. ఎందుచేతంటే – కొబ్బరిపాలూ, టొమాటోలు వుండటం వల్ల చిమిడిపోతుంది.

ఎసరు పొయ్యగానే ఈ మసాలా పొడులు నాలుగు రకాలను అందులో పోసి గుప్పెడు ఉప్పు పోసి కలపండి. నీళ్ళు మరిగినప్పుడు బియ్యం పోసి కలిపి మూతపెట్టండి. అన్నం యిగిరేటప్పుడు–కొబ్బరి పాలు, జీడిపప్పు పొడుం, టొమాటో ముక్కలు, పెరుగు, కొత్తిమిర ఇవన్నీ పోసి జాగ్రత్తగా కలిపి మూతపెట్టండి. పొయ్యి క్రింది మంట మాత్రం తీసివెయ్యండి, అది మరిచిపోకూడదు. అన్నం మాత్రం దగ్గరగా అయ్యేటప్పుడు మిగతా నెయ్యి పొయ్యటం మరువకండి. ఈ 'పలావ్' వండేటప్పుడు 'పప్పు' మాత్రం వెయ్యకండి. 'పలావ్' దగ్గర పడుతున్నప్పుడు చాలా జాగ్రత్తగా అట్లకాడతో కలపండి.

### కోడి కుర్మా

పలావ్‌లోకి మాంసంగాని, రొయ్యలుగాని, కోడిగాని చేసుకోవచ్చు. ఒక కోడికిగాని, లేదా శేరు బియ్యానికి శేరు మాంసంగాని బాగుంటుంది.

'కుర్మాకు' – పలావ్‌కి చెప్పిన దినుసులలో 'టొమాటా' లు తప్ప అన్నీ వేసుకోవచ్చు.

సరుకులు మటుకు — జీడిపప్పు దగ్గర నుంచి 'మసాలా' సరుకుల వరకూ అన్నీ. వేసుకోవచ్చు. ఉల్లిపాయలు రెండు. కొబ్బరిపాలు ఒక కప్పు. పెరుగు రెండు గ్లాసులు. పచ్చిమిర్చి 30 కాయలు (కొయ్యకూడదు) వేసుకోవచ్చు. కానీ ఉల్లిపాయలు మాత్రం ఎక్కువ వెయ్యకండి. పెరుగుతో ఉడకటం వల్ల కలియబడదు.

మసాలాలు. లవంగాలు. యాలకులు. దాచిన చెక్క మాత్రం. సగం సగం మటుకే ముద్దలా నూరి. తతిమ్మా సగం అలా వుంచేయాలి. ముందుగా మాంసం శుభ్రం చేసి అందులో (కారం తప్ప) పసుపు. పచ్చిమిర్చి. నూరి వుంచుకొన్న మసాలాలు. ఉల్లిముక్కలు. ధనియంపొడి కొద్దిగా. అల్లం. వెల్లుల్లి. గసగసాల ముద్దలను మొత్తం పెరుగుతో సహా కలిపి వుంచుకోవాలి.

పొయ్యిపైన వెడల్పాటి పాత్ర పెట్టి ¼ కేజీ నెయ్యిపోసి. కాగిన తర్వాత – నానబెట్టి వుంచిన లవంగాలు. యాలకులు మొదలైన ఈ మూడు సరుకులూ తాలింపులో వేయండి. వేయగానే ఉబ్బుతాయి ఆ వెంటనే పెరుగు కలిపిన మాంసంను పిండి తాలింపులో వేసి కొంతసేపు మగ్గనివ్వాలి. మాంసం సగం వుడికేటప్పుడు– జీడిపప్పు వెయ్యాలి. 'కుర్మా' దగ్గర పడేటప్పుడు–కొబ్బరిపాలు. కొత్తిమిర వేసుకొని బాగా దగ్గరగా ఉడకనిచ్చి 'షేర్వా'తో దింపుకుంటే 'పలావ్'లోకి బాగుంటుంది. కొబ్బరిపాలు ముందుగా వెయ్యకండి–మాడి పూరుకుంటుంది. కుర్మాను పెరుగుతోనే ఉడకనివ్వాలి–నీరు పొయ్యకూడదు. పెరుగు బాగా పుల్లగా లేకుండా. మరీ కమ్మగానూ లేకుండా వుండాలి.

ఇంకొక విషయం—ఈ కుర్మాను. పలావ్‌ను కలిపి 'బిరియాని' తయారు చేసుకోవచ్చు. అదెలా అంటే–ముందుగా కుర్మాను నెయ్యిపైకి తేలేవరకూ యిగరనిచ్చి దించాలి. ఆ తర్వాత పలావ్ పొయ్యిపైన వుడికేటప్పుడు సగం పదునులో వుండగా. ఈ కుర్మాను–అన్నం సగం సగం అట్లకాడతో వత్తిగిల్లజేసి కొద్ది కొద్దిగా అందులో వేసి జాగ్రత్తగా 'మిక్స్' అయ్యేటట్లు కలిపితే అదే 'బిరియాని' అవుతుంది.

—ఎమ్. హసన్‌బేగం

# చేను మేసే కంచెలు

దేవుళ్ళకన్న దేవతలే మన దేశంలో ఎక్కువ. ఎక్కువగా పూజలందుకునేది కూడా దేవతలే. సీతారాములు. రాధాకృష్ణులు అంటూ భార్య ప్రాముఖ్యం చాటే దంపతుల పట్టిక రాస్తే ఈ సంచిక పట్టదు. ఇక దేశాన్ని మాతృదేశంగా, మాట్లాడే మాటల్ని మాతృభాషగా కొనియాడుతూ స్త్రీ మూర్తిని పవిత్రంగా భావించే పుణ్యభూమి మనది.

ఈ విషయంలో మనకు సాటిలేరు అని గొంతు చించుకోవడంలో మనకు పోటీ చేయగల దేశాన్ని భూగోళం మీద భూతద్దంతో వెదకవలసిందే!

కాని ఎదుటి ప్రపంచాన్ని. సామాన్య స్త్రీల స్థితిగతులను ఉన్నదున్నట్టు చూస్తే – పై మాటలన్నీ నేతిబీరకాయలేనా? అన్న అనుమానం తలెత్తుతుంది. అనాది నుంచీ ఆడదానికి అన్యాయమే జరుగుతూంది—అనే వారి మాటల్లో నిజం నిప్పులా చురుక్కుమంటుంది. బాల్య వివాహాలే కాదు. ఈ దేశంలో సజావుగా సాగిన సతీసహగమనం లాంటి దారుణ మారణహోమం ఆగడానికి రాజారామ్ మోహన్‌రాయ్ తన జీవిత కాలాన్నంతా ధారబోయవలసివచ్చింది! పై విషయం అర్థం చేసుకోడానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే!

సామాన్య ప్రజానీకంలో స్త్రీ స్థానం ఎలా వుందో తర్వాత చూద్దాం. అయితే ఇవాళ న్యాయ రక్షణకోసమే వున్న రక్షకభటులు అక్కడక్కడ. అప్పుడప్పుడు సామాన్యస్త్రీల శీలం పాలిటి యమ కింకరులుగా మారడం – మన సంస్కృతీ స్థాయి ఎంతగా దిగజారిందో చూపే బెల్జియం అద్దం!

హరిజనులకు. దళిత వర్గాలకు గుణపాఠం నేర్పాలన్న అహంభావంతో ఆడవారి శీలంతో ఆటలాడుకునే రాక్షసకృత్యాలు దేశం నలుమూలలా సాగుతూ వున్నాయి – అన్న వార్తలకు కరువే లేదు ఇవాళ్టి మన దినపత్రికలలో!

ఇవన్నీ సత్యాలు కావు; ఇందులో నిజం లేదు అని సాధించేవారికి–చెవులు మెలేసి ఈ దారుణ సత్యాన్ని చూపుతుంది — ఇటీవల హైదరాబాద్ పోలీస్ స్టేషన్‌లో జరిగిన ఓ దుర్ఘటన!

మరొకటి: ఒక సంవత్సరం క్రితం తమిళనాడులో పోలీసు నిర్బంధంలో వున్న 'పూంగావనం' అనే పదహారేళ్ళపడుచును రోజు తప్పకుండా ఒకటిన్నర నెలలపాటు శీలభంగం చేశారట!

కళ్ళను కాపాడవలసిన రెప్పలే వాటిపై నిప్పులు చెరగడం – సర్వసాధారణమైన విషయం అయింది–అశోకచక్రం రాజ్యమేలే మన పవిత్ర భారతదేశంలో!

ఒక ఆడది పోలీసు నిర్బంధంలో వుందీ అంటే – ఆమెకు అవాళ శీలభంగమే అన్న దౌర్భాగ్యస్థితి దాపురించింది.

ఇలాంటి నైచ్యపరిస్థితిని రూపుమాపవలసిన ధార్మిక బాధ్యత. ఉన్నత పదవుల్లో వున్న ప్రతి ఒక్కరిమీదా వుంది!

ఊకదంపుడు ఉపన్యాసాలతో. వాగ్దానాల నీటిమూటలతో తీరే సమస్యకాదిది. భారతీయ శిక్షాస్మృతిలో మౌలికమైన మార్పులు తీసుకు రావలసిన అవసరం ఎంతైనా వుంది.

ఈ సమస్యల ఉధృత రూపాన్ని పెద్దల దృష్టికి తీసుకొచ్చే సత్సంకల్పంతో – దేశం మొత్తం మీద మహిళామండలుల ప్రతినిధులు ఇటీవల రాష్ట్రపతిని కలుసుకుని ఒక విజ్ఞాపన పత్రం సమర్పించారు.

ఖైదు చేయబడిన స్త్రీలను పోలీస్ స్టేషన్‌లోనే నిర్బంధంలో ఉంచడానికి బదులు. వెంటనే జైలుకు పంపాలి.

నేరం చేసిన స్త్రీలను రాత్రుల్లో ఖైదుచేయడం. విచారణకోసం పోలీస్‌స్టేషన్‌కు రాత్రుల్లో తీసుకు వెళ్ళడం కూడదు.

స్త్రీ ఖైదీల విషయాలను స్త్రీ పోలీసులే చూసుకోవాలి.

స్త్రీలపట్ల అసభ్యకరంగా అమానుషంగా ప్రవర్తించే పోలీసులపై కఠినమైన చర్యలు తీసుకోవాలి.

ఇవీ–వారు సమర్పించిన విజ్ఞాపన పత్రంలోని ప్రధాన అంశాలు.

వీటిని చిలుక పలుకులుగా వల్లించినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదు. కేంద్ర. రాష్ట్రప్రభుత్వాలు ఈ అంశాలను సక్రమంగా అమలుపరచాలి. అప్పుడే అవినీతిని అరికట్టగలం. నాడే – దేవతగా పూజించే మాట ఎలా వున్నా–స్త్రీని స్త్రీగా. సాటి మనిషిగా గుర్తించే మానవత మనలో మాసిపోలేదని రుజువు చేసిన వాళ్ళమవుతాం.

—బాల

శ్రీమతి అలిగింది. ఇవ్వాళ్టికి మూడోరోజు. అలక వహించటానికి కారణం ఊహించటం పెద్ద కష్టమైన విషయమేమీకాదు. అలా అని అందరిలా అలిగిందా అంటే 'కాదు' అని కూడా చెప్పాల్సి వుంది. సాయంత్రం సకాలానికి ఆఫీసు నుంచి ఇంటికి శ్రీవారు రెక్కలు కట్టుకుని వాలలేదనో, లేక ఆరుగంటల సినిమా'షో'కి వెళదామని, అర్జంటు పనిచేత ఆఫీసుపని పూర్తవక రాలేకపోయాననీ శ్రీవారు చెప్పిన సమాధానం నచ్చకనో, మల్లెపూలు కొనిపెట్టలేదనో, తెల్లచీర నీలి అంచు ఎంబ్రాయిడరీ బార్డరున్నది—తన కిష్టమైనది తెస్తానని తేలేదనో శ్రీమతి అలగ లేదు. మరి....ఊహించటం పెద్ద కష్టమేమీ కాదులే అని పొరబడ్డ సామాన్యులకు శ్రీమతి అలక గురించి కొంత ఆలోచించవల్సిందే.

'శ్రీమతి ఏమన్నా శ్రీవారూ....తందానతాన' అని కూనిరాగాలు తీసే శ్రీవారికి మాత్రం శ్రీమతి అలక్కి కారణం సంపూర్ణంగా తెలుసు. శ్రీమతి అప్పుడప్పుడు తనకు ఇష్టమైన నల్లసిరాతో తెల్ల కాగితాలను ఖరాబుచేస్తుంది! ఇది శ్రీవారి ఉవాచ. కాని శ్రీమతి అందరి స్త్రీల్లా కాకుండా లోకాన్ని తను కొద్దిగా నయినా ఊహించి, ఆలోచనలు సాగించగలనని నమ్మకం. దానితోనే అప్పుడప్పుడు కాగితాలను నింపగలిగేది. రెండు, మూడు పత్రికల్లో తన పేరు చూసుకున్నాక తన మీద తనకు కొంత ధైర్యం కలిగింది. ఆ ధైర్యంతోనే తన ఆలోచనలకు ఒక రూపం కల్గించాలనే తపన ఆమెలో ముదిరి ఆమె కలాన్ని మరింత పరుగులు తీయించసాగింది.

రోజూ లాగే ఆ రోజూ తెల్లవారింది. శ్రీవారే ఉదయం లేచి అన్ని కార్యక్రమాలు ముగించుకుని శ్రీమతికి కాస్త తోడ్పడుతూ ఉంటారు. తొమ్మిదిన్నరకల్లా భోజనం ముగించి, శ్రీమతితో ఒంటికాలిపై నిలబడే బస్సుకోసం పరుగులుదీశారు. పావుగంట ఆలస్యంతో ఆఫీసు చేరుకున్నాక మరో పావుగంటలో ఆఫీసరుగారి పిలుపొచ్చింది. బుద్ధిమంతుడిలా ఆయన గదిలోకి అడుగుపెట్టాక ఆయన అర్జంటుగా పుటప్ చెయ్యమన్న ఫైలందుకుని అరగంటవరకు కుస్తీ పట్టాడు. ఈ మధ్యలో 'వెరీ అర్జంట్! వెరీ అర్జంట'ంటూ రెండుసార్లు కబుర్లూ, త్వరగా కంప్లీట్ చేద్దామన్నా ఆ క్లర్కు సెలవులో ఉండటం వల్ల పని అవలేదు. ఇంతలో ఆఫీసరు గారి చిందులు, కేకలు, పిలుపులు. ''సీ! మిష్టర్ రావ్! అర్జంటంటూ వత్తిడి చేస్తున్నా ఇంకా పూర్తవలేదు. నో! ఇటీజ్ టూ మచ్ బాడ్... రియల్లీ ఇట్ షోస్ యువర్ ఇనెబిలిటి ఇన్ వర్క్!'' అంటూ సన్నని చీవాట్లు, విసుగుదలలు.

''నో సర్! ది కంసెర్డ్న క్లార్క్ ఈజ్ ఆన్ లీవ్. ది ఇంపార్టెంట్ పేపర్స్ ఆర్ ఆల్ విత్ హిమ్'' అని ఒళ్ళు మండిపోయి అనాలనుకున్నా గొంతు నొక్కుకుపోయింది. ''ఆల్‌రైట్! సబ్మిట్ ది ఫైల్ ఇమ్మీడియట్లీ''. చిర్రుబుర్రు లాడాడు ఆఫీసరు. ఫైలు సబ్మిట్ చేసి కుర్చీలో కూలబడ్డాడు రావ్. ఆఫీసరు ఈ రోజు టూర్ పోతున్నాడు. నిజానికి నిన్ననే చెప్పాడు తనకు ఆ ఫైలు కావాలని. కాని ఆ వెధవ, ప్రక్క సీట్లో పాపారావ్ అత్తారింటికి చెక్కేసాడు పండక్కి—తనకి చెప్పనయినా చెప్పకుండా.

ఆఫీసరు వాన్ స్టార్టయిపోగానే కుర్చీలోంచి లేచాడు రావ్. కాంటీన్లో టీ త్రాగి, కణతలు రుద్దుకుంటూ హాఫ్ డే సి.ఎల్ పారేసి ఇంటికి ప్రయాణమయ్యాడు. తీరా ఇల్లు చేరేసరికి, తాళం కప్ప దర్శనం. పావుగంట తర్వాత శ్రీమతి హాజరయింది చేతిలో కాగితాలకట్ట, పెన్నుతో సహా. అసలే అసహనంగా వున్న శ్రీవారికి శ్రీమతి పద్ధతేం నచ్చలేదు. ఇక ఉగ్గబట్టలేక ''ఎప్పుడూ ఆ కాగితాలే ప్రపంచమనుకుంటే వేరే పనులేం అవసరం లేదా నీకు? అయినా ఈ వేళప్పుడు ఎక్కడ నీ కాన్ఫరెన్స్‌లు? నీకోసం ఎంతసేపు వెయిట్ చెయ్యాలి? బొత్తిగా బుద్ధి, జ్ఞానం లేకుండాపోతున్నాయి. ఈసారి నుంచీ నీ చేతిలో కాగితాలూ, పెన్నూ చూస్తే విసిరవతల పారేస్తా. బీ కేర్‌ఫుల్!'' ఆఫీసరు తనకు వడ్డించినదానికి రెట్టింపు వేగంతో సీరియస్‌గా



దులిపిపారేశాడు.

శ్రీమతి కొంచెం కంగారుపడింది. అయినా ధైర్యంగా అతన్ని త్రోసిపుచ్చి "అయ్యగారి వేళప్పుడు దర్శనమిస్తారని కలగన్నానా? అయినా ఆఫీసరుగారు ఊళ్ళో లేనప్పుడు, ఆఫీసుకి శాల్యూట్ కొట్టేసి మ్యాట్నీలకు చెక్కేసే పెద్ద మనుషులు ఇలా అకస్మాత్తుగా ఇంటి మీద చెకింగ్ చేస్తారని ఊహిస్తే, ఎదురుగా నిలబడి స్వాగతసత్కారాలిచ్చేదాన్ని. ఇప్పుడయినా మించి పోయిందేం లేదు." విరగబడి నవ్వుతూ అంటున్న శ్రీమతిని ఛీత్కరిస్తూ గదిలోకిపోయి డ్రస్సు మార్చుకుని మంచం మీద వాలిపోయాడు శ్రీవారు. శ్రీమతి వంటగదిలోకి వెళ్ళింది, ఇంతలో 'పోస్ట్' అంటూ రెండు కవర్లు విసిరేసి చక్కా వెళ్ళి పోయాడు పోస్ట్‌మాన్. వెళ్తూ వెనక్కి తిరిగి శ్రీవారికేసి ఇకిలిస్తూ మరీ వెళ్ళాడు. శ్రీమతి, శ్రీవారు ఒకేసారి పోస్ట్ తీసుకోబోయారు. ఒకరి వంక ఒకరు చూస్తుంటే, శ్రీవారే ముందు అందుకున్నారు. వాటిని చూస్తునే శ్రీవారి ముఖం చిద్విలాసంగామారి, వెనువెంటనే కఠినతరమై విసురుగా శ్రీమతికేసి విసిరి పారేశారు. అవి శ్రీమతికి తిరిగొచ్చిన రచనలు. ఈసారి శ్రీమతి మండిపడింది. మంచీ, మర్యాద లేకుండా ఏమిటా విసురంది. శ్రీవారు ఆవేశంలో నోర్మూయ్ అన్నారు. శ్రీమతి రెండన్నది శ్రీవారు నాల్గన్నారు. చివరికి శ్రీమతి మూడంటె, శ్రీవారు ఆరంటె అయ్యారు. అలా మొదలైంది కోల్డ్‌వార్. శ్రీమతి మాటమాట్లాడక పట్టుబట్టింది. శ్రీవారూ ఈ సత్యాగ్రహం ఎన్నాళ్ళో చూస్తానన్నట్లు తనూ సడలి పోలేదు. మల్లెపూలు, పందిరిమంచెం చిన్న బోయాయి. పండువెన్నెల, పాలనవ్వులూ వృథా ఐపోయాయి. ఒకటి, రెండు, మూడు రోజులు భారంగా గడచిపోయ్యాయి. నాల్గో రోజు (ఆదివారం) మధ్యాహ్నం రెండున్నరగంటలకు :

"అమ్మాయ్! అమ్మాయ్! చూడు తల్లీ! నీ పేరేమిటో తెలీదు. ఓ గ్లాసుడు పంచదారుంటే ఇస్తావ్. రెండు రోజుల్లో తెప్పించి ఇస్తాను. ఆఁ అన్నట్లు మేము ఈ ప్రక్క వాటాలో దిగి నాలుగు రోజులైంది. నా పేరు పార్వతమ్మ. మా వారు రెవెన్యూ ఆఫీసులో పని చేస్తున్నారు. అన్నట్లు మీ వాటాకు అద్దెంత? పిల్లలెంత మంది? అతగాడేం చేస్తాడో?" ఇత్యాది ప్రశ్నలు, జవాబులన్నీ ఏ కరువు పెట్టింది పార్వతమ్మ అనబడే పర్వతమ్మ. శ్రీమతి ఓపిగ్గా జవాబులు చెప్పి, పంచదారతో ఆమెను సాగనంపింది. మరో అయిదునిమిషాల్లోనే పర్వతమ్మగారు చపాతీలు ఒత్తుకునే పీటతో ప్రత్యక్షమై, అది ఎప్పుడు, ఎందుకు, ఎలా చేయించిందో, దాని అవసరమెలా గడుస్తుందో రన్నింగ్ కామెంటరీ వినిపించింది. ఓపిగ్గా వింటున్నా ఆమె నిష్క్రమణానంతరం నవ్వాగలేదు శ్రీమతికి. నాలుగు రోజులుగా సత్యాగ్రహంతో 'బోర్' కొట్టిన శ్రీవారికి కూడా శ్రీమతితో జత కలపాల్సొచ్చింది. క్రమంగా చిన్న చిన్న మాటలు, చివరకు మామూలుగా ఒకరికొకరు క్షమాపణలు, ప్రేమలు, అభిమానాలు వగైరాలన్నీ తెలుపుకోటం జరిగాయి. ఫలితం (పర్వతమ్మగారి దయవల్ల) ఫస్ట్‌షో, హోటల్ మీల్స్, శ్రీమతి తల్లో ఒక కిలో మల్లెచెండులూ, శ్రీవారి బుగ్గన తాంబూలపు గుర్తులు, వెన్నెలమత్తూ, వగైరా. ఇంకా చాలా సమయం ఉందన్నట్లు గడియారం పదకొండు గంటలు భారంగా పలికింది. ఇంతలో పర్వతమ్మగారింట్లో ఏడ్పులూ, దీనమైన ఆక్రోశాలు, గుద్దుల చప్పుళ్లూ, బరువుగా లాగిన చప్పుళ్ళూ శ్రీమతిని, శ్రీవారిని ఆశ్చర్యచకితులను చేశాయి. పర్వతమ్మగారి అధికార పూర్వకమైన కేకలు; "కొట్టకు పిన్నీ! ఇంకెప్పుడూ ఇలా చెయ్యం క్షమించు పిన్నీ!" అన్న దీనమైన అరుపులూ కించిత్ సందేహంలో ముంచెత్తాయి. శ్రీమతిది అసలే జాలిగుండె. అందులో రచయిత్రి కావటం మూలంగా జరుగుతున్నదేమిటో ఊహించింది. శ్రీవారితో ఏదో చెప్పబోతే "అర్ధరాత్రి వేళ అంకమ్మ శివాలు....కమాన్!" అని కొట్టి పారేశారు. నిజంగా భారంగానే గడిచింది శ్రీమతికి ఆ రాత్రి. మరునాడు ఎదురింటి తాయారు వల్ల పూర్తి సమాచారం సేకరించింది శ్రీమతి. సదరు పర్వతమ్మగారు వారి పతికి ద్వితీయం. సవతి బిడ్డలు ముగ్గురు. ఇద్దరాడపిల్లలు, ఒక

**[లోకజ్ఞానం : సమాధానాలు]**

1. 223. అండమాన్ ప్రాంతంలోని 204 చిన్న చిన్న దీవులనూ, నికోబార్‌లోని 19 దీవులనూ కలుపుకుని అండమాన్ – నికోబార్ దీవులు ఏర్పడ్డాయి. రాజధాని : పోర్ట్ బ్లెయర్.
2. ముండక ఉపనిషత్తు నుంచి.
3. యునైటెడ్ నేషన్స్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్ – అంటే 'ఐక్యరాజ్య సమితి పారిశ్రామిక అభివృద్ధి వ్యవస్థ' అని అర్థం.
4. ఆగస్ట్ 15, 1972. ఈ పిన్‌కోడ్ పద్ధతి ప్రకారం – అందులోని ఆరు అంకెలలో మొదటి అంకె ఆ రాష్ట్రాన్ని, రెండు, మూడు అంకెలు రాష్ట్రంలోని ప్రత్యేక ప్రాంతాన్ని, చివరి మూడు అంకెలూ ఉత్తరం చేరవలసిన తపాలా కార్యాలయాన్ని సూచిస్తాయి.
5. కాలేయము.
6. కప్ప కంటిపైన ఒక పలుచనిపొర వుంటుంది. అది నీటిలోకి ప్రవేశించగానే నీరు కళ్ళను క్రమ్మకుండా వుండేందుకు ఈ పొర కనుగ్రుడ్డుచుట్టూ రక్షణకవచంలా ఏర్పడుతుంది. అందువల్ల కప్ప నీటి లోపల వున్నప్పుడు కూడా కళ్ళు తెరుచుకునే వుండగలుగుతుంది.
7. తెల్లకణాలు. వీటినే 'ల్యూకోసైటిస్' అంటారు.
8. క్రిస్టియన్ హ్యూజెన్స్. హాలండ్ దేశస్థుడు. 1656 లో యితను గోడ గడియారాన్ని తయారు చేశాడు. అయితే అంతకు ముందే 1642 లో గెలిలియో ఈ గోడ గడియారం నమూనా రూపొందించాడు. కాని అది పూర్తి చెయ్యకముందే అతను మరణించాడు.
9. మార్టినా నావ్రతిలోవా. గతంలో రెండుసార్లు వింబుల్డన్ ట్రోఫీ గెల్చుకున్న క్రిస్ ఎవర్ట్‌ని ఓడించి, అందరి అంచనాలూ తలక్రిందులు చేసిన మార్టినా వయసు 21. జెకొస్లోవేకియాకు చెందిన ఈమె అమెరికాలో స్థిరపడడానికి ప్రయత్నిస్తోంది. కమ్యూనిస్ట్ దేశాలనుంచి ఈ ట్రోఫి గెలుచుకున్న ప్రథమ వనిత కూడా ఈమే కావడం ఇంకో విశేషం.
10. యాష్ మోలియన్ మ్యూజియం. 1679 లో నిర్మింపబడిన ఈ మ్యూజియం ఇంగ్లండులోని ఆక్స్‌ఫర్డ్‌లో వుంది.

పొగ. ఆ పిల్లల్ని రాచి రంపాన పెడుతుందని తాయారు రిపోర్టు. అదీ పూర్వం పర్వతమ్మగారి ఇంటి ప్రక్కనున్న తన మిత్రురాండ్ర ద్వారా తాయారు సేకరించిన సమాచారం. శ్రీమతి, శ్రీవారికి ఈ సమాచారాన్ని ట్రాన్స్ఫర్ చేసింది. ''బోరా!'' అని వాపోయారు శ్రీవారు.

కాలెండర్లో పేజీలు చిరిగిపోతున్నాయి. ఈ మధ్య కాలంలో పర్వతమ్మగారు చిన్న చిన్న అప్పులు. (తప్పు: చేబదుళ్ళు—తిరిగి ఇవ్వబడవు.) పెద్ద పెద్ద కబుర్లు, గొప్పలు అన్నీ, మామూలుగా దొర్లించేస్తున్నారు. శ్రీమతి మరికొన్ని విషయాలు రాబట్టింది. శ్రీ శ్రీ శ్రీమతి పర్వతమ్మగారికి ద్వితీయం కొంత లేటుగా జరిగిందట. కడుపున రెండు కాయలు కాసి రాలిపోయాయట. ఇప్పుడిక మూడవదానికై 'వెయిటింగ్' చేస్తున్నదట. ఇవన్నీ మహిళా సమాజం అందించిన వార్తల్లో కొన్ని భాగాలు. ఇకపోతే పర్వతమ్మగారు శ్రావణ మంగళవారం నోములు, పూజలు, వ్రతాలు చేస్తుంది. అన్నీ బాగానే ఉన్నాయి. కానీ అప్పుడప్పుడూ రాత్రి, పగలు భేదం లేకుండా అరుపులు, తిట్లూ, కొట్లు, పిల్లల చిత్రవధ షరా మామూలే. శ్రీమతి కార్యరంగంలో దూకి అసలు విషయం కనుక్కుందామనుకున్నా శ్రీవారి 'బ్రేక్' వల్ల సాహసించలేదు. ఇంతలో శ్రీమతి తరపున వాళ్ళ బంధువుల ఇళ్ళలో పెళ్ళని శుభలేఖ అందింది. శ్రీవారు, 'వెళ్లాలా?' అని దీనంగా అడుగుతున్నా వెళ్ళి తీరాలని శ్రీమతి వాళ్ళ పుట్టింటికి బయలుదేరింది. శ్రీవారిని, పర్వతమ్మ గారికి అప్ప చెప్పి వెళదామనుకున్నా కించిత్ సందేహంతో వెనుకంజవేసింది. దాంతో శ్రీవారికి హోటల్ భోజనం, ఫ్రెండ్ రూంలో నిద్ర తప్పలేదు.

ఒక ఇరవైరోజుల అనంతరం శ్రీమతి మళ్ళీ శ్రీవారి దరిచేరింది. ప్రియసమాగమం తరువాత శ్రీమతికి కొన్ని కొత్త విషయాలు తాయారు ద్వారా తెలిశాయి. పర్వతమ్మగారికి నొప్పులొచ్చి ప్రసవించలేక, చివరకు మృతశిశువును కన్నదని— డాక్టర్లు మళ్ళీ బిడ్డలు పుడితే తల్లి ప్రాణానికే గండమని ఆపరేషన్ చేసి గర్భకోశాన్ని తీసి వేశారని, ఇప్పుడిప్పుడే పర్వతమ్మగారు కోలుకుంటోందని. శ్రీమతి దిగ్భ్రాంతురాలైంది. విషయాలన్నీ శ్రీవారికి కూడా తెలిశాయి. ఇద్దరూ చాలా విచారించారు. పరామర్శలు జరిగాయి. పర్వతమ్మ

## సూర్యుడు

**ఉదయం**

అప్పుడే

తల్లి గర్భం నుండి

ఉద్భవించిన

రక్తసిక్త శిశువులాగ....

**సాయంత్రం**

ఎవరో

హత్యచేసి

దూరంగా

దిగంతాల్లోకి

విసిరేసిన

నెత్తుటి ముద్దలాగ....

—కాద సరోజా రాణి

గారు వీళ్ళిద్దర్నీ చూసి కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు. వీళ్ళ ఓదార్పులతో, ఆత్మీయమైన మాటలతో మరికొంత సన్నిహితురాలైంది పర్వతమ్మగారు.

ఆ వేసం కాలం మండుటెండలో ఓ రోజు 'పోస్ట్' అంటూ మళ్ళీ పోస్ట్‌మాన్ ఓ పత్రికను శ్రీమతి ఇంటిముందు విసరబోయి పర్వతమ్మగారు కన్పించటంతో భయభక్తులతో ఆమెకు అంద చేశాడు. పర్వతమ్మగారు బియ్యం ఏరటం అయ్యాక కళ్ళజోడులో తొంగిచూస్తూ పత్రిక చదివేస్తోంది. చదవటం పూర్తయ్యాక ఆమె ఒక్కసారిగా మారిపోయి మౌనంగా రోదించ సాగింది. కారణం ఆమె చదివిన కథ 'మనసు మారింది'. ఆ సమయంలోనే శ్రీమతి రిక్షా దిగి తాళం చెవులకోసం పర్వతమ్మగారిని కలుసుకో బోయింది. కళ్ళవెంబడి ధారలతో రోదిస్తున్న పర్వతమ్మగారిని చూసింది. ఆమెను చూస్తూనే పర్వతమ్మగారు ఆప్యాయంగా కౌగలించుకుని బిగ్గరగా ఏడ్వసాగింది. శ్రీమతి ఓదార్పుతో ఆమె వెక్కిళ్ళ మధ్య విషయం చెప్పసాగింది. 'మనసు మారింది' కథలో మల్లే తన బ్రతుకు కూడా చితికిపోయిందని వాపోయింది. శ్రీమతి మెల్లగా అసలు విషయం చెప్పింది. స్వంత బిడ్డలు కాకపోయినా సవతి పిల్లలను తన పిల్లలుగా చూసుకున్న హీరోయిన్ త్యాగనిరతిని బోధ పరచింది. ఓ అరగంట తర్వాత పర్వతమ్మగారు పశ్చాత్తాపంతో ''ఇప్పటికైనా కళ్ళు తెరుస్తాను. ఆ దేవుడు నాకు ఇక సంతానం ఎలాగూ లేకుండా చేశాడు. కనీసం ఉన్న బిడ్డలనయినా కన్న బిడ్డలుగా చూసుకుంటాను. అప్పుడే నిజంగా నా బ్రతుక్కి సార్థకం'' అంది. శ్రీమతి ఎగిరి గంతేసింది. ఉత్సాహంతో చిందులు తొక్కింది. శ్రీవారు ఆఫీసు నుంచి రాగానే చుట్టేసింది. పత్రిక చేతికిచ్చి చదవమంది. శ్రీవారు శ్రీమతి మాట కాదనలేక చదివాననిపించారు. శ్రీమతి కళ్ళు విజయగర్వంతో మెరిసాయి. శ్రీవారు కూడా ఆశ్చర్యంగా శ్రీమతికేసి చూశారు. ''ఇది నిజంగా కథ కాదండి! జీవితం'' అంటూ పర్వతమ్మ గారితో తన సంభాషణం ఏకరువు పెట్టింది. ''నిజంగా కథల వల్ల మనుషులు మారతారను కోవడం ఎండమావులు చేరినట్లని అనుకునేవాణ్ణి. నువు చెప్పేదంతా నిజమైతే నిజంగా ఈ కథ వ్రాసిన 'శ్రీమతి' చాలా గొప్పవ్యక్తి సుమా! ఇవీ కథలంటే. మరి నువ్వూ వున్నావెందుకు? సవతి బిడ్డలను తన బిడ్డలుగా ఆదరించలేక, చివరకు తనకిక మాతృత్వానికి స్థానం లేదని తెలిశాక ఆ తల్లి బాధతో సవతి పిల్లలను కన్న బిడ్డలుగా స్వీకరించటం నిజంగా అపూర్వం సుమా! రేపే రచయిత్రికి ధన్యవాదాలతో ఓ ఉత్తరం వ్రాస్తా''....

''స్టాప్! ఆ రచయిత్రి మీద చాలా అభిమానం కల్గిందే! అయితే ఇదిగో అడ్రస్సు!'' అంటూ తమ ఇంటి అడ్రసు వ్రాసిచ్చింది శ్రీమతి.

''వ్వాట్! ఆ రచయిత్రి 'శ్రీమతి' నిజంగా నువ్వేనా? ఇది కలా! నిజమా! ఆ శ్రీమతే నా శ్రీమతి. అయామ్ సారీ శ్రీమతి. నిజంగా నువ్వే ఆ శ్రీమతివి కాబట్టి అభినందనలు చేతులతో కాదు.''

''మరి!''

''ఇలా!'' అంటూ ఆమె పెదాలపై.... అంతే....కథ అయిపోయింది.

# కుటీర పరిశ్రమ : మచిలీపట్నం కలంకారి

కలంకారి డిజైను గల వస్త్రాలను చూడగానే 'ఎంత బాగున్నాయో' అనిపిస్తుంది. అవి అంత బాగా వుండడం వెనుక ఎంతో శ్రమ, పనితనం వున్నాయి. కలంకారికళ గురించి 'వనిత' పాఠకులకు యింతకు ముందే తెలుసు. ఐతే, ఇప్పుడు ఆ పరిశ్రమలోని లోటుపాటులగురించి, వస్త్రాలు ఏ విధంగా తయారవుతాయో తెలుసుకుందాం.



భారత ప్రాచీన కళా సౌందర్యాన్ని చాటే పరిశ్రమలలో చెప్పుకోదగ్గవాటిల్లో ఒకటి–మచిలీపట్నం కలంకారి అద్దకం పరిశ్రమ. ఈ పరిశ్రమ ఎప్పుడు ప్రారంభమైందో సరిగ్గా ఆధారాలు, లేనప్పటికి 1830వ సంవత్సరానికి పూర్వమే ఈ పరిశ్రమ మచిలీపట్నంలో వున్నట్లుగా చరిత్ర తెలియజేస్తోంది.

1830 లో అలియన్ అనే గ్రీకు పండితుడు మచిలీపట్నం సందర్శించి కలంకారి వస్త్రాలు తీసుకు వెళ్ళినట్లు దాఖలా వుంది. అనుమకొండ వెంకట రంగయ్యనాయుడు అనే ఆయన ఈ పరిశ్రమను మచిలీపట్నంలో స్థాపించినట్లు తెలుస్తోంది. ఆ రోజుల్లోనే అనేకమంది విదేశీయులు ఇక్కడకు వచ్చి కలంకారి వస్త్రాలు కొనుగోలు చేసి తీసుకు వెళ్ళేవారుట. అవిరంగూన్, సిలోన్‌లకు అధికంగా ఎగుమతి అయ్యేవి. మొగలాయి చక్రవర్తుల కాలంలో ఈ పరిశ్రమను మచిలీపట్నం నుంచి ఢిల్లీనగరానికి తరలించడానికి ప్రయత్నాలు జరిగాయి. కాని మచిలీపట్నంలో తయారైన వస్త్రాలకు వున్న ఛాయ వాటికి రాలేదట। దాంతో ఆ ప్రయత్నాలు విఫలమయ్యాయి.

ఆంధ్ర ప్రాంతంలో ఈ పద్ధతి కాళహస్తి, నర్సాపురం, పాలకొల్లు, చీరాల, వరంగల్, మిర్యాలగూడెం, మంగళగిరి పట్టణాలలో కూడా వాడుకలో వుండేది. కాని ప్రస్తుతం మచిలీపట్నం, కాళహస్తిలలోనే ఈ పరిశ్రమ వ్యాప్తి చెంది వుంది.

కలంకారి అద్దకాలలో – పర్షియన్, ముల్తాన్, రంగపాణీ, చుంగడీ అని నాలుగు రకాలు వున్నాయి.



మచిలీపట్నంలోనే కలంకారి పరిశ్రమలు ప్రస్తుతం ఐదు వున్నాయి. ప్రారంభంలో అయితే ఎటువంటి అచ్చులు వుపయోగించకుండా చేతితోనే 'యాదవరాజుల చరిత్ర', 'రామాయణం', 'భారతగాథ' చిత్రాలను వస్త్రాల మీద అనుమకొండ వెంకటసుబ్బారావు మొదలైనవారు వేసేవారు. కాని ప్రస్తుతం అచ్చులు వుపయోగించడం జరుగుతోంది.

'కలంకారి' అంటే కలము (కుంచె)తో చేసే పనితనం అని అర్థం. కలంకారీ పద్ధతికి వుపయోగించే పదార్థాల్లో – చిలువేరు, చిరంజి, మంజిష్ఠా, కరక్కాయ, జాజి ఆకు, నీలిమందు, పుట్టమైనం, కరక్కాయ పువ్వు, తుమ్మ జిగురు, పటిక, బెల్లం, ఇనుము, బియ్యం, పాలు–ప్రధానమైనవి.

అసలు–ఈ కలంకారీ అద్దకపు వస్త్రాలు చేయడానికి రెండునెలల దాకా పడుతుంది. ఒక వస్త్రం అత్యంత సుందరంగా రూపొందాలంటే పదిహేను రకాల పరిణామాలు చెందాలి. అందుకే అంత టైం పడుతుంది. అంతేకాదు. వర్షాకాలంలో కలంకారి అద్దకం కుదరదు.

కలంకారీని బ్లీచ్ చేయడానికి దేశీయపద్ధతులు వుపయోగిస్తారు. అంటే బ్లీచింగ్ పౌడర్‌ని కాక గేదెపేడ ద్రావకాన్ని వాడతారు. అలా ముంచిన వస్త్రాన్ని ఎండలో ఆరేస్తారు. వస్త్రం తెల్లబడటానికి నాలుగైదు రోజులుపడుతుంది. ఈ తెల్లని వస్త్రాన్ని కరక్కాయరసంలో నానబెడతారు. ఈ రసం వస్త్రం అంతా అలుముకునేటట్లుగా చూస్తారు. తరువాత ఎండలో ఆరబెడతారు. ఇలా చేయడం వల్ల అచ్చుల ముద్రణ సులభతరం అవుతుంది.

మొదట డిజైను ఆకారాన్ని అచ్చుల (బ్లాక్) సహాయంతో వస్త్రం మీద అచ్చు వేస్తారు. బ్లాక్‌లతో అచ్చు వేసేటప్పుడు ఎరుపు, నలుపు రంగులు వాడతారు. నలుపురంగు ఇనుము, బెల్లం నుండి, ఎరుపు రంగు తుమ్మ జిగురు, పటిక నుండి నిర్ణయించుకున్న పాళ్ళలో తయారు చేస్తారు.

అచ్చుల సహాయంతో డిజైను వేసిన తరువాత ఆ వస్త్రాన్ని అలాగే రెండు మూడు రోజులు వుంచి ఆ తరువాత పెద్ద టాంకులోని నీళ్ళల్లో ముంచుతారు. ఈ విధంగా చేయడం వల్ల వస్త్రానికి అంటుకుని వున్న జిగురు పోగొట్ట వచ్చును.

ఆ తరువాత జాజి ఆకు, అలిజరిన్ కలిపిన మరుగుతున్న నీటిలో ఈ వస్త్రాలను వుంచుతారు. ఇలా చేయడం వల్ల వస్త్రాలకి వున్న ఎరుపు, నలుపు రంగులు బట్టకి చక్కగా అద్దుకుంటాయి. జిగురుగాని, కరక్కాయ రసం కాని మిగిలి వుంటే అవి పోతాయి. వీటిని మరోసారి బ్లీచ్ చేస్తారు. బ్లీచ్ చేసిన తరువాత గంజిలో ముంచి ఆరబెడతారు.

ఇక కలంకారి పరిశ్రమలో అతి ముఖ్యమైన ఘట్టానికి వద్దాం. పుట్టమైనాన్ని ఒక స్థిరమైన వుష్ణోగ్రత వద్ద కరగబెడతారు. ఇనపపాళీ వున్న కలంతో ఒక్క నీలం రంగు వెయ్యాల్సిన భాగం మినహాయించి తక్కిన వస్త్రాన్నంతా మైనంతో కప్పేస్తారు. ఆ తరవాత వస్త్రాన్ని జాగ్రత్తగా మడతబెట్టి ఇండిగోరంగు వున్న తొట్టిలో ముంచుతారు. అల్టాగింజలు, సున్నం, వుప్పు నీటితో–నీలం రంగు తయారు చేస్తారు. ఈ నీలిరంగు వేసిన తరువాత మైనం పోగొట్టేందుకు మరిగే నీళ్ళల్లో వస్త్రాన్ని వుంచుతారు. ఇలా విడిపోయిన మైనాన్ని మరోసారి వుపయోగించుకోవచ్చును.

మైనం పోగొట్టిన తరువాత ఆ వస్త్రాలను నువ్వులనూనె, సున్నం, వుప్పు నీటి మిశ్రమంతో చేయబడ్డ సబ్బు వుపయోగించి బ్లీచ్ చేస్తారు. ఇక ఆకుపచ్చ, పసుపురంగులు వేయడానికి కావలసిన బిగువు వస్త్రానికి రావాలన్న మాట. అందుకోసం వస్త్రాన్ని గేదెపాలలో కలపబడ్డ గంజినీళ్ళలో ముంచి ఆరబెడతారు.

ఈ పసుపు రంగుని కరక్కాయ పువ్వుల నుంచి చేస్తారు. నీలము, పసుపు కలిపితే ఆకుపచ్చరంగు వస్తుంది కదా .... ఆ రంగు కూడా వుపయోగించి–యివి బట్టకి స్థిరంగా అంటుకునేందుకు పటిక నీటిలో ముంచి ఆరబెడతారు.

ఇలా ఈ పద్ధతులన్నీ అయిన తరువాత వస్త్రాన్ని సబ్బు నీళ్ళలో కొద్దిసేపు వుంచి, జాగ్రత్తగా శుభ్రపరచి, దుమ్మును పోగొట్టి ఎండలో ఆరబెడతారు.

హమ్మయ్య...ఇంతటి శ్రమకి ఫలితం దక్కి కన్నుల పండుగచేసే కలంకారీ వస్త్రం మనం వుపయోగించడానికి సిద్ధంగా వుందన్నమాట!

మచిలీపట్నం, పరిసర ప్రాంతాలలోని ఐదు కలంకారీ పరిశ్రమలలోనూ దాదాపు మూడు వందల మందికి పైగా పని చేస్తున్నారు. సంవత్సరానికి 15 లక్షల రూపాయల విలువగల వస్త్రాలు ఇక్కడ తయారవుతున్నాయి. ఇక్కడ పని చేస్తున్న వారికి రోజుకి 8 నుండి 12 రూపాయల వరకు వేతనం లభిస్తోంది.

దేశాయ్‌పేటలో వున్న బలియగూడెం కోఆపరేటివ్ సొసైటీలో గత పదిహేను సంవత్సరాల నుంచి కలంకారీ పనితనంలో శిక్షణ ఇస్తున్నారు. ఇక్కడ శిక్షణ పొందుతున్న వారిలో కొందరికి కేంద్ర ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వుచిత వేతనాలు లభిస్తున్నాయి కూడా. విదేశాల నుంచి కూడా ఇక్కడికి వచ్చి శిక్షణ పొందుతూ







EYETEX
BINDI
DELUXE
MATT FINISH
EYETEX
BINDI
DELUXE




EYETEX
BINDI




EYETEX
REGD






Lodhra
FOR LADIES' HEALTH
MADE IN INDIA

వుంటారు. అటువంటి వారిలో ఇంగ్లండు వనిత సుసాన్ మేస్ ఒకరు.

ఆంధ్రప్రదేశ్ స్త్రీ, శిశు సంక్షేమ శాఖవారు 30 మంది హరిజనులకు కలంకారీ అద్దకంలో శిక్షణ యివ్వాలని నిర్ణయించారు. ప్రస్తుతం 25 మంది స్త్రీలు ఈ విధంగా శిక్షణ పొందుతున్నారు. వీరిలో ఇద్దరు వికలాంగులు కూడా వున్నారు. ఈ పనిలో నైపుణ్యం సంపాయించాలంటే దాదాపు సంవత్సరం పడుతుంది.

ఇక్కడ తయారు చేసిన దుప్పట్లు, కర్టెన్లు, అలంకరణ వస్త్రాలు ఫ్రాన్స్, నైజీరియా, జర్మనీ, అమెరికా, జపాన్, స్విట్జర్లాండు మొదలైన దేశాలకు ఎగుమతి అవుతున్నాయి. కలంకారీ చీరలకు కూడా విరివిగా ఆదరణ లభిస్తోంది.

కాని ప్రస్తుతం కలంకారీ అద్దకం పరిశ్రమ ఆర్థిక సమస్యను ఎదుర్కొంటున్నది. అసలు చిన్నతరహా పరిశ్రమలకై ప్రభుత్వం ప్రత్యేకంగా ఒక బ్యాంకును స్థాపించాలి. ఈ బ్యాంకు కుటీర పరిశ్రమలకు స్వల్పకాలిక, దీర్ఘకాలిక



రుణాలను మంజూరు చేసి వాటి అభివృద్ధికి తోడ్పడాలి.

ఇక్కడ తయారైన వస్త్రాలు మధ్యవర్తుల ద్వారా కాకుండా యిక్కడి నుండే ఎగుమతి అయ్యేటట్లు ప్రభుత్వం చూడాలి. అందువల్ల వారికి అదనపు ఆదాయ లభించి వుత్పత్తి పెంచేందుకు సహాయకారి కాగలదు. కలంకారీ వస్త్రాల వుత్పత్తిదారులు కూడా కొత్త కొత్త డిజైనులు రూపొందించాలి. అంతర్జాతీయ మార్కెట్ అభిరుచికి తగ్గట్టుగా వస్త్రాలు తయారు చెయ్యాలి. అలా చేసిననాడు విదేశీ మారకద్రవ్యం విరివిగా లభ్యం కావడం జరుగుతుంది. దాంతో అభివృద్ధి పథకాలు కూడా చురుకుగా అమలు జరుగుతాయి. తద్వారా నిరుద్యోగ సమస్య తగ్గడానికీ దేశం ఆర్థికంగా స్వయం సమృద్ధి — పొందడానికీ కొంత అవకాశం ఏర్పడుతుంది. □

—ఎం. ఎల్





# ఇప్పుడు! మీముఖ సౌందర్యం గులాబీ పువ్వులాగా వికసించనీయండి. జాన్సన్స్* బేబీ కాంప్లెక్షన్‌క్రీమ్‌తో

## మీచర్మానికి పూరేకులమెత్తదనం సౌకుమార్యం కల్పించండి.

**మీ వర్చస్సుకు మెత్తదనపు స్పర్శ అవుసరం**

క్రొత్త జాన్సన్స్* బేబి కాంప్లెక్షన్ క్రీమ్ మీకు పట్టువలె, మెత్తదనం కల్పిస్తుంది. గరుకైన చోట్లను మెత్తగా చేస్తుంది, మిమ్మల్ని పూల సువాసనలలో ముంచెత్తుతుంది.

**మీ వర్చస్సుకు వికాసం అవుసరం**

ఒక్క జాన్సన్స్* బేబి కాంప్లెక్షన్ క్రీమ్ మాత్రమే మీ వర్చస్సుకు సహజ సౌందర్యం కల్పించుటకు అవుసరమైన అదనపు శ్రద్ధ తీసుకోగలదు. దానిని ప్రతిరోజూ వాడండి. మీ వర్చస్సు క్రొత్త సౌందర్యంతో పునరుజ్జీవం పొందగలగడం చూడగలరు.




ఈ మృదువైన గులాబిరంగు క్రీమ్ మీ ముఖవర్చస్సును సహజవికాసంతో ఉంచుతుంది... దాని వికాసంతో వెంటాడే సువాసన అందాల పూలగుచ్ఛంలా మీ చర్మాన్ని అంటి పెట్టు కొని ఉంటుంది.

* Trademark © J & J 78

Johnson & Johnson*

OBM 1800 TL



# తీరిక వేళల్లో

## పూసలతో పల్లకి

పూసలతో బొమ్మలు, బ్యాగ్‌లు ఉన్నాయి. కానీ ''పూసలతో పల్లకి'' చెయ్యడం అన్నది వేరు! పూసలతో అనేక వస్తువులు అల్లిన వారికి ఇది తయారు చేయటం చాలా సులభం. తగిన రంగుల పూసలతో తయారు చేస్తే, చూడ ముచ్చటగా ఉంటుంది.

మొట్టమొదట టాప్ (పల్లకీ పైభాగము) 31 వరుసలు నిలువుగాను, 16 వరుసలు అడ్డంగానూ రెండురకాల పూసలతో అల్లి, సిద్ధంగా ఉంచుకోవాలి. తరువాత పల్లకి అడుగు భాగంలో 17 వరుసలు నిలువుగామా, 11 వరుసలు అడ్డంగానూ అల్లాలి. మరొకటి బొమ్మలో కనబడుతున్న డైమెండ్స్ డిజైన్ వచ్చేట్లుగా 17 వరుసలు నిలువుగాను 11 వరుసలు అడ్డంగాను అల్లాలి. ఇప్పుడు ఒక అట్టకు మెరుపు కాగితాన్ని చుట్టి, ఆ రెండిటి మధ్యలో ఉంచి 4 ప్రక్కలా పూసలతో జాయిన్ చెయ్యాలి. ఇప్పుడు దీనికి రెండుప్రక్కలా 6 వరుసలు నిలువు, 11 వరుసలు అడ్డంగా రెండు భాగాలుగా అల్లి, వాటి మధ్యలో మెరుపు కాగితాన్ని చుట్టిన అట్టను పెట్టి పూసలతో జాయిన్ చెయ్యాలి. ఈ విధంగానే మరో ప్రక్క కూడా అల్లాలి. దీనికి 4 వైపులా స్తంభాలను అల్లాలి. ప్రతి స్తంభం 6 వరుసలు నిలువుగా అల్లాలి. (ఈ స్తంభాలు బొమ్మకు కాళ్ళు అల్లిన విధంగానే అల్లాలి.) 5 వరుసల పూసలతో దీనికి ఇరుప్రక్కల, ఇరువైపుల చిన్న చిన్న తలుపులు అల్లాలి. బొమ్మలో చూసి పల్లకీకి ఇరువైపుల Z ఆకారంలో ఉన్న మోపుడు కర్రలు అల్లాలి. క్రింద 3 వరుసల పూసలతో 4 వైపులా కాళ్ళు అల్లాలి. స్తంభాలపైన టాప్‌ను పూసలతో జాయిన్ చెయ్యాలి. ఇప్పుడు పల్లకి తయారవుతుంది. మీకు ఇష్టమయిన చిన్న చిన్న పూసల బొమ్మలను తయారు చేసి పల్లకీలో ఉంచితే మరింత ఆకర్షణీయంగా వుంటుంది.

—రాజేశ్వరీ మల్లికార్జునరావు

## స్పాంజితో పూలు

బొమ్మలు చేసి మిగిలిన ముక్కలు పారవేయకుండా వాటితో రకరకాల పూలు చేసి యింటిని అలంకరించవచ్చు. అందరికి నిజమైన పూలు దొరకడం కష్టం కదా! అలాంటి వాళ్ళు ఈ పూలు వాజ్ లో అరేంజి చేస్తే చాలా అందంగా, ఆకర్షణీయంగా వుంటుంది.

కావలసిన వస్తువులు : కలరు స్పాంజి, గ్రీన్ స్పాంజి, సన్న కమ్మి, గ్రీన్‌పేపరు, 22 కె. జి. కమ్మి కావాలి.

రోజా పూలు చేయాలనుకోండి రోజా రెక్కల మాదిరి రెక్కలు 2, 3 సైజులో స్పాంజితో కట్ చేసుకోవాలి. ఒక్కొక్క పూవు 2, 3 సైజులు కావాలి. సైజుకు 5, 6 చొప్పున కట్ చేసుకోవాలి. ఇక ఒక్కొక్క రెక్క తీసుకుని పైన కొంచెం మడిచి టాకా వేయాలి. అట్లా అన్ని రెక్కలు వేసి (టాకాలు) రెడీ చేసుకోవాలి. ఇప్పుడు 22 కె.జి. కమ్మి ఒక ముక్క కట్ చేసి తీసుకుని దానికి పైకి కొంచెం స్పాంజి ముక్క తీసుకుని రోజా మధ్యలో వుండేలాగా మొగ్గలాగా చుట్టుకుని దానిని కమ్మితో చుట్టాలి. తరువాత సైజువారీగా రెక్కలు దాని చుట్టూ (ముందు చిన్న సైజు) ముద్దగా వుండేలాగా అమర్చుకుని కమ్మితో (సన్నకమ్మి) బిగించి కట్టాలి. కమ్మి, స్పాంజి కనవడకుండా గ్రీన్‌పేపరు చుట్టుకోవాలి. ఇలా 5, 6 పూలు చేసుకుని (సైజువారీగా) వాజులో అరేంజి చేసుకుంటే బాగుంటుంది. యిక ఆకులు కావాలి కదా మరి. రోజా ఆకు షేపుతో ఆకులు గ్రీన్ స్పాంజిలో కట్ చేయాలి. దానికి మధ్య సన్నకమ్మి దూర్చుకోవాలి. కాడకు మాత్రం బైట కమ్మి వుండాలి. ఆ కమ్మి కూడా కనపడకుండా గ్రీన్‌పేపరు చుట్టుకుని మూడు, మూడు ఆకులు ఒకటిగా చేర్చి వాజులో పూలతో అక్కడక్కడా అమర్చుకోవాలి. ఇట్లాగే దాసాని, లిల్లీ, తామర అన్ని చేసుకోవచ్చు. దాసానికి ఒక్కొక్కదానికి 5 రెక్కలు వుండాలి. ప్రతి రెక్క మధ్య సన్నకమ్మి దూర్చుకోవాలి. తరువాత మధ్య దాసానికి వుండేలాగా కమ్మి వుంచి చుట్టూ 5 రెక్కలు పెట్టి గట్టిగా కట్టుకుని క్రింద రక్షకపత్రం పేవరుతో అమర్చుకోవాలి. యింకా మిగిలిన





స్పాంజితో చిన్న చిన్న పూలు చెయ్యవచ్చు హేంగింగ్‌పాట్సులో వుంచే క్రోటన్స్ కూడా చేసుకుని ఇంట్లో హేంగ్ చెయ్యవచ్చు. చేసి చూడండి.

—ఆమంచర్ల రాజేశ్వరి



ఇది వివాహాది శుభకార్యాలు జరిగే సిజను. పైగా దసరా మాసం కూడా. ఈ శుభకార్యాలకు, పేరంటాలకు వెళ్ళేటప్పుడు సాధారణంగా పట్టుచీరలు, నైలాన్ చీరలు ధరిస్తూ వుంటారు.

ఇవి బాగానే వుంటాయి కాని బరువు, వేడిమి అధికమై కాస్త చికాకు కలుగుతూ వుంటుంది. అలాకాక అందంగానే కనిపిస్తూ – హాయిని గొల్పే చీరలు ధరిస్తే ఎంతో బాగుంటుంది. అటువంటి కోవకు చెందినవే ఈ వస్త్రచిత్రాలలో కనిపిస్తున్న 'ఆర్గంజా' చీరెలు. చల్లగా, హాయిగా వుండడమే కాక చూడ ముచ్చటైన– వివిధ వర్ణాలతో, డిజైన్సులో ఇవి ఇప్పుడు విరివిగా లభిస్తున్నాయి. అటు కాస్త లావుగా వుండేవాళ్ళకి, ఇటు సన్నపాటి వాళ్ళకి కూడా ఇవి పొందికగా అమరడంవల్ల ఈ చీరెలు సర్వ జనాదరణ పొందాయి.

[చీరెలు : 'సురుచి' బొంబాయి వారి సౌజన్యంతో]





# డాక్టర్ హాన్ సూయిన్

నేనొక చీనాలజిస్ట్ కాను. కానీ నాకు తెలిసినంత వరకు చైనాగురించి, అక్కడి వివిధ విషయాలను గురించి ప్రజలకు తెలియజేసి వారి హృదయ నేత్రాలు తెరవడమే నా జీవిత లక్ష్యంగా భావిస్తాను'' – అన్నారు సుప్రసిద్ధ చీనా రచయిత్రి డాకర్ హాన్ సూయిన్ ఇటీవల ఒక గోష్ఠిలో.

''లవ్ ఈజ్ ఎ మెనీ స్ప్లెండర్డ్ తింగ్'' అన్న చలన చిత్రం, ఆ మాటనే పల్లవిగా గల పాట చాలామందికి తెలిసే వుంటుంది. ఆ చిత్రానికి ఆధారమైన నవలను, అదే విధంగా సుప్రసిద్ధమైన మరో పద్దెనిమిది పుస్తకాలూ రచించిన డాక్టర్ హాన్ సూయిన్ వృత్తిరీత్యా డాక్టర్.

అభ్యుదయ భవనానికి ప్రథమ సోపానం ఆరోగ్యం. అంచేత ఆ విషయం ప్రస్తావించినప్పుడు 'బేర్ ఫుట్ డాక్టర్స్' పథకం గురించి ఆమె వివరించడమే కాకుండా దానిని భారత దేశంలో కూడ ప్రవేశపెట్టవలసిన అవసరం ఎంతైనా వుందని తెలియ జేశారు.

''ఒక సంవత్సరం పాటు ప్రాథమిక వైద్య శిక్షణ ఇచ్చి వీరిని పల్లె ప్రాంతాలకు పంపుతాం. వీరు యింటింటికీ వెళ్ళి – మామూలు వ్యాధులకు మందులు యిస్తారు. క్లిష్టమైన జబ్బుగానీ అపాయకరమైన వ్యాధిగానీ ఉన్నట్టయితే రోగిని వెంటనే ఆస్పత్రిలో చేర్చవలసిన బాధ్యత కూడా ఈ గ్రామ వైద్యులదే. దీనిని చేయడానికి ప్రతివారూ ప్రత్యేక శిక్షణ పొందనవసరం లేదు. ఈ పథకం సక్రమంగా నెరవేరడంవల్ల—సరియైన సమయంలో అందరికీ వైద్య సహాయం అందడానికి అవకాశం వుంటుంది.''

ప్రతి రంగంలోనూ చైనా ఇతోధికమైన ప్రగతి సాధించిందంటే దానికి ముఖ్య కారణం 'కమ్యూన్స్' అంటారు. ఈ విషయం గురించి ప్రస్తావించినపుడు ఈమె ఒక సుదీర్ఘమైన ఉపన్యాసమే యిచ్చారు.

''మా పథకాలకు, ప్రణాళికలకు ఆర్థిక కార్యక్రమాలకు గ్రామాలే కేంద్రాలు. అవి అక్కడనుంచే ప్రారంభమవుతాయి. అందువల్ల ఆ ప్రణాళికా ఫలితాలు జనసామాన్యానికి చక్కని ఫలితాలు అందజేస్తాయి. ఈ సందర్భంలో గ్రామాభ్యుదయ విషయంలో కీలకమైన పాత్ర వహించే కమ్యూన్స్ గురించి తప్పకుండా చెప్పాలి.''

''ఒక్కొక్క కమ్యూన్ ఒక్కొక్క యూనిట్. అందులో ప్రజలకు సర్వ స్వతంత్రాలు వుంటాయి. 'కమ్యూన్'లలో చిన్న చిన్న పరిశ్రమలు, చేతి పనులు, పాఠశాలలు, ఆస్పత్రులు, కాలక్షేప వసతులు, కళాకేతనాలు అన్నీ వుంటాయి.''

''మితిమించిన జనాభాగల దేశం మాది. ప్రజాబలమే మా బలం. అదే మా ఆస్తి. దీనిని మేము బాగా అర్థం చేసుకున్నాము. ప్రజలను ఏ ఏ రీతులలో ఏ ఏ రంగాలలో ఉపయోగించుకోవాలో ఆయా విధంగా అన్ని రంగాలలోనూ ఉపయోగించుకుంటున్నాము. ప్రజా ప్రగతికోసం, ప్రజా సంక్షేమం కోసం దేశ ప్రజలను వినియోగించుకుంటున్నాము. గ్రామంలోని రైతులు రోజు తప్పకుండా పొలాలలో పనిచేస్తూ తమ బాధ్యతలు నెరవేరుస్తారు. అందువల్ల చైనాలో అసలు సెలవులే లేవు.''

''దొంగతనంలాంటి నేరాలు జరిగాయంటే – పోలీసుల కోసం – కోర్టుల కోసం కాచుకు కూర్చోకుండా నేరస్థుని పట్టుకోడానికి ప్రజలే ముందుకు వస్తారు. అంచేత నేరస్థుల్ని ఇట్టే పట్టుకోడానికి వీలౌతూంది. వీలైనంతవరకు దొంగను జైలుకు పంపకుండా – మందలించి, భయపెట్టి, నయానా భయానా సరిదిద్దడానికి శతథా ప్రయత్నిస్తాము. మళ్ళీ ఆ నేరం అతను చేయకుండా జాగ్రత్త పడతాము. నేరం మరీ ఘోరంగా వుంటేనే జైలుకు పంపుతాం. చిల్లర మల్లర నేరస్థుల్నందర్నీ తీసుకెళ్ళి జైళ్ళు నింపడంలో ప్రయోజనమేముంటుంది చెప్పండి?'' అని ప్రశ్నించారు ఆమె.

చైనా అనగానే మనకు గుర్తు వచ్చేది జనాభా సమస్య. హాన్ సూయిన్ దృష్టిని ఈ విషయానికి తీసుకురాగా – ''ఇవాళ మా దేశ జనాభా ఎనిమిది వందల ఏభై మిలియన్లు మించిపోయింది. ఈ జనాభా సమస్య గురించి కుటుంబనియంత్రణ విధానాల గురించి ఇంటింటికి వెళ్ళి డాక్టర్లు, నర్సులు, సంఘ సేవకులు బాగా ప్రచారం చేస్తారు. ఇంటి దగ్గరే కుటుంబనియంత్రణ ఉపకరణలు లభించే విధంగా ఏర్పాటు చేస్తారు. అలా కాకుండా–ఏ ఆస్పత్రిలోనో, కుటుంబనియంత్రణ కేంద్రంలోనో, క్యూలో నిలబడి వీటిని తీసుకోవాలంటే ఇంటి పనులన్నీ వదులుకుని రావడానికి కుటుంబస్త్రీలకు చాలా అసౌకర్యంగా వుంటుంది.''

''కుటుంబనియంత్రణ విషయంలో కూడా కమ్యూన్లపాత్ర చాలా గణనీయమైనదే. ఏటా సదస్సులు జరిపి ఆ ఏడాదికి ఎందరు పిల్లలు పుట్టాలి? తల్లిదండ్రులు కావడానికి ఎవరెవరు అర్హులు?–అన్న విషయాలు అవి తీర్మానిస్తాయి. ఈ తీర్మానాలు అతిక్రమించిన వారికి 'కమ్యూన్' వార్నింగ్ యిస్తుంది. దీనిని ఆ దంపతులు అవమానకరమైన విషయంగా భావిస్తారు. అంచేత ఇలా అంచెలంచెలుగా అమలు పరచాలే కాని నిర్బంధం మీద కుటుంబనియంత్రణ అమలు జరపడం అంత ఆరోగ్యకరం కాదు'' – అని వివరించిన డా. హాన్ సూయిన్ దేశ సంక్షేమం కోరి సొంత సుఖాలకు స్వస్తి చెప్పడానికి సంసిద్ధులుగా వున్న చైనా యువతీ యువకులను ఎంతో మెచ్చుకున్నారు.

విజయ మాధవి పిక్చర్స్

దాసరి నారాయణరావు

# కటకటాల రుద్రయ్య



''జనాభా సమస్య కారణంగా వివాహ వయో పరిమితిని పెంచే పథకం తీవ్రంగా అమలు చేయబడుతూ వుంది. దేశ ప్రగతికి మా యువతీ యువకులు బద్ధకంకణులై వున్నారు. ఇతర దేశాల వారికీ మా దేశం యువతరానికీ ఒక తేడా వుంది. ఇక్కడ విచ్చలవిడి ప్రేమను (free love) అనుమతించరు. అందువల్ల శీలంలోనూ మంచి ప్రవర్తనలోను వుండవలసిన నిర్బంధం వీరికి ఏర్పడుతుంది. అలా అని చైనీయులందరూ సన్యాసులు కారు. ప్రాయంలో పెళ్ళి చేసుకుని కాపురాలు చేయడానికి ప్రతివారూ ఇష్టపడతారు. విప్లవానికి తర్వాత ఇక్కడ పెద్దలు నిర్ణయించిన వివాహాలంటూ లేనే లేవు. తమ జీవిత భాగస్వామిని తామే ఎన్నుకోవచ్చు. నిర్బంధం మీద ఎవరికీ పెళ్ళిళ్ళు జరగవు''.

''కాని విడాకులు పుచ్చుకోవాలంటే మాత్రం ఇక్కడ కష్టమే. 'ప్రేమించే కదా పెళ్ళి చేసుకున్నారు. మరి ఇప్పుడెందుకు విడిపోవాలి?'– అని భార్యాభర్తలను చేర్చి వుంచడానికే ప్రతి ఒక్కరూ ప్రయత్నిస్తారు. అంతేకాదు ఆలుమగలు కూడా తమ విభేదాలు మరచి వుండడానికే ప్రయత్నిస్తారు. అంతగా ఏవైనా అభిప్రాయభేదాలు తలెత్తినట్లయితే వాటి కారణాలు అన్వేషించి పరిష్కార మార్గాలు సూచించడానికి 'కమ్యూన్లు' కృషి చేస్తాయి.''

సమ సమాజ వాదమే నవసమాజవేదం. ఈ విషయంలో చైనా వైఖరి ఎలాంటిది? అన్న ప్రశ్నకు ''ఆర్థిక అసమానతలు అంతగా లేని సమాజం మాది. అందువల్ల ఎన్నో కార్యక్రమాలు నల్లేరు పై బండిలా సాగిపోతూ, ఎన్నో విషయాలు చకచకా కార్యరూపం ధరిస్తాయి. ఒక్కొక్క కార్మికునికి సగటు సంపాదన ముప్పై డాలర్లు వుంటాయి. దీనితో చైనాలో సుఖ జీవనం గడపవచ్చు. సాధారణ కార్మికుడికి, ఉన్నతమైన పదవిలో వుండే అధికారికి వేతన వ్యత్యాసం 1:10 నిష్పత్తిని దాటకూడదు. అంటే మూడు వందల డాలర్లకు మించి సంపాదించేవారు చైనాలో లేరన్నమాట'' — అన్నారు హాన్ సూయిన్.

''మా దేశంలో ఎవరికీ సొంతంగా కార్లులేవు. ప్రభుత్వ వాహనాలను ప్రభుత్వ కార్యాలకు తప్ప-వ్యక్తిగత కార్యాలకు వినియోగించుకుంటే వెంటనే పట్టుబడిపోతారు. ఈ విషయంలో కూడా కమ్యూన్లు జాగ్రత్తగా వుండి అలాంటి చర్యలను బట్టబయలు చేస్తాయి.''

''లంచం లాంటి నైచ్యకృత్యాలు కూడా ప్రజా దృష్టి నుంచి తప్పించుకోలేవు. తప్పు చేసిన వారిని వెంటనే పట్టించి ఇవ్వడం తమ ధర్మంగా భావిస్తారు.''

ఒక సమాజం వనితలను ఎలా గౌరవిస్తుందో దానిని అనుసరించి ఆ సమాజ నాగరికతను నిర్ణయించవచ్చు. చైనాలో వనితల బాగోగులు ఏ స్థాయిలో వున్నాయి? అని తెలుసుకోవాలన్న ఉత్సాహం మనకందరికీ వుంటుంది. ఆ విషయమై చెబుతూ "వనితలకు ప్రతి రంగంలోనూ సమానత-నిజమైన స్వాతంత్ర్యం అంటే నౌఖరీకి తగ్గ వేతనం, వాళ్ళ సంపాదను వాళ్ళే ఉపయోగించుకునే స్వాతంత్ర్యం చైనాలో వుంది. భార్య సంపాదనను ముట్టుకోడానికి కూడా భర్తకు హక్కులేదు'' అన్నారు.

గత ఇరవైఏళ్ళుగా తరచూ వస్తూ పోతూ వుండడం వల్ల భారత దేశంతో ఈమెకు ప్రత్యక్ష సంబంధం వుంది. అంతేకాదు ఒక దక్షిణ భారతీయుని ఈమె పెళ్ళి చేసుకున్నారు. భారత దేశంలో తనకున్న ఈ పరిచయంతో, ఇక్కడి ప్రజలతో జరిపిన సంభాషణలను ఇష్టాగోష్ఠులను ఆధారం చేసుకుని భారతదేశం గురించి ఒక పుస్తకం రాయడానికి పూనుకున్నారు డాక్టర్ హాన్ సూయిన్.

''ఒక దేశం గురించి ఏదైనా రాయాలంటే ఆ దేశం గురించి, ఆ దేశ స్థితిగతుల గురించి, ప్రజల ఆచార వ్యవహారాల గురించి మంచి అవగాహన వుండాలి. అంతేగాని ఆ దేశానికి మూడు వారాల పాటు విలాసయాత్రకి వెళ్ళి వచ్చి– దానినే ఆధారంగా పుస్తకాలు రాయడం అభిలషణీయం కాదు'' అన్నారామె.

"భావి తరాల వారు బాగుండాలి. దానికి ఆరోగ్యకరమైన వాతావరణం మనం సృష్టించాలి. ప్రపంచ సంక్షేమం కోసం మనవల్ల వీలయ్యే మంచిని సాధించి ప్రపంచాన్ని మంచిగా మార్చాలన్నదే మా లక్ష్యం. ఈ లక్ష్యసిద్ధి కోసం బాధ్యతలనే కళ్ళుగా భావించి మేము నిర్విరామంగా కృషి చేస్తున్నాము''–అంటారు డాక్టర్ హాన్ సూయిన్.

—శకుంతల బాలు

---



లిసెట్టీ వెర్సల్ అనే అందమయిన అమ్మాయిని మోడల్‌గా పెట్టుకుని ఫ్రెంచి చిత్రకారుడు జూలీ మౌరిస్ ఎంతో పేరు, మరెంతో డబ్బూ సంపాదించాడు. ఐతే ఆ అందమయిన అమ్మాయికి ఒక ప్రభుత్వోద్యోగితో పెళ్ళి నిశ్చయమయిపోయింది. ఈ వార్త తెలుసుకున్న మౌరిస్ ''దగా, మోసం! నిన్ను పెళ్ళి చేసుకుందామనుకున్నాను. ఈ పెళ్ళి ఎలా జరుగుతుందో చూస్తా'' నన్నాడు.

ముహూర్తం రోజున వెర్సల్‌ని నగ్నంగా చిత్రించిన చిత్రాలన్నిటినీ వివాహం జరిగే చర్చి గోడలకి అలంకరించాడు. ఆ చిత్రాల క్రింద ''నాకు తెలిసిన వెర్సల్'' అంటూ వ్యాఖ్యలు రాశాడు. ఆ చిత్రాలని, చిత్రాల క్రింద వ్యాఖ్యలని చూసి పెళ్ళికొడుకు బంధువులందరూ ''సిగ్గుంటే ఈ పెళ్ళి చేసుకోవద్దు''ని పెళ్ళికొడుక్కి చెప్పేసరికి అతను సరేనన్నాడు.

వెర్సల్ తిరిగి మౌరిస్ స్టూడియోకి చేరుకుంది. అతనితో అన్నివిధాలా సహకరిస్తానంది. రేపో మాపో ఇద్దరూ వివాహం చేసుకోబోతున్నారు. —బి.కృష్ణవేణి




# స్వామి అయ్యప్ప

## గ్రూప్‌లో సభ్యులుగా చేరండి!

మొదటినెల రు.18లు. తదుపరి ప్రతినెల రు.11 చొ॥న 12 నెలలు. మాత్రమే చెల్లించాలి!

తదుపరి రు.10 చెల్లించిన వెంటనే స్టేట్ బ్యాంకు ఆఫ్ హైదరాబాద్ వారి కేష్ సర్టిఫికెట్లు రు.150 లకు పొందండి! సభ్యులుగా చేరిన వెంటనే జిప్ టాయిలెట్ బ్యాగ్ పొందండి! ఒకేసారి రు.160 చెల్లిస్తే జిప్ టాయిలెట్ బ్యాగ్‌కు బదులు జిప్ డాక్యుమెంట్ ఫైలు పొందగలరు!

మొత్తం బహుమతులు 37,655.

మొత్తం బహుమతుల విలువ రు.6,47,425.

లక్షరూపాయిల నుండి పదిరూపాయిల వరకు బహుమతులు గలవు. ఏ బహుమతి పొందలేని వారికి స్కీము ఆఖరున రు.100 బోనస్‌గా యివ్వబడును.

స్వామి అయ్యప్ప గ్రూప్‌లో వచ్చు లాభములో 25% స్వామి అయ్యప్ప దేవాలయములకు విరాళముగా యివ్వబడును.

**ANDHRA PRADESH SAVING & FINANCE**

**J.P. ROAD - RAJAHMUNDRY**

PHONE: 4411 P.B.47 GRAMS: SAVING

Regional Office: Nampalli Station Road - HYDERABAD



## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు – 40' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు అక్టోబర్ నెలాఖరులోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1978 డిసెంబర్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనుక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. వయసును ఇముడ్చుకున్న ఉద్దేశ్యము ఏమి?
2. ధరించవలసినదే గాని, వస్త్రం కాదు!
3. రత్నములు పుట్టే చోటు
4. ముందు హ్రస్వం చేస్తేనే వ్రాయగలం.
5. ఐదక్షరాల గుంపు
6. శీర్షాసనంలో వున్నవాని శిరసు
7. కాబట్టి, అది అడవి (తిరగబడింది)
8. ఒక చర్మవాద్యం
9. హాయి కలిగించేది.
10. అపశకునంగా మనం భావించే దాని తోక తెగింది; తిరగబడింది.
11. అంత వేగమైతే 'పల్టీ' కొట్టదా!
12. జొన్నకు చెందినవి తెలియాలంటే అట్నుంచి చదవాలి.
16. తొట్రుపాటు ఎరగనిది
17. పిల్లలు ఆడుకునేది పగిలి చెల్లాచెదురైంది.
18. ఇదీ కాస్తుంది గాని, కుక్క కాసినట్టుకాదు. (తిరగబడింది)
19. మల్లెతీగ
20. ఊతకు పనికొస్తుంది.
21. ఉవ్యాఖ్యవచనాన్ని ఇలా అనవచ్చు.
22. సాగరానికి మరో పేరు.

### ఆధారములు – నిలువు

1. ఇబ్బంది పెట్టని మాట
5. వంటకి సీళ్ళు సరిగ్గా పెట్టండి.
9. ఉండడానికి అనువైనది కాదని చెప్పడానికి లేదు.
10. ఒక లోహం తారుమారైంది.
13. కవిత్వానికి అవసరమవుతుంది.
14. అద్దంతో ఎక్కువ చెలిమిగలది.
15. మూడు కలయిక

# వనిత మాటల కొలువు-40
# రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 13 | | 14 | ■ | 2 | 15 |
| | ■ | | ■ | 3 | 16 | ■ | |
| 4 | 17 | ■ | 5 | | | 18 | |
| 6 | | ■ | | ■ | 7 | | ■ |
| ■ | 8 | 19 | | 20 | | ■ | 21 |
| 22 | ■ | | ■ | | ■ | 9 | |
| | ■ | | ■ | ■ | 10 | | |
| 11 | | ■ | 12 | | | ■ | |

పేరు ______________________________

చిరునామా ______________________________

______________________________

______________________________

______________________________

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| క | க | ಕ | ക | क | ક | କ |
| కా | கா | ಕಾ | കാ | का | કા | କା |
| కి | கி | ಕಿ | കി | कि | કિ | କି |
| కీ | கீ | ಕೀ | കീ | की | કી | କୀ |
| కు | கு | ಕು | കു | कु | કુ | କୁ |
| కూ | கூ | ಕೂ | കൂ | कू | કૂ | କୂ |
| కృ | — | ಕೃ | കൃ | कृ | કૃ | କୃ |
| కౄ | — | — | — | — | — | — |
| కె | கெ | ಕೆ | കെ | — | — | — |
| కే | கே | ಕೇ | കേ | के | કે | କେ |
| కై | கை | ಕೈ | കൈ | कै | કૈ | କୈ |
| కొ | கொ | ಕೊ | കൊ | — | — | — |
| కో | கோ | ಕೋ | കോ | को | કો | କୋ |
| కౌ | கௌ | ಕೌ | കൌ | कौ | કૌ | କୌ |
| కం | — | ಕಂ | കം | कं | કં | କଂ |
| కః | — | ಕಃ | കഃ | कः | કઃ | କଃ |

[వచ్చే సంచికలో మరికొన్ని]

# ఏడు మాసములు ఇరువది దినములు

## 1

ఎటు చూచిన సుకుమారము, నాగరికత ద్యోతక మగుచుండెడిది గోపాలరావునందు. సన్నని గోరంచు ధోవతులు, మెత్తని పట్టు చొక్కాయిలు, పాము కుబుసములాగు మిసమిసలాడే జరీ ఖండువాలు తప్ప అతడు వేరొక వస్త్రమే వాడి యెరుగడు. ఎప్పుడును పాపిట చెరుగని క్రాపింగు, పాలిష్ మాయని బూడ్సులు, నల్లని ఫ్రేములో అమర్చిన గుండ్రని కంటియద్దములు, రిష్టు వాచీ గలిగి తాను జన్మించిన యున్నత కుటుంబమునకును, తాను చదివెడి యున్నత విద్యకును తగిన ఆకారమును, వర్తనమును కలిగియుండేవాడతడు. ఇంత నాగరికతగా నుండునని వర్ణించుటచే అతడు వట్టి షోకులరాయడని పాఠకులు భ్రమకు లోనగుదురేమో? వినయకారుణ్యాది గుణ విశేషములు అతనికి పెట్టని సొమ్ములు. సుప్రసన్నమైన అతని ఆననము సౌమ్యతకు కుదురు. మాతృదేశమనిన అతనికి పరమభక్తి. ఎవనికి దేశముపై ప్రేమయున్నదో వాడు దేశ హితైక కార్యములందు పాల్గొనకెట్లుండగలడు? మహాత్ముడు సత్యాగ్రహము నారంభించి దేశీయుల నెల్లర రండురండని ఆహ్వానించినప్పుడు ఆయన ఆహ్వానమునందుకొనిన విద్యార్థి గణములో గోపాలరావు ఒకడు. అతడు వరించిన కార్య క్షేత్రము విదేశ వస్త్ర బహిష్కారము.

## 2

రుక్మిణి పురిటి నిమిత్తము ఏడు మాసముల క్రిందట పుట్టినింటి కేగినది. కొమారుడు కలిగినాడు. పిల్లవానికి అయిదవ మాసము వచ్చినది. బారసాల చేసికొని భార్యను, బిడ్డను తీసికొని వెళ్ళవలసినదని మామగారు మూడవ నెలను, అయిదవ నెలను గూడ జాబులు వ్రాసినాడు గోపాలరావునకు. సత్యాగ్రహోద్యమములో మునిగి తేలుచున్న గోపాలుడా యుత్తరములకు జబాబియ్యలేదు. పోలేదు. రుక్మిణికి అత్తవారింటి కేగవలయుననెడి ఆతురత అధికముగా నుండుట గమనించి తలిదండ్రులు బిడ్డసారె పెట్టి రుక్మిణిని అత్తవారింటికంపినారు. తాను పుత్రవతియైనది. ఆ సమయముననే తన భర్త ఎం. ఏ. పరీక్షయందు త్తీర్ణుడైనాడను సమాచారము వినినది. భార్యాభర్తలు మనసు కలిసిన వారు. ఎలప్రాయముననున్నవారు. ఎన్ని ముచ్చటలుండును? తమ సుఖమయ సంభాషణలచే అధమమొక వారము దినములైనను విరామ ముండదని రుక్మిణి మదిలోని అభిప్రాయము. రైలులో పయనించినంతసేపు తమ ప్రసంగము లెట్టివిగా నుండునో ఊహించి మురియుచు, తనువుకంటె ముందుగా పెనిమిటి సన్నిధికి పరువులు పెట్టుచున్న చిత్తముయొక్క ఉరవడికి నవ్వుకొనుచు, జబాబు వ్రాయనందులకు బాగుగా నిష్ఠురములాడవలయును, పరీక్ష ప్యాసైనందుకు బాగుగా అభినందించవలయును, బారసాలకు రానందులకు బాగుగా నెగతాళి చేయవలయును అని యేవేవో జాగ్రత్స్వప్నములు. ఆకాశ హర్మ్యములు నిర్మించుకొనుచు వచ్చినది. స్టేషను వద్దనే తన భర్త ముఖారవిందము తప్పక నయనపర్వమొనర్చునని ఆమె దృఢ నిశ్చయము. రైలు దిగగానే ప్లాట్‌ఫారమంతయు కలయ చూసినది. ఆమె హృదయాకాశమున చిరు మబ్బులు ఆవరించినవి.

## 3

ఆ నాడు విదేశ వస్త్ర దుకాణముల వద్ద తీవ్రముగా పికెటింగు జరుపుటచే అలసి సొలసి మధ్యాహ్నము పదిరెండు గంటలకు ఇంటికి





సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ తమ **82** వ ఏట, ఆగస్టు **13** వ తేదీన బాపట్లలో మరణించారు. ఆమె ఎన్నో కథలు రాశారు; నవలలు రాశారు. 'గృహలక్ష్మి స్వర్ణకంకణం' పొందిన తొలి వనిత (**1934**) ఆమే. ఆమె సంస్మరణార్థం **47** సంవత్సరాల క్రితం ఆమె రాసిన "ఐదు మాసముల ఇరువది దినములు" అన్న కథను – ఇక్కడ ప్రచురిస్తున్నాము. ఈ కథ **1931** అక్టోబర్ 'గృహలక్ష్మి'లో ప్రచురింపబడిన కథ.

వచ్చినాడు గోపాలరావు. భార్య రాకను పని తొందరలచే మరిచిపోయిన గోపాలరావు భార్యను చూచి 'అవును, యీ దినము వస్తానని వ్రాసినారు గాదూ?' అని జ్ఞాపకము తెచ్చుకొనినాడు. ఉత్తరము వ్రాయకపోయిననేమి, రైలువద్దకు రాకపోయిననేమి తన్ను చూచినప్పుడు ఉల్లాసముగా భాషింపడనునది రుక్మిణి ఊహింపని ఆపద. అప్పుడు రుక్మిణి ధరించియున్న చీర అర్టుసిల్కు. రెవిక గ్లాస్గోమల్లు. ఆమె కొమారునకు తొడిగినది గూడ విదేశపు దుస్తులువే. గోపాలరావు కన్నులలో కోపము, అసహ్యము నృత్యము సల్పినవి. మధురమందహాసము లేదు. మనోజ్ఞ భాషణములు లేవు. అడావిడిగా నాల్గు మెదుకులు నోట వేసుకొని వెళ్ళిపోయినాడు.

మగని వర్తనము రుక్మిణికి పిడుగు అడచినట్టులైనది. పచ్చ జామిపండువలె మిసమిసలాడుచు, నవ్వుచు, కేకిసలు కొట్టుచు, ఉ:అ అంటూ నల్లని ముంగురులు ముఖముపై క్రమ్ముచుండ చూచినవారినెల్ల ముద్దుల విందులకు పిలిచే పాల బుగ్గలతో నొప్పుచున్న కుమారుని క్రిందికి దింపకుండా యెత్తుకొనుననుకున్న పెనిమిటి చూపిన ఉదాసీనమునకు కారణము ఆమెకు తెలియలేదు. వేషమే మారినది. భాషే మారినది. మనిషే మారినాడు. ఈ పరిణామమునకు కారణమేమిటో రాత్రికి తప్పకుండా తెలిసికొనవలయును. అస్తమయము కొరకు సూర్యునివంక చూచుచున్నది రుక్మిణి. ఆ నాడు ఆమె అన్నమును మునిపంట కొరికినది. కూర్కు అసలే యెరుగదు. తల్లియొక్క కళవళపాటుకు ఫలితముగా పిల్లవాడా దినమంతయు పోరుపెట్టి యేడ్చుచునే యున్నాడు.

## 4

రాత్రి పది గంటలకు గోపాలరావు ఇంటికి వచ్చి చొక్కా విప్పుచున్నాడు. పోలీసు సబ్ యిన్‌స్పెక్టరు వచ్చి "గోపాలరావుగారూ!" అన్నాడు. వెంటనే గోపాలరావు "ఎవరు" అనుచు వాకిలిలోనికి వచ్చినాడు. "గోపాలరావు గారు తమరేనా?" అని వారంటు ఉత్తరువు జారీ చేసినాడు ఇన్‌స్పెక్టరు. గోపాలరావు నిశ్చలుడై నిలువబడినాడు. అతని ముఖసీమపై ఎట్టి వికారమును కనిపించలేదు.

"ఒక గంట టైమిస్తారా?" అన్నాడు యిన్‌స్పెక్టరుతో. 'వీలుకాదు' – 'భోజనము చేసియైన రావచ్చునా?' – 'ఉత్తరువు లేదు' 'సరె, రెడీ' అని ఇన్‌స్పెక్టరు వెంట నడిచినాడు గోపాలరావు.

## 5

ఓపిక గల మేజిస్ట్రీటు ఆ రాత్రివేళగూడ కోర్టులోనే కూర్చున్నాడు. జీతము మామూలే కాని న్యాయాధికారులకప్పుడు పని మాత్రము డబుల్. పట్టుదల గల ప్రచారకుల నెంత త్వరగా ఊరినుండి తరిమివేసినంత హాయిగా నిద్రపోవచ్చునని అధికారుల ఊహ. గోపాలరావు యిన్‌స్పెక్టరులు ముందూ, వారి వెనుక నిరువురు రక్షకభటులూ. మేజస్ట్రీటు గోపాలరావును చూచి 'ఏమయ్యా! విదేశ వస్త్రములు ధరింపరాదని ప్రజలలో తీవ్ర ప్రబోధము గావించుచున్నావట గదా?' – 'అవును'.

'విదేశ వస్త్రములు దహించివేయమన్నావుట గాదూ?' – 'నిజమే'.

'విదేశ వస్త్రపు దుకాణముల వద్ద గుంపులు చేర్చి విదేశ వస్త్రములు కొనవద్దని ప్రజలను బాధించుచుంటివట గాదూ?'

'బాధించుట లేదు. బ్రతిమలాడుటే'.

'అయితే నీవు నేరస్తుడవే'.

'మీ దృష్టిలో'.

'డిఫెన్సు పెట్టుకుంటావా?' – 'ఊహూ'.

'అపాల్జీ?'

గోపాలరావులోని శౌర్యరసమును వెలికి చిమ్ముచున్నట్లుగా అయిపోయినవి దృక్కులు. మేఘ గంభీరమైన నినదంతో అన్నాడు: "సత్యాగ్రహ వీరుల నిఘంటువు నుండి డిఫెన్సు, అపాల్జీ అనే పదములు తుడిచివేయబడినవి".

మేజస్ట్రీటు చకితుడైనాడు. మాట తడబడినది. "దృష్ట్వాహిత్వాం ప్రవ్యథితాం తరాత్మాధృతిం నవిందామిశమంచవి విష్ణో' అని అర్జునుడు కృష్ణుని విశ్వరూపమును చూచి భయార్తుడై వలవలలాడిన చందమున నించుకసేపు లోలోన కొట్టుకాడినది అతని అంతరాత్మ. అయినను కర్తవ్యము తప్పదు. బిడియముతో, భయముతో గద్గదకంఠుడై ఆరు నెలలు కఠినశిక్ష, సి. క్లాసు అన్నాడు మేజస్ట్రీటు.

"వందనములు" అన్నాడు గోపాలరావు.

## 6

రుక్మిణికి ఇల్లు అరణ్యమైపోయినది. ఎనిమిది నెలల క్రితము పుట్టినింటికేగి ఆ దినమే వచ్చినది రుక్మిణి. కొడుకును చూపలేదు. మాటలు మాటాడలేదు. నవ్వులు నవ్వలేదు. హాస్యములాడలేదు. తన హృదయమాతనికి తెలుపలేదు.

అతని హృదయము తాను తెలిసికొనలేదు. హా! ఎట్టి యుత్కంట కెట్టి విఘాతము? పెనిమిటి శిక్ష వర్తమానము విని పిడుగడచినట్లు నేలగూలిపోయినది రుక్మిణి.

‘‘ఎండకోర్వలేడు. ఆకలికోర్వలేడు. కష్టమైన పని చేయలేడు. గరగర నేతిలో వేగిన కూరలుగాని పనికిరావు. మెత్తని పక్కపై గాని మేనువాల్చడు. బజారునుండి ఒక్క వస్తువు తేరా బాబూ! అంటే అభిమానము, సిగ్గు. ఇటువంటివాడివే, నా తండ్రీ! ఈ ఆరు నెలలు ఆ చెరలో ఎట్లు గడపి వస్తావురా? మా కన్నులెప్పుడు చల్లబరుస్తావురా?’’ అని తల్లిదండ్రులు గోల. అన్నాలు లేవు. నీళ్ళు లేవు. మిన్ను విరిగి మీదబడ్డట్టయినది ఆ సంసార స్థితి.

## 7

రుక్మిణి సిరిగల యింట బుట్టినది. ఆమె తండ్రి గొప్ప ఉన్నతోద్యోగి. కాన స్వార్థప్రేరితమైన రాజభక్తి వారి చిత్తములకు పెట్టని కోట. బహిర్ప్రపంచములోని వ్యవహారములు వారి చెవికి చేరవు. పేదసాదల కష్టనిష్ఠురములు, విదేశ వస్తువులవలని యనర్థకములు, పరాదీన భారతదేశపు అగచాట్లు వారెప్పుడును వినిన సంగతులుగావు. ఇంటిలోని ఆడవారు నల్గురు ఒక్కచోట కూర్చుండినచో వారి ప్రసంగ విషయములు చీరలు, నగలు, కాకపోతే పిండివంటలు, వేపుడు కూరలు, కాఫీలు, టీలు. ఇట్టి భోగ ప్రపంచములో పుట్టి పెరిగినదగుటచేత రుక్మిణి జ్ఞానముగూడ వీనికి మించలేదు. సత్యాగ్రహోద్యమముచే దేశమట్టుడికినట్లుడికిపోవుచున్నను వానిని గురించి ఆమె కొంచెముగూడ విచారించి యుండలేదు. నేఁడు తన దేశమునందు తయారైన వస్త్రములను దాను ధరించి యితరులనుగూడ ధరింపుడని ప్రబోధించినందులకు తన మగనికి దొంగలకు, దోపిడిగాండ్రకు, హంతకులకు వేసినట్లు కఠినశిక్ష వేసినారని విని రుక్మిణి ఆశ్చర్యచకితురాలై పోయినది.

‘‘ఏమి? మనదేశపు గుడ్డ మనము కట్టుకొనుట గూడ తప్పేనా? నేడిదైనది. రేపు మీకు గావలసిన ఆహారపదార్థములను మేమే పచనము చేసి పంపెదముగాని మీరు తయారు చేసికొనరాదనినచో మన ప్రొయ్యిలు తవ్వివేసికొనవలసినదేనా? ఎంత అధమపు బ్రతుకు. నా పెనిమిటి నాతో మాట్లాడలేదని యెంతో వేదన పడితిని. కాని కారణము తెలిసికొనలేకపోతిని. నేను, పిల్లవాడు ధరించియున్న విదేశ వస్త్రములే వారికి అసహ్యకారణమై యుండవలయును. విదేశ వస్త్రములలో నైసూ, నాజూకూ ఉన్నదనుకొనుచుంటిమిగాని వానిలో ఇంత పరాధీనత యున్నదని గమనించలేదు. ఛీ! నా పతికి అప్రియములగుటయేగాక శిక్షాహేతువులైన ఈ విదేశ వస్త్రములు నాకేల?’’ అని యోచించి తక్షణమే రుక్మిణి తన చీనిచీనాంబరములకు నెలవొసంగినది. ఆమె ఇప్పుడు ఖద్దరు వస్త్రధారిణి. ఏ హార్మోనియము వాయిద్యమో, ఫిడేలు వాయిద్యమో వినబడుచుండెడిది రుక్మిణి మేడమీద గదిలో మునుపు. ఇప్పుడు ఎల్లవేళల రాట్నపు నినదము.

## 8

గోపాల రావు బళ్ళారి జెయిలులో శిక్షననుభవించుచున్నాడు. జెయిలులో భోజనము సరిపడలేదనియు, చాల చిక్కిపోయినాడనియు, జిగట విరేచనములు పట్టుకొనినవనియు, ప్రదేశము మార్చినారనియు, యేవేవో వార్తలు వచ్చుచున్నవి గాన తండ్రి, మామగార్ల బలవంతముచే గోపాలరావు క్షమాపణ యిచ్చి వచ్చునను వార్తను మాత్రము కలలోని వార్త చేసినాడు గోపాలరావు. రుక్మిణికి వేరు పనిలేదు. ఆమె చిత్తము పెనిమిటి మీద, చేయి రాటము మీద. గోపాలరావు జైలుకు వెళ్ళి దాదాపు అయిదు మాసములైనది. ఈ అయిదు నెలలలో ఆమె పెనిమిటి కొరకొక ఉత్తరీయముల జతను, ధోవతుల జతను, ఒక చొక్కా తానును తన సొంత దారముతో నేయించి యుంచినది. అల్లుడు చెరసాల ప్రవేశము వినినంతనే తండ్రి వచ్చి, ‘‘అమ్మాయీ! ఇక నీవు ఇక్కడెందుకు? అతను వచ్చినదాకా మన యింట్లోనే ఉందుగాని రా’’ అని రుక్మిణిని పిలిచినాడు. రుక్మిణి జబాబు చెప్పలేదు. చెక్కిళ్ళపై దిగజారిన కన్నీళ్ళను గోటికొనలతో చిమ్ముకొని, పైట చెఱగుతో తడి తుడిచికొనినది. తండ్రి మరల ఆ ప్రస్తావన చేయలేదు.

## 9

సంక్రాంతి పండుగ వచ్చినది, వెళ్ళినది. కాని మువ్వంతు యిండ్లలో ఆ యేడు పండువు లేదు. ఇంటింట తండ్రియో, కొమరుడో, తోడబుట్టినవాడో, అల్లుడో ఎవరో ఒకరు చెరసాల క్లేశమనుభవించుచున్నప్పుడు పండుగుపై ప్రేమ యెవరికి?

రుక్మిణి అత్తవారింట యెన్ని వత్సరముల నుండియో సావిత్రీగౌరిని ప్రతిష్ఠించుట వాడుక. ‘‘నీకిష్టమైతే ఈ యేడుగూడ అమ్మవారిని పెట్టి నోమునోచుకో అమ్మా! అమ్మవారి నోము మానుకోడమెందుకూ?’’ అన్నది వాళ్ళత్తగారు రుక్మిణితో. భర్తకు శుభములగూర్పజేయు నా వ్రతమును జరుపుటకు రుక్మిణికిగూడ కుతూహలము గలిగినది. కాని సావిత్రీగౌరీ వ్రతము ఒక్కరు చేయునదికాదుగదా, చాలామంది కలిసి నోచుకొనవలెను. తమయింట సావిత్రీగౌరిని పెట్టితిమని తెలిసినచో ఈయేడుగూడ పెక్కుమంది యువతులువచ్చి నోచుకొనెదరని ఆమెకెరుకయే. అయితే వారు తొల్లిటివలె విదేశవస్త్రముల ధరించి వచ్చి నోము నోచుకొనినచో తాను పతికి హితమైన వ్రతము జరిపినదెట్లగును? రుక్మిణికి గల్గిన ఈ సందియము నిట్లుపూరించినది. ‘‘ఈవత్సరము మాయింట నోము నోచుకొనువారు ఖద్దరు వస్త్రములు ధరించియే నోచుకొనవలయును’’ అని నోము నోచుకొన నెంచువారికి కబురంపినది. ఈ నియమమునకు బద్ధులు కాలేకపోవుటచే రుక్మిణియింట నోము నోచుకొనువారు కొద్దిమంది యైనారు. రుక్మిణి నిరుత్సాహము జెందలేదు. ఆ కొద్ది మందితోనే సావిత్రీ గౌరీవ్రతమారంభించినది.

## 10

సావిత్రీగౌరినిపెట్టి నాటికి ఎనిమిది దినములు. సావిత్రీపూజాతత్పరలగు నారీరత్నములతో సావడి కలకలలాడిపోవుచున్నది. తెల్లవారితే తొమ్మిది దినములు. వ్రతము ముగియును. దేవికుద్వాసము చెప్పబడును. కాన ఆ యెనిమిదవనాటి రాత్రి సావిత్రీదేవియొక్క యుజ్వలరూపము దర్శనీయము. కడపటి దినమగుటచే ఆ దినము నోము నోచుకొనెడివారేగాక చూడవచ్చిన పేరటాండ్రుగూడ గుంపులుగుంపులే. వారము దినములనుండి ప్రాతస్సంధ్యల సల్పిన పూజలచే నాడు దేవీరూపము పసుపుకుంకుమముల కుప్ప, పుష్పాక్షతలరాసి. ఆమె చుట్టు భక్త్యుత్సాహములతో వినమ్రలై దేవినర్చించు తొయ్యలులు. ఎక్కడ జూచిన దీపములు! ఎక్కడ జూచిన పిండి ముగ్గులు! ఎక్కడ జూచిన పసుపుకుంకుమలు! ఎక్కడ జూచిన గంధాక్షతలు! ఎక్కడ జూచిన అగరుధూమములు! ఎక్కడ జూచిన పుష్పములు! ఎక్కడ జూచిన కర్పూరనీరాజనములు! ఎక్కడ జూచిన నివేద్యపదార్థములు! అహో! ఆ రాత్రి

వేళ, ఆ దీపముల సన్నిధిని, ఆ దేవీమూర్తి యెదుట శుద్ధ ఖద్దరు వస్త్రధారిణులై నిశ్చలదీక్షతో దేవినర్చించుచున్న యామానవతీమానసములలో ఎట్టి భావములు, ఎట్టి ఆకాంక్షలు, ఎట్టి సంకల్పములు ఉద్భూతమై దేవికి నివేదింపబడుచున్నవో యెవరికెరుక?

## 11

నాటికి గోపాలరావు ఖైదుకు వెళ్ళి అయిదు నెలల ఇరువదిదినములు. తక్కిన పదిదినములు వ్రేళ్ళపై లెక్కించుచున్నది రుక్మిణి. కాని గోపాలరావు తన సత్ప్రవర్తనచే శిక్షాకాలములో పదిరెండు దినములు ముందుగనే విడుదలయైవచ్చునని ఆమెకేమి తెలియును? రాత్రి యెనిమిదిగంటలకు పడమటినుండివచ్చు బండివచ్చినది. వెళ్ళినది. వెళ్ళుచు కూతగూడ బెట్టినది. ఎవరును వినలేదు. తమ సావిత్రీపూజాసంరంభములో ఆ యువతుల కీరైలు రాకపోక లేమియెరుక '

రైలువచ్చి వెళ్ళిన ఇరువది నిముసములకు–ఇంటినిండ క్రిక్కిరిసియున్న నారీమణులలో–'గోపాలరావుగారు వచ్చినారు, గోపాలరావుగారు వచ్చినారు' అని ఒక చిన్న కలకలము పుట్టి రుక్మిణి చెవికెక్కినది. ఎక్కుటయేతడవు. ఇక ఆమె మోదనారాశికి పారమెక్కడ? దేవికై కూర్చిన కుసుమమాలలు ఒరులకై వినియోగింపవచ్చునా అను ఆలోచనయేదీ? ఆమె దృష్టిలో పతియు దైవమే. దేవికి సమర్పించుటకై కూర్చియుంచిన కుసుమమాలికను కరములగైకొని యొక్కయుదుటున పతిసందర్శనమున కేగినది రుక్మిణి. చేతనున్న పుష్పమాలను చేతికందించునో కంఠసీమనలంకరించునో, చరణయుగళిపై సమర్పించునో–రుక్మిణి మనస్సంకల్పమప్పుడెట్లుంగినున్నదో కాని కుసుమమాలికా కీలితకరాబ్జయై మహోత్కంఠతో నేతెంచు రుక్మిణి నల్లంతనే చూచినాడు గోపాలరావు. తనువు కృశించినది. జవము సడలిపోయినది. మారురూపుపడిపోయినాడు. కాని యుజ్జ్వలములైన ఆ నేత్రములలో దీపించు ఆ దేశభక్తికి తరుగు ఒరుగులులేవు. 'రుక్మిణీ! ఆ పూలదండ సీమనూలుతో గట్టినదేమో, నేను ముట్టను' అన్నాడు గోపాలరావు. అనిశితశరాపాతము వంటి వాక్యప్రయోగమున కుపహతినొంది నేలగూలుటకు రుక్మిణి మునుపటి రుక్మిణియా? కాదు. ఆయోధపత్ని ఇట్లు ధీరతతో జబాబిచ్చినది; ''సీమనూలు నాచేతినుండి తొలగి అయిదు మాసముల యిరువది దినములు.'' □



# 'రేడియో' భానుమతి

మీరు మద్రాసు కేంద్రంలో తయారై ప్రసారితమయ్యే రేడియో కార్యక్రమాలు వింటూ వుంటారా.... అయితే మీకు ఒక చక్కటి స్వరం స్వాగతం పలుకుతూ వుండాలే.... నాలుగు దశాబ్దాలుగా ఆ కంఠస్వరం మద్రాసు ప్రాంతపు తెలుగు వారినే కాక ఆ కార్యక్రమాలు వినే అఖిలాంధ్ర కోటి శ్రోతలను అలరిస్తోంది. ఇంతకీ ఆ కంఠస్వరం ఎవరిదో యిప్పటికి మీరు గ్రహించే వుంటారు-'రేడియో భానుమతి' గారిది అని.

నలభై సంవత్సరాలుగా రేడియో కార్యక్రమాల్లో వివిధ రకాలుగా పాల్గొంటూ రావడం సామాన్యమైన విషయం కాదు. అందుకే ఆమె 'రేడియో భానుమతి' ఐంది. మద్రాసులో రేడియో పుట్టినప్పటి నుంచి అంటే – జూన్ 16, 1938 నుంచి ఆమె అందులో పని చేస్తూనే వున్నారు. అందుకే ఆమె 'రేడియో కార్యాలయమే నా పుట్టిల్లు' అని చమత్కరిస్తూ వుంటారు.

భానుమతిగారి స్వస్థలం బరంపురం. స్కూల్ ఫైనల్ వరకు చదువుకున్నారు. బాల్యం నుంచి లలిత కళలంటే అభిమానించేవారు భానుమతి. మురళీ నాదంలో మ్యూజిక్ అకాడెమీ ద్వారానూ, వయలిన్, వీణలలో మదరాసు విశ్వవిద్యాలయం 'డిప్లొమా'లూ పొందారు. ప్రారంభంలో ఆలిండియా రేడియోలో ఫ్లూటిస్ట్‌గా వుండేవారు. ఆమె అప్పట్లో నాటకాలలో వేషాలు వేశారు కూడా. ఒకసారి ఆమె ముద్దుకృష్ణగారి 'అనార్కలి' నాటకంలో అనార్కలి వేషం వేశారు. ''ఆ నాటకంలో సలీం పాత్రధారి ఎవరో తెలుసా .... దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు!'' అన్నారామె.

ఆమె భర్త పుణ్యావధుల సీతారామ బ్రహ్మంగారు, అప్పుడు ఆంధ్రప్రభ సంపాదకవర్గంలో పని చేసేవారు. 'ఆయన్ని భర్తగా పొందడం నా అదృష్టం' అని చెప్పే భానుమతి దంపతులకు ఇద్దరమ్మాయిలు, ఒక అబ్బాయి. పెద్దమ్మాయి దుర్గాదేవి మదరాసు కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీలో నాట్యం నేర్పుతున్నారు; రెండో అమ్మాయి జ్యోత్స్న–హైద్రాబాదు ఆకాశవాణి వ్యాపార విభాగంలో ఎనౌన్సర్‌గా పని చేస్తున్నారు. వారి కుమారుడు విశ్వనాధరావు మద్రాసు రేడియోలో ఫ్లూటిస్ట్‌గా వుంటున్నారు.

''ఆ రోజుల్లో రేడియో ఆర్టిస్ట్ అంటే ఎంతో ఘనంగా వుండేది. నేను నలభైరూపాయల జీతంతో దాదాపు నలభైఏళ్ళ క్రితం చేరాను. అప్పట్లో అన్నీ అప్పటికప్పుడు ప్రసారితమయ్యే కార్యక్రమాలే వుండేవి. ఈ రోజుల్లో లాగా ముందుగా టేప్ చెయ్యడం ఆ తరువాత ప్రసారం చెయ్యడం అంటూ వుండేది కాదు. అందుకే అప్పట్లో మాకు వృత్తిపట్ల భయం, భక్తి, శ్రద్ధ అధికంగా వుండేవి. కాని దురదృష్టవశాత్తు ఇప్పటితరంలో అంత ఓర్పు, శ్రద్ధ కనిపించడం లేదు'' అన్నారు భానుమతి.

మద్రాసు రేడియోలో తెలుగు కార్యక్రమాల గురించి ప్రస్తావన రాగా 'అసలు ఇక్కడ రేడియో కార్యక్రమాలు రూపొందించింది ఆంధ్రులే. నేటికీ ఈ నగరంలో దాదాపు ఎనిమిది లక్షలమంది తెలుగువారు వున్నారు. అయినా ఆదివారాలు, అడపాతడపా ప్రసారమయ్యే కొన్ని కార్యక్రమాలు తప్పించి తెలుగులో ప్రసారమయ్యే కార్యక్రమాలు రోజుకి అరగంట మాత్రమే. అదీ ఈ మధ్య ఉదయం 8-20కి మార్చబడింది. గృహిణికి క్షణం తీరిక లేని సమయం అది. పిల్లలను పాఠశాలలకి, భర్తను ఆఫీసుకి పంపడంలో నిమగ్నమయ్యే గృహిణి యిక ఆ కార్యక్రమాలు ఏం వినగలదు? 'అసలు ఇవి ఎవరికోసం నిర్దేశించబడినట్లు?' అని నన్ను చాలా మంది అడుగుతున్నారు. వారికి నేనేం సమాధానం చెప్పగలను? తెలుగువారందరూ సంఘటితమై ఈ విషయంపై వత్తిడి తీసుకువస్తే గానీ – ఆ కార్యక్రమాలు అందరూ వినడానికి అనువైన సమయానికి మార్చడం జరగదు—అనడం కన్న నేనేం చెప్పగలను?'' అన్నారు భానుమతి ఈ విషయంపై తన నిస్సహాయతను తెలియజేస్తూ. □



నిర్వహణ: మంగళా కందూర్




## చేమంతిపూల బ్యాగ్

బాస్కెట్స్‌కు వాడే వెడల్పు వయర్‌తో ఇది అల్లుతాము. మామూలు పువ్వులు వేయటానికి 2 వయర్స్ వుపయోగిస్తే, దీనికి 3 వయర్లు కావాలి. ముందు పువ్వు వేయటం బాగా నేర్చుకోవాలి. ఎక్కడా కన్‌ఫ్యూజ్ అయ్యే ప్రమాదం రాకుండా వుండేలా ప్రాక్టీస్‌చేస్తే బ్యాగ్ సులువుగా అల్లుకోవచ్చు. ఇవి రెండు రకాలు. కవర్ లేకుండా జిప్ పెట్టి ఒకటి, మామూలుగా బటన్స్, కవర్ వున్నదొకటి. ఒక పువ్వుకు సుమారు 1½ అంగుళాల వయర్ కావాలి. ఆఖరున దోపటానికి 7, 8 అంగుళాల వయరు వుంటే స్ట్రాంగ్‌గా వుంటుంది. సేఫ్‌సైడ్ వుండటానికిగాను కాస్త వయర్ ఎక్కువగానే పెట్టుకోవాలి.

**పువ్వు అల్లే విధానం:**—ముందు ఒక వయర్ మధ్యకు మడచిపెట్టుకోవాలి. దీని మీద, రెండవ వయర్, ఆ తర్వాత 3వ వయరు మడచి వుంచుకోవాలి. (1వ బొమ్మ చూడండి) పైన బొటనవేలుతో నొక్కి వుంచితే జారిపోకుండా వుంటుంది. ఒకటవ నంబరు వయరులోని అడుగు వయరు త్రిప్పి అన్నింటి పైకి పెట్టుకోవాలి. 3వ నంబరులోని అడుగు వయరును, పైకి త్రిప్పి








వుంచిన మొదటి వయరు పైనుండి, ఒకటి, రెండు వయర్ల లూపులగుండా బయటికి లాగాలి. గట్టిగా లాగాక దీనికి కూడ లూపు వుంచాలి. తర్వాత రెండవ నంబరు అడుగు వయరును 3వ, ఒకటవ నంబర్ వయర్ల లూపులగుండా బయటికి రానివ్వాలి. 3వ నంబర్ లూప్ అంటే ఇంతకు ముందు 3వ నంబర్ అడుగు వయరుతో ఏర్పాటు చేశామే ఆ లూపుగుండా నన్నమాట. ఇప్పుడు అన్ని వయర్లనూ జాగ్రత్తగా లాగితే చేమంతి పువ్వు వస్తుంది.

**చిన్న బ్యాగ్‌కు కావలసిన ముక్కలు – 38**
**ముక్క పొడవు – 90 అంగుళాలు**

రన్నింగ్ వయర్‌కు ఈ ముక్కలు అతుకుతూ పువ్వులు వేయాలి. ముందు రెండు ముక్కలు మధ్యకు మడచి ఒకదాని మీద ఒకటి వుంచి దీని పైన రన్నింగ్ వయర్ మడవాలి. రన్నింగ్ వయర్ ఒక కొస 45 అంగుళాలు వుండాలి. అంటే మడచిన ముక్క పొడవన్న మాట. ప్రతి మారు మొదటి పువ్వు అల్లేటప్పుడు రన్నింగ్ వయర్ 3వ వయర్‌గా అంటే అన్నింటికన్న పైన వుండాలి. 45 అంగుళాల రన్నింగ్ వయర్ అడుగు వైపున మిగతా రన్నింగ్ వయర్ పై వైపున వుండాలి. పువ్వు అల్లాలి. ఇప్పుడు రన్నింగ్ వయర్‌ను మొదటి వయర్‌గా మడచుకొని, దీనిపైన మరి రెండు వయర్లు మడచుకొని పువ్వు వేయాలి. ఇలా అన్ని ముక్కలు జాయింట్ చేస్తే 19 పువ్వులు వస్తాయి. ఆఖరున 45 అంగుళాలు వుంచి రన్నింగ్ వయర్‌ను కట్ చేయాలి. రెండవ లైనుకు తిరిగి రన్నింగ్ వయర్‌తో పువ్వులు అల్లుకోవాలి. రన్నింగ్ వయర్‌కు పొడవు చూసుకొని ఇటు అటు వయర్ వుంచి కట్ చేయాలి. మొదట అల్లిన లైనుకాక, 4 లైనులు అల్లుకొని, ఇంకొక వైపుకు త్రిప్పుకొని మరో 4 లైనులు అల్లితే బేస్‌కు సరిపోతుంది. అంటే మొత్తం 9 వరుసలు పువ్వులుంటాయి బేసుకు. మధ్య లైనులో 19 పువ్వులు. తర్వాత రెండు వైపులా 18, 17, 16, 15 చొ॥న వుంటాయి పువ్వులు. ఇప్పుడిక రన్నింగ్



# చందన ఒయ్యారంలో ఒలిగే సౌందర్యం

గోకుల్ మీకు ఇచ్చేది చక్కని తాజా సౌందర్యం, నూతనమైనది. మైక్రోఫైన్ పద్ధతితో తయారు చేయబడినది. పరిశుద్ధమైన చందనం, అద్భుతమైన మూలికలు, ఇతర సువాసన ద్రవ్యములు చేకూర్చ బడినది.




గోకుల్ పౌడరు వాడండి
సౌందర్య దేవతగా ఒలగండి!

## గోకుల్

సాన్‌టాల్ & సాన్‌డల్‌వుడ్ పౌడరు

**టి. యస్. ఆర్. & కంపెనీ, మదరాసు**

ప్రత్యేక తయారింపు

టి. యస్. ఆర్. & కంపెనీ, రామాపురం మదరాసు 600 089

వయర్‌ను కత్తిరించనవసరం వుండదు కాబట్టి ఎక్కువ వయర్‌ను ఒక్కమారే తీసుకోవాలి.

రెండవ బొమ్మలో చూపిన విధంగా ఒకటవ నంబర్ వద్ద నుండి ప్రారంభించాలి. ఆ వయరు, ప్రక్క వయరు ఒక దానిమీద ఒకటి మడచి వుంచుకొని, దీనిపైన రన్నింగ్ వయర్ మడవాలి. 4 అంగుళాల కొసవుంచాలి రన్నింగ్ వయర్‌కు. ఈ కొసను అడుగున వుండనిచ్చి పువ్వు అల్లుకోవాలి. ఇంతకు క్రితం చెప్పినట్టు మొదటి పువ్వుకు ఎప్పుడూ రన్నింగ్ వయర్ 3వ వయర్‌గానే వుండాలి. ఆ తర్వాత నుండి మొదటి వయర్‌గా మడవాలి. బొమ్మలో అడ్డు గీతలను పరిశీలిస్తే ఏ ఏ వయర్లు పువ్వులకు తీసుకోవాలో తెలుస్తుంది. ఆరు భుజాలలోని 3 భుజాలు అల్లుకొన్న తర్వాత బొమ్మలో 2వ నంబరు వేసిన చోట మధ్య వయర్‌ను లోనికితోసి, మిగత రెండు వయర్లు + రన్నింగ్ వయరు కలిపి పువ్వు వేయాలి. తిరిగి పువ్వులల్లుకు మిగిలిన 3 భుజాలు అల్లుకొంటే ఒక రౌండ్ పూర్తవుతుంది. ఇప్పుడు మొదట అల్లిన రన్నింగ్ వయర్ కొసను లోనికి దోపాలి, అంటే ఈ వయర్ ఇక అవసరం లేదన్న మాట. ఇక మామూలుగా పువ్వులు అల్లుకొంటూ పోవాలి. మొత్తం 13 రౌండ్స్ అల్లితే పొడవు సరిపోతుంది. కావాలనుకొంటే మరో రెండు రౌండ్స్ అల్లుకోవచ్చు. ఇక వయర్ కట్ చేసుకొని అన్ని వయర్లను లోనికి దోపాలి.

3వ బొమ్మలో చూపిన విధంగా 4 వయర్లు తీసుకొని, పైన ముడివేసి హాండిల్స్‌కు అల్లుకోవాలి. వయర్లన్ని బోర్లగా వుండాలి. ఎడమ కొస వయరును అడుగు నుండి రెండు వయర్ల అడుగునుండి తీసి, 3వ వయర్‌పై నుండి తీసి దాని ప్రక్కన వుంచాలి. తర్వాత కుడి కొస వయరును అడుగు నుంచి రెండు వయర్ల క్రిందుగా పోనిచ్చి 3వ వయర్‌పై నుండి తీసి, దాని ప్రక్కన పెట్టాలి. తిరిగి ఎడమవైపు నుండి మొదటిలాగానే వేయాలి. ఇలా అల్లుకొంటూ కావలసిన పొడవు రానివ్వాలి. వయర్లు మాత్రం ఎప్పుడూ బోర్లాగా వుండాలి. మనకు కావలసిన పొడవుకు రెట్టింపు వయరు తీసుకొంటే సరిపోతుంది. రెండు హాండిల్స్ విడివిడిగా అల్లుకొని ప్రక్కలకు అతకాలి. ప్రక్కల మడిస్తే (4 పువ్వులు చొ॥న) షేప్ వస్తుంది. అడుగున ప్లైవుడ్ ముక్క కట్‌చేసి పెట్టాలి. లైనింగ్, జిప్‌వేస్తే చూడటానికి అందంగా వుండడమేగాక వస్తువులు వుంచుకోటానికి అనుకూలంగా వుంటుంది. నేను అల్లిన బ్యాగ్ హాండిల్ పొడవు 18 అంగుళాలు వుంది. అంటే 36 అంగుళాల వయర్ ముక్కలు ఎనిమిది కావాలన్న మాట రెండు హాండిల్స్‌కు.

**పెద్ద బ్యాగ్‌కు కావలసిన ముక్కలు–42**
**ముక్కపొడవు–130 అంగుళాలు**

అల్లే విధానమంతా ఒక్కటే. దీని బేస్‌కు 21 పువ్వులు వుంటాయి. అటూ ఇటూ 20, 19, 18, 17 చొ॥న వుంటాయి. 4 లైనులకు పువ్వులు. 18 రౌండ్స్ పువ్వులు అల్లిన తర్వాత కవర్ అల్లాలి. కవర్‌కు గాను 23 పువ్వులు వుంచుకుని, మిగతా వయర్లు దోపటానికి గాను 7, 8 అంగుళాలు వుంచుకుని కత్తిరించాలి. కవర్‌కు ప్రతి లైనుకూ రన్నింగ్‌వయర్ కట్ చేస్తూ వుండాలి. రన్నింగ్ వయర్ కొసలు 3, 4 అంగుళాలు వుంటే సరిపోతుంది. కవర్‌కు 11 లైనుల పువ్వులు వేయాలి. అంటే 12 పువ్వులతో ముగుస్తుందన్నమాట.

ఇది స్లింగ్ కాబట్టి హాండిల్స్ 40 అంగుళాల పొడవు అయితేనే బాగుంటుంది. అంటే, 80 అంగుళాల పొడవు వయర్లు 8 కావాలి 2 హాండిల్స్‌కు గాను. దీనికి జిప్ అవసరం లేదు. అడుగుకు ప్లైవుడ్, లైనింగ్ వంచాలి. రెండు



బటన్స్ పెడితే బాగా వుంటుంది. 3 పాకెట్స్ పైనే కావాలి వయరు. పెద్ద బ్యాగ్ కాలేజి పిల్లలకు నప్పుతుంది. చక్కటి పువ్వులతో ముద్దగా వుండి ముద్దొస్తుంది ఈ బ్యాగ్. దృఢంగా కూడా వుంటుంది. (ఉండకేం చేస్తుంది. మూడు కట్టల వయర్ మింగిందిగా మరి.) ◻



విజయవాడ లయన్ లేడీస్ క్లబ్ నూతన అధ్యక్షురాలిగా శ్రీమతి ఇందిరా ఆర్య జూలై మూడవ వారంలో ప్రమాణ స్వీకారం చేశారు. 1968 నుండి లయన్ లేడీస్ క్లబ్‌లో ఉత్సాహంగా పాల్గొంటూ, కార్యవర్గ సభ్యురాలిగాను, డైరెక్టరుగాను పనిచేసి, ఆమె అనేక సేవా కార్యక్రమాలు నిర్వహించారు. 1977–78 సంవత్సరంలో కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఈ రీజియన్‌లో విజయవాడ లయన్ లేడీస్ క్లబ్ ఉత్తమ క్లబ్‌గా ఎన్నికయేందుకు ఆమె కారకురాలు అయ్యారు. 1978-79 సంవత్సరానికి ఆమె అధ్యక్షురాలిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఆమె భారత మహిళా మండలి సభ్యురాలిగా కూడా కొంతకాలం పనిచేశారు.

ప్రతి నెలా బీద పిల్లలకు ట్రిపుల్ ఆంటిజన్, పోలియోవాక్సిన్ ఉచితంగా యివ్వడం, బీద విద్యార్థులకు పాఠశాల స్థాయిలో ఉపకార వేతనాలు అందజేయడం, పాఠశాల విద్యార్థులకు ఆటల పోటీలు. పాటల పోటీలు; వ్యాస రచన, వక్తృత్వపు పోటీలు, చిత్రలేఖనం పోటీలు నిర్వహించి విజేతలకు బహుమతుల్లు ఇవ్వాలని వారు ఈ ఏడాది తలపెట్టారు.

విజయవాడలో రూఫ్ గార్డెన్ పోటీలు నిర్వహించి ఉత్తమమైన వాటికి బహుమతులు యివ్వాలని కూడా యోచిస్తున్నారు.

రైల్వే ఆసుపత్రిలో పిల్లలకు బొమ్మలు పంచి పెట్టడానికి నెలకు రు 50లు చొప్పున విరాళాలు ప్రకటించారు. నిర్మల హృదయ భవన్ (మదర్ థెరెసా హోం)లో పేదలకు బనీన్లు జూలై 21న పంచి పెట్టారు. పటమట సేవానికేతన్ (అనాధ ఆశ్రమం)లో 50 మంది పిల్లలకి షర్టులు బహూకరించారు. ఒక బీద స్త్రీకి ఉపాధి నిమిత్తం కుట్టుమిషన్ కొనుగోలుకు ఏర్పాటు చేశారు.

—రత్నమాల

# పెరటి తోట:

## బొప్పాయి



మన దేశంలో ఇంచు మించుగా 43 వేల ఎకరాల విస్తీర్ణంలో పండించబడుతూ ఉన్న బొప్పాయి 16వ శతాబ్దంలో డచ్ వర్తకుల ద్వారా మనకు పరిచయమైందని చరిత్రకారులంటున్నారు. దీని పుట్టుక మధ్య అమెరికాలో జరిగింది. భారతదేశం నుండి తక్కిన ఆసియాదేశాలకూ, ముఖ్యంగా శ్రీలంక, ఫిలిప్పైన్స్, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికాలకూ వ్యాపించింది.

బొప్పాయిలో ఎన్నెన్నో రకాలు ఉన్నాయి. అయినప్పటికీ రెండు రకాలు మాత్రం బాగా ప్రసిద్ధిగాంచాయి. అవి–ఒకటి 'వాషింగ్‌టన్' అనే రకమూ. మరొకటి 'హనీడ్యూ' అనే రకమూను. 'హనీడ్యూ' రకంలో ఉన్న గొప్పదనం ఏమిటంటే ఇందులో గింజలుండవు. కనుక ఇది బాగా ప్రఖ్యాతి గాంచింది. రెండు రకాలు కూడా ముదురు పసుపు పచ్చని పెద్దపెద్ద పండ్లను ఇస్తాయి. ఆ పండ్లు తియ్యగానూ, చాలా రుచికరంగానూ ఉంటాయి.

సాధారణంగా అన్ని ఆహార పదార్థాల్లో కన్నా పండ్లు శ్రేష్ఠమైనవి. ఐతే చాలా రకాల పండ్లకు ధరలు అధికంగా ఉంటాయి. కనుక పండ్ల జోలికి సగటు మనిషి – అందునా పేదవాడు పోలేడు. మామూలుగా మామిడి పండును పండ్లలో కెల్లా రాజు వంటిదని అంటారు. అయితే ధర ఎక్కువగా ఉండే ఈ మామిడి పండ్లకన్నా అదేరకం పోషక విలువలు గలిగిన, అదే రకం కమ్మని రుచి గలిగిన బొప్పాయిని అతి తక్కువ ధరలో పొందవచ్చు. అంతే కాదు–ఇంటి వెనుక ఏ కొద్దిపాటి స్థలం ఉన్నా ఈ మొక్కల్ని అతి సులువుగా పెంచేసి చాలా తక్కువ వ్యవధిలోనే ఎక్కువ పండ్లను పొందవచ్చు. ప్రతిసారీ వందకాయల వరకూ కాసే ఈ చెట్టు కనీసం ఐదు సంవత్సరాల వరకైనా సంవత్సరం పొడుగునా కాస్తూనే ఉంటుంది. దాదాపు ఒక్కొక్క కిలో బరువుండే పండ్లను ఎన్నింటినో మనకు అందిస్తుంది.

ప్రతి వారూ పెంచవలసిన, పెంచదగిన మొక్క బొప్పాయి. చిన్న చిన్న తొట్లల్లో బొప్పాయి గింజల్ని వేసి అవి మొక్కలుగా అయి 5, 6 అంగుళాల ఎత్తు పెరిగిన తర్వాత వాటిని సరియైన చోట్లల్లో నాటవచ్చు. మంచిగా సూర్యరశ్మి తగిలే చోట రెండు అడుగుల లోతూ, రెండడుగుల వెడల్పూ గల గోతుల్ని తవ్వి అందులో కంపోస్టు ఎరువుల్ని కలిపివేయాలి. మొక్కలకు నీరు ఎక్కువగా అవసరం లేదు. మామూలు నీరు సరిపోతుంది. మొక్క పెరిగిం తర్వాత నీరు దాని మొదట్లో నిలవకుండా ఎత్తుగా మట్టి పోయవలసి ఉంటుంది. పెరిగినా ప్రతి బొప్పాయి మొక్కకూ ప్రతీ నెలా ½ బకెట్ కంపోస్టు ఎరువు, 4 టీస్పూన్ల అమోనియమ్ సల్ఫేట్, 4 టీస్పూనుల సూపర్ ఫాస్ఫేట్ 8 టీస్పూనుల ఆముదపు పిండి వేయాలి. ప్రతి రోజూ నీరు పోయాలి. గింజలు నాటిన లగాయతు 10 నుండి 15 నెలల వరకు పండ్లు తయారవడం ప్రారంభమవుతుంది.

బొప్పాయిపండులో ప్రతి వంద గ్రాములకూ 0.6 గ్రా. ప్రొటీన్లు 0.1 గ్రా. క్రొవ్వు పదార్థాలు, 0.5 గ్రాముల ఖనిజ లవణాలూ, 0.5 మి. గ్రా. ఇనుము, 13 మి. గ్రా. భాస్వరం, 17 మి. గ్రా. క్యాల్షియం, 7.2 గ్రా. పిండి పదార్థాలూ ఉంటాయి. 32 కెలొరీల ఇంధనశక్తి నివ్వగల 100 గ్రాముల బొప్పాయిలో 0.04 మి.గ్రా. ధయామిన్, 0.25 మి. గ్రా. రిబోఫ్లోవిన్, 0.2 మి.గ్రా. నియాసిన్, 57 మి.గ్రా. విటమిన్ సి లభ్యమౌతాయి. రాగి 0.20 మి.గ్రా. గంధకం 13 మి.గ్రా. క్లోరిన్ 11 మి.గ్రా. పొటాసియం 69 మి.గ్రా. సోడియం 6 మి. గ్రా. మెగ్నీషియం 11 మి. గ్రా. బొప్పాయిలో లభ్యమౌతాయి.

విటమిన్ – ఎ విషయంలో మామిడిపండు తర్వాత స్థానం బొప్పాయిపండుదే। బాగా పండిన బొప్పాయిలో ఎక్కువగా 'కెరొటీన్' అనబడే పదార్థం ఉంది. ఇది బీట్‌రూట్‌లోనూ, పాలకూర వంటి ఆకుకూరల్లోనూ గల కెరొటీన్‌తో సరితూగగలదు. ఈ ఆహార పదార్థాల్లో ఉండే ఈ కెరొటీన్ శరీరంలోకి వెళ్ళిన తర్వాత 'విటమిన్' ఎ గా మార్పు జెందుతుంది. క్రమం తప్పకుండా బొప్పాయిపండ్లను తగుమాత్రం తిన్నట్లయితే తగినంత ఎ, సి విటమినులు మన శరీరానికి చేరుతాయి. బొప్పాయి కాయలో మాత్రం కెరొటీన్ అసలే లేదు. కనుక కాయలవల్ల విటమిన్ "ఎ" లభ్యపడదు. అయినప్పటికీ విటమిన్ సి, కొన్ని ఖనిజ లవణాలూ మాత్రం సమృద్ధిగా దొరుకుతాయి.

ఆపిల్స్‌లో కన్నా, సీతాఫలాల్లో కన్నా, అరటి పండ్లల్లో కన్నా 'కెరొటీన్' బొప్పాయిపండులో అధికంగా ఉండటం గమనించదగిన విషయం. కనుక ఈ పండుకు మనం పెట్టే ఖర్చుకు ఎన్నో రెట్లు పోషక విలువల్ని అధికంగా మనం పొందగలుగుతాము. ప్రస్తుతం విటమిన్ "ఎ" లోపం వల్ల వచ్చే అంధత్వాన్ని చాలావరకు బొప్పాయి పండ్ల వాడకం ద్వారా నిరోధించవచ్చు. మామూలుగా మన అహారంలో కనీసం 30 గ్రాముల పండ్లను ప్రతి రోజూ చేర్చాలని పోషకాహారాన్ని గురించి పరిశోధనలు చేస్తున్న నిపుణులు

అంటున్నారు. ఆ మాత్రం ఫలాలను మనం ఎక్కువ ధరను వెచ్చించి మన ఆహారంలో చేర్చుకోలేకపోవచ్చు. అతి తక్కువ ధరలో లభ్యమయ్యే బొప్పాయిని తీసుకుని ఆ లోటును భర్తీ చేసుకోవచ్చు. లేదా మన ఇంటి వెనుక ఏ మాత్రం ఖాళీ స్థలం ఉన్నా అందులో ఓ మొక్కను పెంచి తద్వారా సునాయాసంగా మనకు కావలసిన పండ్లను ఆహారంతో తీసుకుంటే ఆరోగ్యాన్ని పెంపొందింపజేసుకోవచ్చు. ఈ మొక్కల్ని పెంచడమూ సులువే. ఫలాలను కూడా అతి తక్కువ కాలంలోనే అనుభవించవచ్చు. కనుక ప్రతి ఇంటి వెనుక దొడ్లోనూ, ప్రతీ పాఠశాల ఆవరణలోనూ ఈ మొక్కల్ని పెంచడం చాలా అవసరం. ఈ విషయంలో అప్లైడ్ న్యూట్రిషన్ ప్రోగ్రామ్ క్రింద తగిన ప్రోత్సాహమూ, ప్రచారమూ ఇవ్వడం జరుగుతున్నది. తద్వారా త్వరలోనే ప్రతి పాఠశాల ఆవరణలోనూ ఇంటి వెనుక ఉండే ఖాళీస్థలంలోనూ ఈ మొక్కలు చోటుచేసుకుని మన పోషకాహారలోపాన్ని కొంతలో కొంతైనా తీర్చగలవని ఆశించవచ్చు.

'పాపైన్' అనే పదార్థం బొప్పాయి పండ్లల్లోనూ చెట్టులోనూ ఉన్నది. ఈ పదార్థం మనం తినే ఆహారాన్ని అరిగించడానికి అత్యుత్తమంగా పనికి వస్తుంది. ఈ 'ఎంజైమ్' మన ఆహారంలో ఉండే మాంస కృత్తులను కూడా అరిగించడానికి సహకరిస్తుంది. కనుక చాలామందుల తయారీలో దీనిని కూడా చేర్చడం జరుగుతూ ఉన్నది. బొప్పాయి చెట్టులోని ప్రతి భాగమూ ఇంచుమించుగా ఏదో ఒక ఔషధ విలువల్ని కలిగి ఉన్నట్లుగా ఆయుర్వేదం కూడా చెబుతున్నది.

గాయాలపైన బొప్పాయి ముక్కల్ని వేసి కట్టుకడితే త్వరగా అవి మానుతాయని చెబుతారు.

బొప్పాయిలో మాంసాన్ని మెత్తగా చేసే గుణం వుంది. అందుకే మాంసాహారాల్ని వండేప్పుడు పచ్చి బొప్పాయి కాయ ముక్కల్ని కలిపి వండుతారు కొందరు. అలా వండడం వల్ల త్వరగా పచనం కావడం, భుజించిన తర్వాత త్వరగా జీర్ణం కావడం జరుగుతాయి. బొప్పాయి కాయల్ని మామూలుగా కూర వండుకోవడం కూడా ఉంది. ఆయుర్వేదం ఈ పచ్చికాయలు విరేచనాన్ని కలిగిస్తాయని చెబుతున్నది. బొప్పాయి కాయల రసాన్ని కొన్ని చర్మాలపైన వచ్చే మచ్చల్లాంటి వ్యాధులకు నివారణార్థం వాడడం కూడా జరుగుతున్నది.

బొప్పాయి పండుతో 'స్క్వాష్'లూ, 'జామ్'లూ, 'జెల్లీ'లూ, 'మార్మలేడ్'లూ తయారు చేసుకోవచ్చు. 'ఐస్ క్రీమ్'ల్లోకి, 'ఫ్రూట్ సలాడ్'లలోకి హాయిగా ఉపయోగించుకోవచ్చు. ఈ పండ్లని 'కేనింగ్' చేసి నిలువ వుంచడం కూడా జరుగుతోంది. ఎండిన బొప్పాయి రొంచి తీయబడిన 'పాపైన్'ను అమెరికా దిగుమతి చేసుకుంటోంది. ఉన్ని, ఆహార పదార్థాల పరిశ్రమలకూ, పానీయాల తయారీకి, తోళ్ళకు పదును పెట్టే పనులకు దీనిని ఉపయోగిస్తున్నారు.

బొప్పాయి పండ్లలో ఉండే నల్లని గింజల్లో 'కార్పిన్' అనే పదార్థం ఉంది. ఈ పదార్థం నాడి వేగాన్ని తగ్గించుతుంది. నరాల బలహీనతల్ని తెస్తుంది. అయితే ఈ పదార్థం బొప్పాయి గింజల్లో మాత్రమే. అదీ అతి తక్కువ పరిమాణంలో ఉంది. మిగతా పండులో గానీ, మరే ఇతర భాగాల్లో గానీ ఈ పదార్థం లేదు. కనుక గింజల్ని మాత్రం తీసి వేసి మిగతా పండును ఏ విధమైన అభ్యంతరం లేకుండా తినేయవచ్చునని శాస్త్రజ్ఞులు అంటున్నారు.

చాలామంది బొప్పాయి పండును గర్భిణీస్త్రీలు తింటే గర్భస్రావం కలుగుతుందని నమ్ముతారు. కనుక గర్భిణీస్త్రీలకు బొప్పాయి పండును తినడానికి ఇవ్వరు. అయితే ఈ నమ్మకానికి వైద్య శాస్త్రరీత్యా ఆధారమేమీ లేదు.

—జయా సౌజన్యమూర్తి శ్రీ

## నర్తకి రాజేశ్వరి



ఆ మధ్య గుంటూరు వెంకటేశ్వర విజ్ఞాన మందిరంలో ఆర్. అండ్. బి. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నాగభూషణరావుగారి కుమార్తె కుమారి రాజేశ్వరి అరంగేట్రం (రంగ ప్రవేశం) ప్రదర్శన యిచ్చింది. ఈ రంగప్రవేశం గుంటూరు నాగార్జున కల్చరల్ సెంటరువారు నిర్వహించారు. ఖేలన నృత్య కళాగాలలో శిక్షణ పొందిన కుమారి రాజేశ్వరి–శాస్త్రీయ నృత్యం అభ్యసించిన తరువాత పెద్దల ఆశీస్సులు, విమర్శకుల సలహాలు కోరుతూ ఈ నృత్యప్రదర్శన చేసింది. ఎందరో రసజ్ఞులు హాజరయిన ఈ నృత్య కార్యక్రమం దాదాపు 2 గంటలపాటు జరిగింది.

ఈ యువ నర్తకి అన్నమాచార్య, రామదాసు కీర్తనల కనుగుణంగా నృత్యం చేయటమే కాకుండా జానపద నృత్యం కూడా ఆహ్లాదకరంగా చేసింది. ఈ అరంగేట్రం కార్యక్రమానికి ప్రముఖ నర్తకి వాసిరెడ్డి కనకదుర్గ నృత్య దర్శకత్వం, నట్టువాంగం (గానం) నిర్వహించగా ఖేలన వాద్య బృందం సహకరించారు.

అసలీ-నకిలీ కుంకం పోటీలో పాల్గొనండి.
ఎంట్రీ ఫారాల కోసం మీ డీలర్‌ను అడగండి.

## ఆమె కళ్ళలో
## పరవళ్ళుతొక్కే అందం




## ఆ ఆకర్షణనుపెంచే
## ఆమె నొసటి కుంకం

శింగార్...రంగులలోని అత్యుత్తమమైన పదార్థాలతో తయారైంది, మీ హావభావాలకి సరితూగేలా...మీ బట్టలకి అనుగుణంగా. భారతదేశంలోని అత్యంత సౌందర్యవతులంతా దీనిని ఎంచుకుంటున్నారు.

**శింగార్** కుంకుమ్ బొట్టు—
భారతదేశపు సౌందర్యతిలకం.

everest/78/SH/135-tl

# మహారాష్ట్ర వంటకాలు

సాధారణంగా మనం చపాతీలు, రొట్టెలు చేసుకున్నప్పుడు వాటిల్లోకి బంగాళదుంప కూర, ఉల్లిపాయ, టొమేటో కూర – ఈ విధంగా చేసుకుంటూ వుంటాము. అలా వివిధ రకాల కూరలలో మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్ ప్రాంతాలలో చేసుకునే – 'గాజర్ మటర్', 'ఆలూ సిమ్లా మిర్చి', 'ఆలూ మేథి' అనేవి కూడా







వున్నాయి. ఇవి రొట్టెలలోనే కాక అన్నంలో అద్దుకు తినేందుకు కూడా బాగుంటాయి. అంతే కాదు. ఊరికే తినడానికి కూడా ఎంతో రుచిగా వుంటాయి. మీ పిల్లలకు చేసి పెట్టండి– ఈ మాట అబద్ధం కాదని మీరే అంటారు!

### గాజర్ మటర్

ఇది తయారు చేసుకునేందుకు కావలసిన పదార్థాలు : **225** గ్రాముల గాజర్ అంటే క్యారెట్‌లు, **500** గ్రాముల బటాణీలు, 2 టేబుల్ స్పూనుల మూనెగాని నెయ్యిగాని, $\frac{1}{2}$ టీ స్పూను పసుపు, 1 టీ స్పూను కారం, $1\frac{1}{2}$ టీ స్పూను ధనియాలు జీలకర్ర కలిపి పొడిచేసిన మిశ్రమం, $\frac{1}{2}$ టీ స్పూను మసాలా దినుసు, $\frac{1}{4}$ టీ స్పూను జీలకర్ర, 1 టేబుల్ స్పూను తాజా కొత్తి మెర (చిన్న చిన్న తుంపులుగా చేసుకోవాలి) తగినంత ఉప్పు.

ముందుగా క్యారెట్‌లను చిన్నచిన్న ముక్కలుగా తరిగి వుంచుకోవాలి. నిర్ణయించుకున్న పాళ్ళలో నూనెగాని, నెయ్యిగాని బాణలిలోపోసి స్టవ్ మీద పెట్టాలి. ఇలా స్టవ్ మీద పెట్టిన బాణలిలో జీలకర్ర వెయ్యాలి. జీలకర్ర వేగగానే బటాణీలు. క్యారెట్ ముక్కలు బాణలిలోకి తీసుకోవాలి. దీనికి కొద్దిపాటి నీరు చేర్చాలి. ముక్కలు వుడుకుతూ వుండగానే ఉప్పు. పసుపు వాటికి చేర్చి కలపాలి. ఉడికిన తరువాత వాటికి కారం, జీలకర్ర, ధనియపు పొడి మిశ్రమం, మసాలా దినుసు కలిపి స్టవ్‌మీద కొద్ది నిముషాలదాకా ఆ విధంగానే వుంచాలి.

ఆ తరువాత ముందుగా తరిగి వుంచుకున్న కొత్తిమెరని గాజర్ మటర్ మీద చల్లుకోవాలి.

'ఇలా చేసుకున్న గాజర్ మటర్ చూడగానే నోరూరేటట్లు వుండడమే కాక రుచిగా కూడా వుంటుంది'. అంటారు చేసుకునేవారు.

### ఆలూ సిమ్లా మిర్చి

ఇది తయారు చేసుకోవడానికి కావలసిన పదార్థాలు : **225** గ్రాముల బంగాళదుంపలు, **225** గ్రాముల బుంగ పచ్చిమిరపకాయలు (సిమ్లా మిర్చి) ఒక ఉల్లిపాయ, 2 టొమాటాలు, $\frac{1}{2}$ టీ స్పూను పసుపు, 1 టీ స్పూను కారం, $1\frac{1}{2}$ టీ స్పూను జీలకర్ర, ధనియపు పొడి మిశ్రమం, $\frac{1}{2}$ టీ స్పూను గరం మసాలా దినుసు, 3 టేబుల్ స్పూనుల నెయ్యిగాని మూనెగాని, తగినంత ఉప్పు.

బంగాళదుంప, బుంగ పచ్చిమిరపకాయలను నిలువు పెద్ద ముక్కలుగా కోసుకోవాలి. బంగాళదుంప ముక్కలను విడిగా తీసుకుని వాటిని నేతిలో వేయించాలి. అవి వేగిన తరువాత వాటిని ఒక పాత్రలోతీసి వుంచుకోవాలి. ఆ నేతిలోనే తరిగి వుంచుకున్న ఉల్లిపాయ ముక్కలనువేసి కొద్దిసేపు స్టవ్‌మీద వుంచాలి. ఆ తరువాత ఈ ఉల్లిపాయ ముక్కలకి టొమేటా ముక్కలు, కారం, పసుపు, జీలకర్ర, ధనియపు పొడి మిశ్రమం, మసాలా దినుసు, ఉప్పు చేర్చి రెండు నిముషాలసేపు వేగనివ్వాలి. ఇప్పుడు వీటికి బుంగ పచ్చిమిరపకాయలు, బంగాళదుంప ముక్కలు చేర్చాలి. ఇలా చేర్చిన తరువాత బాణలిని కొద్ది నిముషాలసేపు స్టవ్ మీద వుంచి కలియబెట్టాలి.

హమ్మయ్య! వేడివేడిగా నోరూరించే ఆలూ సిమ్లా మిర్చి తయారయిందన్న మాట.

### ఆలూ మేథి

ఆలూ మేథి తయారు చేసుకోడానికి 2 పెద్ద మెంతికూర కట్టలు, (మేథి) బంగాళదుంపలు (పెద్దవి) 3, జీలకర్ర $\frac{1}{4}$ టీ స్పూను, 1 టీ స్పూను కారం, $1\frac{1}{2}$ టీ స్పూను జీలకర్ర, ధనియాల పొడి మిశ్రమం $\frac{1}{4}$ టీ స్పూను గరంమసాలా, 1 టేబుల్ స్పూను నెయ్యిగాని నూనెగాని. తగినంత ఉప్పు - కావాలి.

ముందుగా మెంతి ఆకుని శుభ్రపరచి తరిగి వుంచుకోవాలి. అలా తరిగి వుంచుకున్న మెంతి ఆకును మూడు నాలుగుసార్లు కడగాలి. అలాగే బంగాళదుంపలను పెద్ద సైజులో కోసి వుంచుకోవాలి. నూనెగాని, నెయ్యిగాని ఒక బాణలిలో తీసుకుని, అది కాగిన తరువాత అందులో జీలకర్ర వెయ్యాలి. ఆ తరువాత బాణలిలో బంగాళదుంప ముక్కలనువేసి వాటిని వేగనివ్వాలి. అవి కాస్త మెత్తబడిన తరువాత మెంతికూర బాణలిలోకి చేర్చాలి. ఈ రెంటిని కలిపి కలుపుతూ కొద్ది నిముషాలసేపు బాగా వుడికే దాకా స్టవ్ మీద వుంచాలి.

ఇక యిప్పుడు మిగిలిందల్లా వీటికి ముందుగా తీసి వుంచుకున్న ఉప్పు, పసుపు, కారం, గరం మసాలా దినుసు చేర్చడం. ఇలా చేర్చిన తరువాత కాస్సేపు స్టవ్‌మీద వుంచి దింపుకుంటే–అరగించడానికి 'ఆలుమేథి' సిద్ధంగా వుంటుంది. □

---

### ఆచంట మహాలక్ష్మి



భారత జాతీయ సహకార సమాఖ్య–(న్యూఢిల్లీ) 'సహకారోద్యమం–దాని అభివృద్ధి' అన్న అంశం మీద అధ్యయనం చెయ్యడానికి, ఆంధ్ర ప్రదేశ్ నుంచి, కుమారి ఆచంట మహాలక్ష్మిని ఎన్నిక చేసింది. ఆమె మూడు మాసాలపాటు రష్యాలో వుండి, అధ్యయనం చేస్తారు. మహాలక్ష్మి విజయవాడలోని కోపరేటివ్ ట్రైనింగ్ కళాశాలలో ఉపన్యాసకురాలిగా పనిచేస్తున్నారు. వ్యవసాయ, ఆర్థిక శాస్త్రాలతో ఆమె ఎమ్. ఎ. పాసయి, ఐ. ఎ. యస్ పరీక్షకు కూడా కృషి చేస్తున్నారు.

మహాలక్ష్మి జన్మస్థలం మచిలీపట్నం. కాలేజీలో చదువుకుంటున్నప్పుడు, చదువుతో పాటు ఆమె వ్యాస రచన, వక్తృత్వ పోటీల్లో కూడా పాల్గొంటూ చాలా బహుమతులు సంపాయించారు. తరచు, 'ఆకాశవాణి'లో వివిధ విషయాల మీద ప్రసంగాలు చేస్తూ వుంటారు.

సోవియట్ ప్రభుత్వపు అతిథిగా వెళ్తున్న మహాలక్ష్మి–ఈ యాత్రలో జర్మనీ, బ్రిటన్ మొదలైన దేశాలు కూడా పర్యటిస్తారు. తన అధ్యయనం పూర్తి చేసుకుని వచ్చిన తర్వాత, మహాలక్ష్మి ఒక నివేదిక తయారు చేసి, సమర్పిస్తారు. ఆ నివేదిక వివిధ భాషల్లోనూ ప్రచురింపబడుతుంది!

—మల్లిడి కనకరత్నం

# వైద్య  విశేషాలు

కుష్ఠువ్యాధి–నల్లులు, పేలు, దోమలవల్ల కూడా ఇతరులకు సోకడానికి అవకాశాలు ఉన్నాయని ది జవహర్‌లాల్ నెహ్రూ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పోస్ట్‌గ్రాడ్యుయేట్ మెడికల్ ఎడ్యుకేషన్ అండ్ రీసెర్చ్ (పాండిచ్చేరి)కి చెందిన వైద్యశాస్త్రజ్ఞులు ఇటీవల అభిప్రాయపడ్డారు. కుష్ఠువ్యాధి మైకోలెప్రీ బాసిలీ అనే క్రిముల కారణంగా వస్తుంది. ఆ క్రిములు ఏ విధంగా మరొకరి దేహంలో ప్రవేశించగలుగుతున్నాయి అన్న అంశం గురించి వైద్యశాస్త్రజ్ఞులు పరిశోధనలు చేస్తూ, దోమలు, నల్లులు మొదలైన వాటిపై కొన్ని ప్రయోగాలు చేశారు. ఈ ప్రయోగాలలో–కుష్ఠురోగుల రక్తాన్ని అవి తీసుకునేలా చేసి, ఆ తర్వాత వాటిని చంపి–పరిశోధన ప్రారంభించారు. ఈ పరిశోధన వల్ల అవి కుష్ఠురోగుల రక్తం నుంచి-ఆ క్రిములను మరొకరికి వ్యాపింప చేయడానికి చాలా అవకాశాలు ఉన్నట్లు రుజువైందట!

*

శస్త్రచికిత్స జరిగిన తర్వాత రోగులు తొందరగా కోలుకోవాలని ఆశిస్తూ కొందరు వారికి పుష్పగుచ్ఛాలు అందజేస్తుంటారు. వాటివల్ల కాని, రోగుల గదిలో వుండే పూలకుండీలవల్ల కానీ ఎలాంటి ప్రయోజనం వుండదని, పైగా ఆ పూల కారణంగా రోగులకు రకరకాల సూక్ష్మక్రిముల వల్ల హానికలిగే ప్రమాదం కూడా వుందని అమెరికాలోని మియామీ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌కు చెందిన వైద్య పరిశోధకులు వెల్లడిచేశారు. ఆస్పత్రి వాతావరణంలో వుండే సూక్ష్మక్రిములు విరివిగా వ్యాపించడానికి పూల మొక్కలు, పూలకుండీలు దోహదం చేస్తాయని, అందువల్ల అవి లేకుండా చూడడం చాలా మంచిదని వారు తెలియజేశారు.

*

చక్కెర ఎక్కువగా తీసుకుంటే, అది పరోక్షంగా మనకు ఎంతో హాని కలుగజేస్తుందనే విషయం–ఇటీవల 'సైన్సు టుడే' అన్న పత్రిక వెల్లడిచేసింది. నోటిలో వుండే సూక్ష్మక్రిములకు చక్కెర – ఆహారంగా ఉపయోగపడుతుందట. చక్కెర ఎక్కువగా వుండే ఆహారపదార్థాలంటే చాలామంది ఇష్టపడతారు. ఆ మోజుతో ఎక్కువ తీపిపదార్థాలు తినడం వల్ల గుండెజబ్బులు, రక్తపుపోటు, మధుమేహం, కీళ్ళనొప్పుల వ్యాధి మొదలైనవి రావడానికి అవకాశం వుంది. 'చక్కెర' అంటే వట్టి చక్కెర అనే మనం భావించనవసరం లేదు. ఆహారపదార్థాలు ఉత్పత్తి చేసే సంస్థలు-చక్కెర అనేమాట ఉపయోగించకుండా కొన్ని తీపి పదార్థాలకు — ఫ్రూక్టోస్, డెక్స్‌ట్రోస్, లాక్టోస్, మాల్టోస్ వంటి పేర్లను ఉపయోగించి విడుదల చేస్తుంటాయి. వాటిలో కూడా చక్కెరకు సంబంధించిన గుణాలన్నీ వుంటాయని ఆ పత్రిక వెల్లడిచేసింది!

## కొత్త వస్తువులు

ఆంధ్రప్రదేశ్ డైరీ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ వారు 'విజయ్ స్ప్రే' అన్న పేరుతో ఒక 'బేబీ ఫుడ్' తయారు చేశారు. ఈ విధంగా ఒక రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో తయారైన మొదటి 'బేబీ ఫుడ్' ఇదే కావడం ఒక విశేషం! మైసూరు సి. ఎఫ్. టి. ఆర్. ఐ. శాస్త్రజ్ఞుల పర్యవేక్షణలో తయారైన ఈ 'బేబీ ఫుడ్' బజార్లో లభ్యమయ్యే యితర 'బేబీ ఫుడ్స్' కన్న ముప్పై శాతం తక్కువ ఖరీదుగలదనీ ఎ. పి. డి. డి. సి వారు తెలియజేస్తున్నారు. విటమిన్లతోపాటు పిల్లల పెరుగుదలకు కావలసిన పోషకాహారాలు అన్నీ సమృద్ధిగా వున్న ఈ 'బేబీ ఫుడ్' - గోరు వెచ్చటి నీటిలో సులభంగా కరిగిపోవడమే కాక పసిపిల్లలు సులభంగా జీర్ణం చేసుకోగలరని కూడా వారు చెబుతున్నారు. ఇది 500 గ్రాములు, ఒక కిలో టిన్నులలో బజారులో లభ్యమవుతున్నది. 500 గ్రాముల టిన్ను వెల రూ 10-99 పైసలు (స్థానిక పన్నులు అదనం).




*

'పుట్టబోయేబిడ్డ స్థితిగతులు గర్భంలో ఏ విధంగా వుంటాయి?' అన్న విషయం తెలుసుకోవడం పట్ల చాలామందికి ఆసక్తి వుండవచ్చు. ఈ విశేషాన్ని ఆక్‌లాండ్ విశ్వవిద్యాలయం (న్యూజిలాండ్)కు చెందిన వైద్యశాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ విలియం లైలీ ఇటీవల తాము చేసిన ఒక ప్రసంగంలో తెలియజేశారు. గర్భంలో ఎదిగే శిశువుకు చాలామంది అనుకునేలా ఏదో చీకటిలో ఉన్నట్లు అనిపించదనీ, చేతులు, కాళ్ళు ఉపయోగించడం, నొప్పి తెలుసుకోవడం, త్రాగడం మొదలైనవన్నీ తెలుసుకుంటూనే పెరుగుతుందనీ ఆయన చెప్పారు. గర్భంలో పెరిగే శిశువుకు వెక్కిళ్ళు వస్తాయి. నిద్రపోవడం, మేలుకోవడం కూడా జరుగుతుంది. కొన్నిటిని ఇష్టపడడం, ఇష్టపడకపోవడం కూడా జరుగుతుందట. ఒకోసారి గర్భంలో వుండే స్థితి 'బోర్' కొట్టిన భావం కూడా వ్యక్తం చేస్తుందట!

*

మార్జువానా మత్తుపదార్థం ఆస్మారోగులకు కొంతవరకూ ఉపయోగపడుతుందన్న విశేషాన్ని గత సంచికలో చదివారు. ఇటీవల హార్వార్డ్ మెడికల్ స్కూల్‌లో జరిగిన మరి కొన్ని ప్రయోగాలవల్ల–మార్జువానా కారణంగా మగవారికి ఆడవారిలా వక్షోజాలు పెరిగే ప్రమాదం వుందని ఋజువైంది. "సాధారణంగా మార్జువానాను సిగరెట్లలో వేసి పొగ పీలుస్తారు. అలా చేయడం వల్ల హృదయ కండరాలు వ్యాకోచాన్ని పొందుతాయి. అలా పొగపీల్చే అలవాటు కొందరు ఆడవాళ్ళలో కూడా వుంది. అందువల్ల వారికి కూడా దీనివల్ల వక్షోజాలు విపరీతంగా పెరిగే అవకాశాలు ఉన్నాయి" అన్నారు ఆ పరిశోధనలను జరిపిన వైద్యశాస్త్రజ్ఞులు! □




## యుగయుగాల్లో భారతీయ మహిళ

**[రచన: జె. వరలక్ష్మి, పేజీలు: 650 వెల: రూ. 30 లు ప్రతులకు: ప్రియదర్శిని ప్రచురణలు, బి-271, ఐ. డి. పి. ఎల్ కాలనీ, హైద్రాబాదు-500037]**

"వేదకాలంలో కన్యను పరదా మాటున; అంతఃపురాలలో వుంచడం అనేది ఎరుగని మాట. కన్యకు పూర్తి స్వేచ్ఛ వున్నది. ఆనాడు యుక్త వయసు వచ్చిన ఆడపిల్లలు తమ వరుని తామే ఎన్నుకునే స్వాతంత్ర్యం కలిగి వుండేవారు. కావున బాల్య వివాహాలు ఆనాటికి లేవని మనం నిర్ధారణ చేసుకోవచ్చు."

ఆనాడు అంతటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అనుభవించిన స్త్రీలు నేడు విమెన్స్ లిబరేషన్ పేరిట జరుపబడుతున్న స్త్రీ స్వేచ్ఛకోసం పోరాడడం హాస్యాస్పదంగానే కనిపిస్తుంది.

అయితే వేదకాలం నాటి నుండి ప్రపంచమంతటా కూడా ప్రజల ఆచార వ్యవహారాలలో, జీవన విధానంలో, కుటుంబ వ్యవస్థలో ఎన్నో విధాలైన మార్పులు కలిగాయి. ఈ మార్పులలో చెప్పుకోతగ్గది – అంతవరకు స్త్రీకి గల హక్కులనూ, స్థానాన్ని కూడా పురుషుడు పై చేయి అయి పొందడం. 'తల్లి హక్కుపోయి కుటుంబంలో తండ్రి హక్కు ఏర్పడింది.'

ఆ విధంగా ఒకప్పుడు పురుషులతోపాటు సమానంగా భాసిల్లిన స్త్రీ, దరిమిలా వంటింటికి కట్టుబడి వుండవలసి వచ్చింది. అందుకే మన దేశంలో స్త్రీ మొదట పురుషునికి, ఆ తరువాత కుటుంబానికీ లొంగిపోవలసి వస్తోంది.

అయితే స్త్రీ పురుషుని కంటె మేధావంతురాలు, గుణగ్రహ పారీణురాలు కాబట్టి ఆమె తనకు తానుగానే పురుషుని కంటె తన అధిక్యత కనబరచకుండా అతన్ని తన సహచరునిగా స్వీకరిస్తోంది.

చరిత్ర కందని కాలం నుంచి – వేదకాలం, మధ్యయుగం, ఆధునిక కాలాల్లో ఆయా దేశాలలో, జాతులలో స్త్రీలకు సమాజంలో గల స్థానాన్ని శ్రీమతి జె. వరలక్ష్మి తమ గ్రంథంలో సమగ్రంగా సమీక్షించారు.

అంతేకాదు.

"భిల్లు స్త్రీలు, పెరుగుతో, మజ్జిగతో, తల రుద్దుకుంటారు. కాని నూనె రాచి దువ్వుకోరు. నీళ్ళతో తడి చేసి దువ్వుకుంటారు. జడలు వేసుకోవడం వారు ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్నారు".

'గ్రీకు వివాహం భారతదేశంలో మాదిరి శాశ్వతమైన పవిత్రబంధం కాదు. తాత్కాలికమైన ఒక ఒడంబడిక మాత్రమే!' 'మన దేశంలో ఆనాడు స్త్రీలు ఎంతటి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు అనుభవించారో అందుకు భిన్నంగా గ్రీకులు స్త్రీలను సమాజానికి దూరంగా వుంచేవారట.'

ఇటువంటి వింతైనవీ తెలుసుకోదగ్గవీ అయిన విషయాలు ఎన్నిటినో రచయిత్రి వివిధ దృక్కోణాలనుండి పరిశీలించి వ్రాసిన గ్రంథం ఇది.

అయితే ఈనాడు మన దేశంలో మధ్య తరగతి వనితల జీవితం–సంస్కృతి, సంప్రదాయాలనే కళ్ళాల చేత లాగబడుతోంది. ఈ కారణం వల్లనే ఆమెకు స్వేచ్ఛ లేకుండా పోయింది. పురుషుని అనుసరించి ఆమె ఆచార వ్యవహారాలు పాటిస్తూ సంతానం కనడం, కుటుంబ సభ్యులందరి గౌరవాదరాలకు పాత్రురాలుగా మసలుకోవడం చెయ్యాలి. ఇష్టం వున్నా లేకపోయినా ఆ ఆచార వ్యవహారాలు పాటించవలసినదే. మానసికంగా గానీ, శారీరకంగా కానీ ఆమెకు ఏమాత్రం స్వేచ్ఛలేదు.

మన దేశంలో వేద ధర్మాలని ప్రతిఘటిస్తూ అనేక కొత్త మతాలు–తలెత్తాయి. కాని పురుషుల ఆధిక్యత గల ఆనాటి సంఘంలో మన దేశంలో అవి అధిక ప్రజాదరణ పొందలేకపోయాయి. అందుకు ఉదాహరణలు: నామ మాత్రావశిష్టములైన జైన, బౌద్ధమతములే.

ఆ విధంగానే స్త్రీల విషయంలో కూడా అనేక సంస్కరణలు ప్రవేశపెట్టబడినాయి. కాని స్త్రీల జీవితం వేదకాలం నాటి వైభవానికి చేరుకున్నట్లు కనిపించదు. ప్రాచీన ఆచారాలను ధిక్కరించి కొత్తవి వచ్చినా అవి సంఘ జీవితం కుంటువడనంత వరకే మనగలుగుతున్నాయి. అందుకేనేమో–ఈ స్త్రీ స్వేచ్ఛా వుద్యమాలు.

అయితే గ్రంథం ముగింపులో శ్రీమతి జె. వరలక్ష్మిగారన్నట్లు – నేటి స్త్రీలు అన్నివిధాల పురుషులతో సమాన స్థాయిని చేరుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. అందుకు వారికి అన్ని విధాల సదుపాయాలూ లభిస్తున్నాయి. ఒక విధంగా యిది అభివృద్ధి సూచకంగా కన్పించినా–స్వేచ్ఛగా తిరిగే పురుషునికి—సంఘమూ, కుటుంబమూ యిస్తున్న గౌరవం, భద్రత – స్త్రీ విషయంలో కల్పిస్తుందా అనే సంశయం ఏర్పడక మానదు. ఏదిఏమైనా స్త్రీ పురుషునితో సమాన స్థాయిని చేరుకోవడంతో పాటు ఆమె తన సహజమైన విలువల్ని కాపాడుకోవడం అంతకన్న ముఖ్యమైన విషయం.

రచయిత్రి ఆరేళ్ళపాటు వివిధ ప్రాంతాలు పర్యటించి, వివిధ వ్యక్తులను కలుసుకుని, అనేక గ్రంథాలయాల నుండి విశేషమైన సమాచారాన్ని సేకరించి రచించిన గ్రంథం – 'యుగయుగాల్లో భారతీయ మహిళ.'

ఈ గ్రంథంలో పద్దెనిమిది అధ్యాయాలు వున్నాయి. వివిధ దేశాల వివాహ వ్యవస్థల నుండి, భారతీయ సంస్కృతిలోని పరిణామాలు స్త్రీల జీవితంలో సాంఘికంగానూ రాజకీయంగానూ కళలలోనూ ఏర్పడిన మార్పులు — విపులంగా తెలియజేశారు శ్రీమతి జె. వరలక్ష్మి.

బెజవాడ గోపాలరెడ్డిగారు తమ పీఠికలో రాసినట్లు ఈ గ్రంథం అనంతమైన బహుముఖ సమాచారంతో కూడిన గ్రంథం.- ఆయన చెప్పినట్లే ఈ గ్రంథం ఇతర భారతీయ భాషలన్నిటిలోకి తర్జుమా చేయతగినది; చేయవలసింది కూడా. □



### రచయిత్రి గురించి....

జన్మస్థానం: గుంటూరు జిల్లాలోని మాదల. విద్యాభ్యాసం: గుంటూరు ఎ. సి. కళాశాలలో. మద్రాసులా కాలేజీ ద్వారా న్యాయశాస్త్రంలో పట్టభద్రురాలయ్యారు. పాలిటిక్స్, పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్‌లో డిప్లొమా పొందారు. మహిళలు, న్యాయశాస్త్ర శాసనలు, సాహిత్య సమస్యలపై ఆంగ్ల, తెలుగు పత్రికలకు పలు వ్యాసాలు రచించారు. 'యుగ యుగాల్లో భారతీయ మహిళ', 'శిరీష కుసుమాలు', 'వివిధ దేశాల మహిళలు'-ఆమె వ్రాసిన పుస్తకాలు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ స్త్రీ, శిశు సంక్షేమశాఖలో అసిస్టెంట్ డైరెక్టర్‌గా పని చేస్తున్నారు.



# బామ్మగారి పేజీ

నాకో విషయం జ్ఞాపకం వచ్చిందర్రా–దసరా అనగానే!

నా చిన్నప్పుడు నేను ఒకరింటికి బొమ్మల కొలువుకి వెళ్ళాను. నాలాగే మరికొంత మంది పిల్లలూ వచ్చి కూచున్నారు. అందులో ఒక పిల్లని పాడమని తక్కిన వాళ్ళు బలవంతం చేస్తే, ఆ పిల్ల పాడింది. ఎలా పాడిందనుకున్నారు–తియ్యగా, హాయిగా పాడింది–నాకింకాజ్ఞాపకం! ఆ పిల్ల పాటని అంతా మెచ్చుకున్నారు–అయింది. ఇందులో మరి విశేషం ఏమిటీ అంటే – ఆ బొమ్మల కొలువు పెట్టిన వాళ్ళమ్మాయి ఆ పాట వినగానే, తనూ అలా పాడాలనీ, తనకీ సంగీతం నేర్పించమనీ పట్టు పట్టింది. పెద్దవాళ్ళు సంగీతం మేస్టర్ని పెట్టి క్షుణ్ణంగా సంగీతం నేర్పించారు! ఇది, నాకెందుకు గుర్తొచ్చిందంటే- దసరా రోజుల్లో పెట్టే బొమ్మల కొలువు వల్లగదా, ఆ పిల్లకీ పాట మీద ఉత్సాహం కలిగింది; ఆ ఉత్సాహం వల్లనే గదా, తానూ మంచి పాటకత్తె కాగలిగింది! ఇలాంటి ఉపకారాలు ఎన్నో జరుగుతాయనే నర్రా – మన పెద్దవాళ్ళు పండగలు, పబ్బాలూ ఏర్పాటుచేసి, పదిమందినీ పిలవమనడం!

పూర్వం ఎప్పుడో మన దేశాన్ని సందర్శించిన ఒక విదేశీయ రాయబారి – "భారత దేశంలోని ప్రతి అడుగు మేరా, ఏదో ఒక పురాణ గాథతో ముడి పెట్టుకుని వుంటుందనీ", "ప్రతి చిన్న స్థలాన్నీ పుణ్యక్షేత్రంగానే భావించి, గౌరవిస్తారనీ" – రాసుకున్నాడు. అలా – మన దేశానికి అంతటి విశిష్టతా, గౌరవం వున్నాయి. అలాగే, ఏదో ఒక శూన్య మాసం, ఏవో కొన్ని వర్జ్యపు గడియలూ తప్ప తక్కిన రోజులన్నీ మనకి పర్వదినాల్లాగే కనిపిస్తాయి. ఆ విధంగా మనం ఏదో ఒక దేవతను ఆరాధించడం వల్ల, ఏకాగ్రతనీ పూజలు చెయ్యడం వల్ల నియమ నిష్ఠల్నీ సాధించగలుగుతామని పెద్దల ఆశ.

శ్రావణ మాసం వస్తే నోములు, వ్రతాలూ, దానివల్ల పేరంటానికని వాళ్ళు రావడం, మనం వెళ్ళడం అంతా ఒకచోట కలుసుకోడం, అనేక విషయాలు మాట్లాడుకోడం, చర్చించుకోడం!

వినాయక చతుర్థి వస్తే 'నవరాత్రులు' అని తొమ్మిది రోజులు పూజలు చేస్తారు. అలాగే విజయదశమికి 'దసరా' పేరిట, తొమ్మిది రోజులు ఉత్సవాలూ అవీ చేస్తారు. నిజంగా ఈ దసరా రోజులు ఎంత బాగుంటాయని! చాలా మంది ఇళ్ళలో బొమ్మల కొలువులు పెడతారు గదా, అవి పెట్టడానికీ, పెట్టిన వాటిని వెళ్ళి వాటిని చూడ్డానికీ పిల్లలకి ఎంత సరదా! ఈ బొమ్మల కొలువు కూడా 'లోక కల్యాణానికే' అన్నారు పెద్దలు. 'బొమ్మల కొలువుకీ లోక కల్యాణానికీ సంబంధం ఏమిటి బామ్మగారూ' అని అడగాలని, అప్పుడే మీరు ఉరకలు వేసేస్తున్నారు-- చెబుతా వుండండి.

నవరాత్రుల్లో మనం శారదను సేవిస్తాం. దుర్గాదేవిని స్తోత్రిస్తాం. బొమ్మల కొలువులో పేర్చే బొమ్మలు–ఎవరో తమ తెలివితేటల్నీ, పనితనాన్నీ ఉపయోగించి, చేసినవేగదా! అదొక లలితకళ అన్నమాటే గదా. లలితకళలన్నింటికీ అధిదేవత శారదాదేవని మన విశ్వాసం గదా. అంటే, ఈ విధంగా అటూ ఆ శిల్పులూ, చిత్రకారులూ ఇటు పిల్లలూ శారదాదేవిని సేవిస్తున్నట్టే గదా. దాని వల్ల, బొమ్మలకు సంబంధించిన కళను ఎక్కువ చేసుకుంటున్నామా లేదా? ఆ బొమ్మల్ని చూసిన పిల్లలు తామూ అలా బొమ్మలు చెయ్యాలని ఉవ్విళ్ళూరతారా లేదా! దానివల్ల అందులో కొంత ఉత్సాహం; అదో పరిశ్రమా అవుతాయి; పది మందీ ఆ వృత్తిని చేబట్టి, పొట్టపోసుకుంటారు. ఇలా ఆలోచిస్తూపోతే ఇదంతా 'లోకకల్యాణం కోసమే' అనిపించడం లేదర్రా!

బొమ్మల కొలువు పేర్చడం ఒక కళ. అమర్చడం ఒక కళ. అందమైన రంగురంగుల బొమ్మల్ని పేర్చుకుంటూ, సర్దుకుంటూ ఉండడం, అదొక కళ కాదూ! అలాగే బొమ్మల్లో ఒకరు గాంధీగారి బొమ్మ, మరొకరు తాజ్‌మహల్ బొమ్మ పెట్టారనుకోండి. అవి చూసిన పిల్లలు 'అవేమిట'ని అడుగుతారు; వాటి గురించి తెలుసుకుంటారు. అలా వాళ్ళకి కొత్త విషయాలు తెలుస్తాయి. ఒక పిల్లని చూసి మరోపిల్ల తెలుసుకుంటుంది. ఒక అబ్బాయిని చూసి, మరో అబ్బాయి నేర్చుకుంటాడు. అందుకే ముందే చెప్పాను చూశారుగా – పాట నేర్చుకుంటానని పేచీ పెట్టిన అమ్మాయి గురించి. ఇలాంటి వాటి వల్ల, అలాంటి లాభాలు తప్పకుండా వుంటాయనే పెద్ద వాళ్ళ భావన, దీవన.

కాని—

రానురాను ఇలాంటి వాటిమీద శ్రద్ధలు తగ్గిపోతున్నాయర్రా. 'ఆఁ – ఏమిటి సింగినాదం బొమ్మల కొలువూ అదీనూ' అని కొందరు తోసిపారేస్తున్నారు. ఇవన్నీ మన సంప్రదాయాలు, కళలు. వాటిని మనం మరిచిపోతే ఎలాగర్రా.

దసరా రోజుల్లో పిల్లలందరూ రంగురంగుల బాణాలు పట్టుకుని, వాటిల్లో పువ్వులువేసి టపటపమని కొడుతూ, 'పిల్ల వాళ్ళకు చాలు పప్పు బెల్లాలు' అని పాడుతూ వుంటే, చూడ్డానికి అది ఎంత ముచ్చటగా వుండేది! ఈ వూరేగింపులూ అవీ ఈ మధ్య వరకూ వుండేవి. ఇప్పుడవి మరి, ఎక్కువగా కనిపించడం లేదు!

కొత్త గుడ్డలు వేసుకుని, దసరా బాణాలు పట్టుకుని, 'జయ విజయీభవ' అని పిల్లలంతా కలిసి వెళ్ళడం, మన ప్రాచీన సంప్రదాయం. అలాంటి ముచ్చట్లు, సంబరాలూ రాను రాను తగ్గిపోతున్నాయి. ఆధునిక సమాజంలో ఇవే ఇంకో రకంగా మారిపోతున్నాయి! వాటికీ వీటికీ ఎంత తేడా వుందని!

మన పెద్దలు, ప్రభుత్వం కూడా మన ప్రాచీన విధానాలని విడిచిపెట్టేయకూడదని చెబుతూనే వున్నారు. కొన్నింటిని అమలు చెయ్యడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. అలాగే, ఈ దసరా

పూరేగింపులు, ఆ పాటలూ క్రమేపీ తగ్గిపోకుండా చూడాలి.

మరి, ఇదివరకులా ఇప్పుడు అన్ని బొమ్మల కొలువులు కూడా వుండడం లేదు. ఇవి కూడా మరి కొన్నేళ్ళకి అలా అలా తగ్గిపోతాయేమో! ఒకపక్క నుంచి మనం ఆధునికులం అయిపోతున్నా, మరోపక్క నుంచి మన కళల్నీ, సంప్రదాయాల్నీ కూడా పాటిస్తూ వుండాలి. ఇవాళ కొత్త కొత్త నవలలూ, పత్రికలూ, పుస్తకాలూ వచ్చాయని, మన భారత భాగవతాది ప్రాచీన గ్రంథాల్ని పారేస్తామా! ఇప్పటి రచనలన్నింటికీ భిక్ష పెడుతున్నవి ఆనాటి గ్రంథాలే — వాటిని నిర్లక్ష్యం చేస్తామా? అలాగే ఇదీనూ. కాకపోతే, ఆ రోజులు చవక రోజులు గనక, పండగలూ అవీ బాగా చేసుకునేవాళ్ళం. ఇవాళ, అంత గొప్పగా చెయ్యలేం. ఏదో ఉన్నంతలో, కలిగినంతలో ప్రతిదీ చేసుకుంటున్నట్టే, తింటున్నట్టే, ఉంటున్నట్టే—వాటి గురించీ ఆలోచించాలి ఏమంటార్రా — నామీద కోప్పడతారా!

## ప్రశ్నలకు జవాబులు

**జి. వి. పద్మావతి, వెంకటగిరి**

**బామ్మగారూ! ఈ ప్రపంచం ఇంకా ఎంతకాలం ఇలా వుంటుంది? పుట్టి ఎన్నాళ్లయింది? ప్రళయం రావడం, ప్రపంచం పూర్తిగా నాశనం కావడం నిజమేనా?**

మన శాస్త్రాల్లో వున్న లెక్కల ప్రకారం ప్రపంచాన్ని సృష్టించిన బ్రహ్మదేవుడి వయసు, దేవమానం ప్రకారం — నూరేళ్లట. ఆ నూరేళ్ళ లెక్క ఏమిటో తెలుసా? — మనుష్యకాలం ప్రకారం కృతయుగం నుంచి కలియుగం వరకు వున్న కాలాన్ని 'మహాయుగం' అంటారు. మహాయుగానికి నలభై మూడు లక్షల ఇరవై వేల సంవత్సరాలని లెక్క. ఇలాంటి రెండు మహాయుగాలు కలిస్తే— బ్రహ్మకి ఒక రోజట! బ్రహ్మ ఒక రోజులో పద్నాలుగు మన్వంతరాలుంటాయన్నారు. ఆ మన్వంతరాల్లో స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష మన్వంతరాలు గడిచిపోయాయి. ఏడవది— వైవస్వత మన్వంతరం, ఇప్పుడు నడుస్తోంది. ఈ మన్వంతరంలో వున్న కలియుగం నడుస్తోంది. మరి, ఈ లెక్కలో చూసుకుంటే ప్రపంచం ఇంకా చాలాకాలం బతకాలి. ప్రళయం రావడం అదీ అంటారా — వస్తుందని పెద్దలు చెప్పినమాట. ఆ సమయానికి ఎవరైతే వుంటారో, వాళ్ళకే ఆ విషయం తెలుస్తుంది. అది నిజమైనా, వాళ్ళంతా బతికి వుండరు గనక, 'నేను ప్రళయం చూశాను' అని తర్వాత చెప్పడానికి ఎవరూ వుండరు! ఏమైనా, అంతా ఒక విశ్వాసం!



**ఇందుకూరి దుర్గావతి, దువ్వ**

**బయటికి వెళ్ళేటప్పుడు, మంచి శకునం చూసుకుని వెళ్ళమని పెద్దలు చెబుతారు. ఎందుచేత?**

అది మనసుకు ఒక తృప్తి కలిగిస్తుందని. చక్కగా అలంకరించుకుని అందంగా లక్షణంగా వున్న ఒక ఆవిడ ఎదురైందనుకోండి. మనసు ఆహ్లాదంగా, తృప్తిగా వుంటుంది. ఆ ఆహ్లాదంతో — వెళ్ళిన పనిని చక్కగా నిర్వహించుకు రాగలమని మన సత్త్వవేత్తలు అంటారు. పని మీద బయల్దేరుతున్నప్పుడు ఏదో చిరాకైన విషయం, అమంగళకరమైన విషయం తెలిపిందనుకోండి, మనసు అదోలా అవుతుంది గదా— దాంతో వెళ్ళిన పని సరిగా పూర్తి చేసుకోలేమని—తాత్పర్యం. అలా జరిగినట్టు తార్కాణాలుంటే, అవి కాకతాళీయమే గాని, అందులో అంతా నిజం లేదు.

**పుప్పాల రోజారమణి, దంగేరు**

**మా ఇంట్లో గద్ద ఆకారంలో వున్న ఒక సీసాను అందంగా వుందని వుంచాము. కాని, 'అది ఇంట్లో వుంచే కీడు కలుగుతుంది తీసేయండి' అని కొందరు అంటున్నారు. తీసేయమంటారా? తర్వాత-కాకులు అరిస్తే చుట్టాలొస్తారు అంటారు. చాలాసార్లు అది నిజం అయింది కూడా. కాకులకి, చుట్టాలొస్తారన్న విషయం ముందుగా ఎలా తెలుస్తుందంటారు?**

గద్ద ఆకారంలో వున్న సీసా ఇంట్లో వుండడం కీడూ కాదు, ఏమీ కాదు. నిక్షేపంగా వుంచుకోండి. 'కాకులు అరిస్తే చుట్టాలు వస్తారు' అన్నది చాలాకాలంగా వుంటున్న నమ్మకమే. పక్షులు, జంతువులూ ప్రకృతితో బాగా సంబంధం గల జీవులు. అంచేత వీటికి కొన్ని అసామాన్యమైన శక్తులుంటాయని చెబుతారు. సాధారణంగా, అతిథులు, విందు భోజనాలూ వున్న చోట కాకులు చేరుతాయి. ఎంచేతంటే ఆహారం అక్కడ ఎక్కువగా దొరుకుతుందని. ముందుగా ఒక కాకి చేరితే, అది కావు కావుమని అరిచి, తక్కిన కాకుల్ని పిలుస్తుంది. విందు వుంటుందన్న చోటును కాకులు ముందే పసిగడతాయి. ఇది, రాను రాను, కాలం మారుతూ రావడంతో కాకి అరవగానే 'చుట్టాలు రావడానికి సూచన' అని నిర్ధారింపబడింది. అయితే మనుషుల కంటె కూడా జంతువులకీ పక్షులకీ కొన్ని విషయాల్లో గట్టి శక్తులే వున్నాయి. గబ్బిలాలకి ఎంత చిన్న శబ్దం అయినా వినిపిస్తుంది. కుక్కలకి పసిగట్టే గుణం వుంది. పక్షులకి 'చూపు' బాగా ఆనుతుంది. ఉదాహరణకి చూడండి, రాబందులు, గద్దలూ ఆహారం కోసం ఎక్కడో పైన తిరుగుతూ వుంటాయి. కింద ఏదైనా జంతువు చచ్చిపోతే, అంత దూరంలో వున్న వాటి కంట బడుతుంది; రయ్యిమని కిందికి దిగుతాయి! అలా — మనుషులకంటే వాటికి గ్రహణశక్తులు ఎక్కువ. అయితే మరి, చుట్టాలొస్తారన్నది—కాకులు 'జోస్యం' చెప్పగలవా — అన్న విషయం వూహించడం మాత్రం కష్టమే. □



ఆ మధ్య విశాఖలో జరిగిన ఆంధ్ర విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవాలలో 'కళాప్రపూర్ణ' బిరుదు స్వీకరిస్తున్న ప్రముఖ రచయిత్రి–లత (తెన్నేటి హేమలత)



ఆంధ్ర విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవాలలో 'కళా ప్రపూర్ణ' బిరుదును ఆంధ్ర గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ ద్వారా స్వీకరిస్తున్న ప్రముఖ రచయిత్రి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ.

# వార్తా వనిత

విశాఖపట్నం సౌత్ లయన్స క్లబ్బు అధ్వర్యాన ఆగస్టు 6వ తేదీన అప్సరా హొటలులో జరిగిన లయన్ లేడీస్ సంయుక్త సమావేశంలో లయన్స డిస్ట్రిక్టు 324 - C ఎనిమిదవ రీజియన్‌లోని లయన్ లేడీస్ అక్సిలియరీ క్లబ్బుల కార్యకర్తలు, విజయ నగరం, అనకాపల్లి లయన్ లేడీస్ అక్సిలియరీల కార్యకర్తలు 1978-78 సంవత్సరంలోనే చేపట్టే కార్యక్రమాలు, ప్రణాళికలు నిర్ణయించే చర్చా వేదిక నిర్వహించారు.

ఈ సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న లయన్స మహిళల డిస్ట్రిక్టు ఛెయిర్మన్, డా॥ ఎ. ఆర్. సుబ్రమణ్యం లయన్స మహిళలు "దయ, కరుణ, చిత్త స్ఫూర్తి" అనే విషయాలు అలవరచుకోవాలని, డిస్ట్రిక్టు గవర్నరు డా॥ ఎల్. భాస్కరరెడ్డి ఆదేశానుసారం గ్రామాలను దత్తత చేసుకొని గ్రామ పునరుద్ధరణకు పాటుపడాలని హెచ్చరించారు. అంతే కాక, సభ్యురాంద్రందరూ అవసర సమయాలలో రక్తదానం చేయటానికి సిద్ధంగా వుండాలని విజ్ఞప్తి చేసారు.

1977-78 సం॥లో లయన్స జిల్లా స్థాయి ఉత్తమ లయన్ లేడీ అధ్యక్షురాలి బహుమతి నందుకున్న డా॥ హైమవతీదేవి ప్రసంగిస్తూ దారిద్ర్య దుఃఖ బాధితులకు చిత్తశుద్ధితో సేవ చేయాలని అన్నారు. సభకు లయన్ డి. సి-హెచ్. తిరుపతి రాజు అధ్యక్షత వహించగా లయన్ లేడీ డా॥ పద్మినీ చెంగల్‌రాయ్ సభాసదులకు స్వాగతం పలికారు. లయన్ లేడీ వసుంధరారెడ్డి వందన సమర్పణ చేసారు.

వికలాంగుల పునరావాస, సేవాకార్యక్రమాలలో విశిష్టంగా పాల్గొంటూన్న శ్రీమతి టి. సరస్వతీదేవి అదే విషయంలో ప్రత్యేక శిక్షణ పొందే నిమిత్తం పశ్చిమజర్మనీ ఆహ్వానం పై విదేశానికి త్వరలో ప్రయాణమవుతూన్న సందర్భంలో, ఆమెను విశాఖ నాటక కళా పరిషత్ తరపున శ్రీమతి కృష్ణవేణి అర్జునరావు సత్కరించారు. శ్రీమతి సరస్వతి తనకు జరిగిన యీ సన్మానానికి కృతజ్ఞతను తెలుపుతూ, నాటకరంగంలో కూడా తనకు గల అభిరుచిని, అనుభవాన్ని వ్యక్తం చేస్తూ, తను వృత్తి కళాకారిణి కాకపోయిననూ నాటక కళకోసం తన జీవితం అంకితం అయితే బాగుండునని అనుకుంటున్నానని, నాటకరంగం గురించి మన సాంఘిక దృక్పథం మారాలని, సాంసారిక స్త్రీలు





భారత మహిళా మండలి, విజయవాడ వారు ప్రసిద్ధ రచయిత్రులు 'లత', ఊటుకూరి లక్ష్మి కాంతమ్మగార్లను ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 'కళాప్రపూర్ణ' బిరుదు యిచ్చిన సందర్భంగా ఒక సన్మాన సభను ఏర్పాటు చేశారు. ఆనాటి సభకు

నిర్భయంగా రంగస్థలంపై నటించడానికి ముందుకు రావాలని అన్నారు.

సభానంతరం, ఔత్సాహిక నృత్య కళాకారిణి, శ్రీమతి పార్వతీ భాస్కరరావు తన కూచిపూడి నృత్య ప్రదర్శనతో ప్రేక్షకులను ముగ్ధులను చేశారు. కుమారి గాడిచర్ల లక్ష్మీకాంతం శివపార్వతుల నృత్యం కాక, ప్రత్యేకంగా మరో రెండు అంశాలను ప్రదర్శించారు. —విలేకరి.



విశాఖపట్నం వార్తు లయన్ లేడీస్ ఆక్సిలియరీ క్లబ్బు తరపున ఆగస్టు 20వ తేదీన జగదాంబా జంక్షన్ వద్ద తమ సాముదాయిక సేవా కార్యక్రమాలలోని భాగంగా ఒక ''బడ్డీ'' షాపుమ స్థానిక సెంట్రల్ జైలులోని ఒక ఖైదీ కుటుంబానికి లయన్స్ డిప్యూటీ డిస్ట్రిక్టు గవర్నరు శ్రీ ఆకెళ్ళ సూర్యనారాయణరావు బహూకరించారు. విలేకరి




గుంటకల్ లైవెస్ క్లబ్‌వారు తమ తృతీయ కార్యవర్గ ప్రమాణ స్వీకారోత్సవం యిటీవల జరుపుకున్నారు. నూత్న కార్యవర్గానికి అధ్యక్షురాలుగా వి. ఎల్. వసుమతి, కార్యదర్శిగా కె. గోవిందమ్మ, కోశాధికారిగా వి. ఆర్. సావిత్రమ్మ, ఇన్‌స్టలేషన్ ఆఫీసరుగా జి. ఎమ్. రేఖ, డైరక్టర్లుగా ఎస్. ప్రమీలాదేవి, కె. సుభద్రమ్మ, పి. రత్నమ్మ, పి. ప్రమీలమ్మ, పి. భాగ్యమ్మ ఎన్నికైనారు.



స్త్రీ, శిశు సంక్షేమశాఖ మంత్రి రోడామిస్త్రి ముఖ్య అతిధిగా విచ్చేశారు. పై చిత్రంలో మండలి అధ్యక్షురాలు సీతా కామరాజ్, శ్రీమతి రత్నమాల, శ్రీమతి లక్ష్మీకాంతమ్మ, శ్రీమతి రోడామిస్త్రి, 'లత' వున్నారు.



విశాఖపట్నం లయన్ లేడీస్ క్లబ్ ఇటీవల (ఆగస్టు 13 వ తేదీన) అప్సరా జంక్షన్ దగ్గరలో వున్న గూడెం ప్రజలకు ఉచితవైద్యం, పసిపిల్లలకు ట్రిపుల్ యాంటిజన్ ఇంజక్షన్లు, పోలియోడ్రాప్స యిప్పించుతూన్న దృశ్యం.

—విలేకరి.



రాజమండ్రి లయన్ లేడీస్‌క్లబ్ అధ్యక్షురాలిగా సర్వలక్ష్మి సూర్యనారాయణ, కార్యదర్శిగా సరస్వతీ కృష్ణ, కోశాధికారిగా సీతారత్నం అప్పలరాజు ఎన్నికయ్యారు. ఇటీవల వీరు నిర్వహించిన 'చేతి వనుల పోటీ'లో ఏభైమంది వనితలు పాల్గొన్నారు. లయన్ లేడీస్‌క్లబ్ కార్యవర్గ సభ్యులువారు తయారు చేసిన వస్తువులను తిలకిస్తునప్పటి దృశ్యం.

ఇటీవల శ్రీ కాళహస్తీ మహిళా విభాగ్ వారు నూతనముగా ఎన్నుకోబడిన శాసనమండలి సభ్యురాలు శ్రీమతి సి. హెచ్. సంతోషంను, సూవర్ బజార్ డైరక్టరు శ్రీమతి ఎ. లలితమ్మను సన్మానించారు.

అంతర్జాతీయ మహిళా సంవత్సరమైన 1975 లో విశాఖపట్నం కలెక్టరేటు వద్ద స్థాపించబడిన "మహిళా మినీ సూపర్ బజార్" మొదటి మూడు సంవత్సరాలు గడచిన అనంతరం, యిటీవల రెండవసారిగా రానున్న మూడు సంవత్సరాలకు మేనేజింగు కమిటీ కార్య నిర్వాహక సభ్యురాండ్రను ఎన్నుకొంది. శ్రీమతి ఇంద్రాణి జగ్గారావు ప్రెసిడెంటుగాను, శ్రీమతి డి. లలిత వైస్-ప్రెసిడెంటుగాను, కుమారి పాలెపు జగన్మోహిని మేనేజింగు డైరెక్టరుగాను, శ్రీమతులు కె. రాజ్యలక్ష్మి, సిహెచ్. కమల, ఎ. మంగళగౌరి, బి. వి. సూర్య కాంతం డైరెక్టర్లుగాను ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. అందరూ మహిళల చేతనే (ఒక్క బిజినెస్ మేనేజరు తప్ప) నడపబడుతున్న యీ మహిళా సూపర్ బజార్ ప్రప్రథమంగా మాజీ ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుచే ప్రారంభోత్సవం చేయబడింది. —విలేకరి



విశాఖపట్నం నార్తు లయన్ లేడీస్ ఆక్సిలియరీ నార్తు లయన్సు క్లబ్బు సభ్యులతో కలిసి స్థానిక మెసానిక్ లాడ్జిలో ఇటీవల నిర్వహించిన సంయుక్త సమావేశంలో-గత సంవత్సరపు లయన్ లేడీస్ నార్తు కార్యదర్శి అయిన శ్రీమతి టి. సరస్వతీదేవి వికలాంగుల పునరావాస, పునరుద్ధరణ కార్యక్రమాలలో ప్రత్యేక శిక్షణ పొందే నిమిత్తం పశ్చిమజర్మనీకి బయలుదేరుతున్న సందర్భంగా ఆమెకు ఘనంగా వీడ్కోలు యిచ్చారు. లయన్ లేడీస్ ప్రెసిడెంటు శ్రీమతి అస్మామెహదీ శ్రీమతి సరస్వతికి "బాన్ వాయేజ్" పలికి, మెమొంటోను అందజేసారు.

సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీమతి పార్వతీ భాస్కరరావు నాట్య కళను గురించి మాట్లాడుతూ, నాట్యం శరీరానికి వ్యాయామాన్ని సమకూర్చడమే గాక మానసిక కాంతిని, మానసికోల్లాసాన్ని కలుగజేస్తుందని, అన్నారు.

శ్రీమతి సరస్వతి తనకు యిచ్చిన వీడ్కోలు గురించి ప్రసంగిస్తూ, తాను పశ్చిమజర్మనీలోని లేడీస్ క్లబ్బులను గురించి, వాటి నిర్వహణా విశేషాలను గురించి కూడా తెలిసికొనివస్తానని, మన దేశంలో స్త్రీల మహిళా మండలుల అభివృద్ధికి తన శాయశక్తులా కృషి చేస్తానని అన్నారు. —విలేకరి



"రోజులు మారినా, కాలం మారినా సమాజంలో స్త్రీల పరిస్థితిలో చెప్పుకోతగ్గ మార్పు రాకపోవడానికి కారణాలు ఏమి? ఇంకా ఎలాంటి మార్పులు రావాలని మీరు కోరుకుంటున్నారు?" - ఈ అంశంపై ఇటీవల మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' నగరంలోని స్త్రీ కళాశాల విద్యార్థినులకు ఒక వక్తృత్వపు పోటీ నిర్వహించింది. ఆ పోటీలో క్వీన్ మేరీస్ కళాశాలకు చెందిన జె. వెంకట సత్యవాణి, వి. శారద, ప్రభుత్వ స్త్రీల కళాశాలకు చెందిన వై. వాణి, చెల్లమ్మాళ్ కళాశాల విద్యార్థిని కె. ఉష గెలుపొందారు. ఈ నలుగురూ వినాయక చవితినాడు కళాసాగర్ నిర్వహించిన 'నవ్వుల రాత్రి' కార్యక్రమంలో ఒక హాస్య ప్రధానమైన అంశం గురించి మాట్లాడారు. అందులో గెలుపొందిన విద్యార్థినికి అక్టోబరు 8న జరిగే కళాసాగర్ వార్షికోత్సవాలలో అయిదు వందల రూపాయలు విలువ చేసే 'కళాసాగర్ లిటరరీ అవార్డు' బహూకరింపబడుతుంది. ఆ అవార్డు గ్రహీత - చెల్లమ్మాళ్ కళాశాల విద్యార్థిని కుమారి కె. ఉష.

# దుర్గా పూజ



మంచీ చెడుల మధ్య ప్రతిక్షణం సంఘర్షణ చెలరేగే సంగ్రామ రంగం మానవ జీవితం!

పరస్పర విరుద్ధాలైన నిప్పు-నీరు, రాత్రి-పగలు మొదలైన వాటి లాగానే ప్రపంచంలో మంచీ చెడూ, సుఖమూ-దుఃఖమూ పోరాడుతూ వుంటాయి. ఈ పోరాటంలో చెడు మీద మంచి సాధించే విజయమే-మనిషి మనుగడకు, ప్రజా ప్రగతికి, జాతి అభ్యుదయానికి పునాదులు వేస్తాయి!

మనం ఏదైనా ఒక మంచిపనిని సక్రమంగా నెరవేర్చాలంటే అది విజయం కాగలదన్న నమ్మకం మనలో వుండాలి. సర్వశక్తి సమన్విత

మైన దివ్యశక్తే మంచి పనులకు అండగా నిలబడి తోడుగా వుంటుందని గ్రహిస్తే మనలో ఆత్మ విశ్వాసం పెంపొంది నూతనోత్తేజం వేయిరేకులతో వెల్లివిరుస్తుంది—అని పెద్దలు విశ్వసించారు.

ఈ విశ్వాసాన్ని సామాన్య జనానీకానికి, భావి తరాల వారికి కల్గించడానికి—చీకటి మీద వెలుగు, చెడు మీద మంచి, అసత్యం మీద సత్యం సాధించే ఘన విజయాలకు సంకేతంగా జరుపబడేవి దసరా ఉత్సవాలు. ఈ విరుద్ధ శక్తుల పోరాటంలో మనిషికి, మంచికీ తోడుగా రావాలని దివ్యశక్తిని వేడుకోడానికి నిర్దేశింపబడినవే—దుర్గా పూజలు!

దుర్మార్గాన్ని, దుష్ట శక్తుల్ని సర్వనాశనం చేసే శక్తి స్వరూపిణిగా హైందవులు అనాదిగా ఆరాధించే దేవత—దుర్గ!

సర్వ శత్రు సంహారిణిగా, దురితాపహారిణిగా సంసార బంధాలను భేదించే దయాసింధువుగా దుర్గను వేదాలు ఉద్ఘోషిస్తాయి.

మహిషాసురుడనే రాక్షసుడు మంచివాళ్ళనంతా మహా ఘోరంగా హింసించాడట. దేవతలను, మానవులను సర్వలోకాలను వాని బారినుంచి కాపాడడానికి సర్వశక్తి సమన్వితురాలైన దుర్గ అవతరించిందట! మహిషాసుర మర్థిని మహిమలను మన పురాణాలు రకరకాలుగా అభివర్ణిస్తాయి.

హిమగిరి శిఖరాగ్రంలో సింహవాహనం మీద దివ్య తేజో విలాసంతో విరాజిల్లే జగన్మాత మూడో కంటి నుంచి ఓ దివ్య తేజస్సు వెలువడి జగన్మోహిని రూపం దాల్చిందట. ఆ స్త్రీ రూపాన్ని చూసి మతిపోగొట్టుకొని కామించడానికి ప్రయత్నించారట—చండ—ముండ రాక్షసులు. లోక కంటకులైన వారిని చీల్చి చెండాడడం వల్ల—చాముండేశ్వరి అనే సార్థక నామధేయం ఏర్పడిందట—ఇది మార్కండేయ పురాణ కథనం!

మధుకైటభులనే దైత్యులను సంహరించడంలో యోగనిద్రా స్వరూపంలో మహావిష్ణువుకు సహకరించడం వల్ల ఈమెను 'మహామాయ' అని పురాణాలు స్తుతిస్తాయి.

శ్రీరాముడు రావణునితో యుద్ధం ప్రారంభించడానికి ముందు దుర్గాపూజ చేసి విజయరూపిణియైన జగన్మాత దర్శనం పొందాడని ఆదికావ్యం వివరిస్తుంది.

## మీ భాషాభివృద్ధికి:

ఇక్కడ పది మాటలు, వాటికి ఎదురుగా అర్థాలూ వున్నాయి. అయితే ఆ అర్థాలు తారుమారుగా వున్నాయి. మీరు వున్న అర్థాల్లో ఏ మాటకు ఏ అర్థం సరిపోతుందో పేర్చాలి. అలా పేర్చుకుని, సమాధానంతో సరి చూసుకోండి. అన్నీ రైటే అయితే, మీకు భాషలో మంచి ప్రవేశం వున్నట్టే. రైట్లకంటే తప్పులే ఎక్కువ వస్తే మాత్రం మీరు మీ మాతృభాషలో బాగా కృషి చెయ్యాలన్నమాట!

| | |
|---|---|
| 1. కౌముదము | హార మధ్య రత్నము |
| 2. తరళము | సన్నము |
| 3. దడిమము | ఊరపిచ్చుక |
| 4. ఉల్లలము | ఉప్పు |
| 5. కాలకంఠము | అధికము |
| 6. క్షారము | చలనము |
| 7. నయగారము | మృదుత్వము |
| 8. ప్రతిజ్ఞానము | శుభము |
| 9. భావుకము | అంగీకారము |
| 10. భూయిష్ఠము | కార్తికమాసము |

[సమాధానము: 1. కార్తికమాసము 2. హార మధ్య రత్నము 3. సన్నము 4. చలనము 5. ఊరపిచ్చుక 6. ఉప్పు 7. మృదుత్వము 8. అంగీకారము 9. శుభము 10. అధికము.]

అజ్ఞాతవాసం ఆటంకం లేకుండా సాగాలనీ యుద్ధంలో విజయలక్ష్మిని చేపట్టాలనీ పాండవులు కూడా పరాశక్తిని పూజించినట్టు పంచమ వేదమైన మహాభారతం చెబుతుంది.

నిర్జీవమైన జాతిని జాగృతం చేసి హైందవ సామ్రాజ్యం స్థాపించిన ఛత్రపతి శివాజీ ఆరాధ్య దేవత దుర్గ—ఇది చరిత్ర పలికే సాక్ష్యం!

భారతీయుల హృదయాకాశాలలో అలముకున్న నిరాశా నిస్పృహ మేఘాలను పారద్రోలి చైతన్య కాంతి కిరణాలతో నింపిన స్వామి వివేకానంద; ఆయన్ను అంతటి మహానుభావునిగా తీర్చిదిద్దిన గురుదేవులు శ్రీ రామకృష్ణ పరమహంస ఉపాసించిన దేవత—పరాశక్తి! ఇది నిన్నటి మేలుకొలుపు!

వారణాసిలోని విశాలాక్షి ఆలయం నుంచి దక్షిణాగ్రంలోని మూడుసంద్రాల కూడలి వద్ద కొలువుండే కన్యాకుమారి వరకు—భారతావనిలో ''ముగురమ్మల మూలపుటమ్మ''కు అడుగు అడుగునా గుడి వుంది.

గ్రామ గ్రామానికి గ్రామదేవత ఆలయాలు; యేటేటా జాతరలు, తిరనాళ్ళు దక్షిణ భారత దేశంలో కోకొల్లలు.

అస్సాం, బీహారు, బెంగాల్ ప్రాంతాలలో బంకమన్నుతో దేవీ విగ్రహాలు చేసి—పురాణాలలో వివరించిన ప్రకారం పూజలు, ఉత్సవాలు జరపడం ఆనవాయితీ. బెంగాల్‌లో జమీందారులు—కొన్ని దశాబ్దాల క్రితం కూడా—దుర్గా మంటపాలు నెలకొల్పి దసరా సందర్భంలో పేద సాదలతో కలిసి దుర్గాపూజలు చేసేవారట!

ఇవాళ కూడా ఢిల్లీరామ్‌లీలా మైదానంలో యేటా జరిగే ఉత్సవాలు యావద్భారత ప్రసిద్ధి గాంచినవి. రావణ కుంభకర్ణాదుల బొమ్మలను తగులబెట్టి—దుష్టశక్తుల మీద మంచి సాధించిన ఘన విజయాలకు సంకేతంగా ఈ విజయోత్సవాలు జరుపబడుతున్నాయి.

దక్షిణాదిలో దసరా అనగానే మన స్మృతి పథంలో కదిలేది మైసూరు మహా నగరంలో జరిగే నవరాత్రి ఉత్సవాలు. విజయదశమి సందర్భంగా నయనానందకరంగా జరిగే ఈ వేడుకలను చూడడానికి దేశం నలుమూలల నుంచి ప్రజలు తండోపతండాలుగా వస్తూవుంటారు.

ఇకపోతే శక్తిపూజ పేరిట పల్లెపట్టులలో జరిగే జాతరలు, తిరనాళ్లు—వాడిపోతున్న వర్ణవ్యవస్థకు ప్రాణం పోసే వాన జల్లులుగా వుంటున్నాయి. అక్కడి ప్రజల భక్తి ప్రపత్తులను శంకించలేము. కాని భక్తికి మించిన జాత్యహంకారం తలవిరబోసుకుని విలయ నర్తనం చేయడం శోచనీయం. అక్కడక్కడ జంతుబలులు కూడా ఇంకా కొనసాగుతూనే వున్నాయి.

బలి ఇవ్వవలసింది నోరూ వాయీ లేని జంతువులను కాదు—వాటికన్నా హీనమైన మన నైచ్య బుద్ధుల్ని. అంతరానితనం, మోసం, వంచన లాంటి సామాజిక దురన్యాయాలను రూపుమాపే మహాయజ్ఞానికి ప్రతివారూ చేతనైన సమిధను ఆహుతివ్వాలి. అప్పుడే ప్రగతి సుసాధ్యమవుతుంది. దీనిని సూచించడమే దయా రౌద్రమూర్తియైన దుర్గను పూజించడంలోని పరమార్థం! □

# చిత్రకళల్లో వనితలు

గత కొన్ని దశాబ్దాలుగా స్త్రీలు అనేక రంగాలలో పురోగతిని సాధిస్తున్నారు. ఇటీవల, వెల్లటూరులో జరిగిన అఖిల భారత చిత్రకళా ప్రదర్శనలో విశేషంగా చిత్రకారిణిలు పాల్గొనటం, పెక్కు



బహుమతులను పొందటం ముదావహం.

నవరంగ్ చిత్రకళా నికేతన్ వారు ఏటేటా ఏర్పాటు గావించే చిత్రకళా ప్రదర్శనల పరంపరలో ఈ అఖిల భారత చిత్రకళా ప్రదర్శన అయిదవది. ఈ ప్రదర్శనలో దేశంలోని వివిధ రాష్ట్రాలకు చెందిన చిత్రకారిణులు పాల్గొన్నారు. ఈ ప్రదర్శన వల్ల యోగ్యతగల చిత్రకారిణులకు తమ కళా నైపుణ్యాన్ని చాటుకునే అవకాశం లభించటమే కాకుండా, వారి ప్రతిభకు సముచిత సత్కారాలు కూడా లభించాయి. ఈ ప్రదర్శనలో ముప్పయి అయిదు మంది వనితలు పాల్గొన్నారు. రేఖా విన్యాసంలోనూ, రంగుల మేళవింపులోనూ వీరి చిత్రాలు ప్రశంసనీయంగా వున్నాయి. వస్తు వైవిధ్యం గల ప్రదర్శన యిది.

ప్రకృతిలోని సౌందర్యానికి, భావుకతకు చిత్రకారులు స్పందించటం సర్వసాధారణమైన విషయం. అయితే, సామాజిక స్పృహతో చిత్రరచన గావించటం ఈ ప్రదర్శనలో ఒక విశేషం. శ్రీమతి కరుణ సుందరి (న్యూఢిల్లీ) కుమారి విమ్మి (హైదరాబాద్) ఉమారాణి దేశాయ్ (కర్నూలు) మొదలైన వారి చిత్రాలు యిందుకు వుదాహరణలుగా పేర్కొన వచ్చును.

ఈ చిత్రకళా ప్రదర్శనలో పాల్గొన్న శ్రీమతి కరుణా సుందరి గారి 'విలేజ్ వాటర్‌పాయింట్' చిత్రానికి; కుమారి రాధారాణిగారి 'గార్డెన్ పార్టీ' చిత్రానికి; కాంతి శ్రీదేవిగారి 'డోల ఖేల' చిత్రానికి, విమ్మిగారి 'ఫర్ షెలర్' చిత్రానికి ప్రథమ శ్రేణి బహుమతులు లభించాయి.

శ్రీమతి వి. నిర్మల, శ్రీమతి లక్ష్మీప్రభాకర్, శ్రీమతి సాయికుమారి గార్ల చిత్రాలకు ద్వితీయ శ్రేణి బహుమతులు లభించాయి. శ్రీమతి సుగుణ గారి చిత్రానికి తృతీయశ్రేణి బహుమతి లభించింది.

వనితల చిత్రకళాభిరుచికి యితోధిక ప్రోత్సాహన్ని అందిస్తూ, యేటేటా అఖిల భారత స్థాయిలో నవరంగ్ చిత్రకళా నికేతన్ వారు చిత్రకళా ప్రదర్శనలు యేర్పాటు గావించటం అభినందనీయం.

—కశింకోట సీతాదేవి



## పీటల మీద విప్లవం

'తల్లితండ్రులు చేసిన పెళ్ళి ఏర్పాట్లు ఎలాంటివైనా వాటిని తలదాల్చడమే కూతురి బాధ్యత! భర్త ఎలాంటి వాడైనా తాళి కట్టడానికి మెడ వంచడం లోనే వుంది స్త్రీ జన్మకు సార్థక్యం, సాఫల్యం!' అన్న భావాలను తల క్రిందులు చేసింది కాంచీపురంలో ఇటీవల జరిగిన ఓ సంఘటన!

స్త్రీ జాతిలో చైతన్యం; వనితల ఆలోచనా సరళిలో విప్లవాత్మకమైన అభ్యుదయం - కేవలం కాగితాల మీద కనబడే మాటల తోరణాలు మాత్రమే కావు. ఇవాళ నిజ జీవితంలో సైతం తరచు తారస పడతాయి - అనడానికి మంచి ఉదాహరణగా నిలిచింది ఒక పెళ్ళికూతురు!

ఆ అమ్మాయి పేరు మంజుల. అవాళ ఆమె పెళ్ళి రోజు. వివాహ జీవితంపై కమ్మని కలలు కంటూ పెళ్ళి పీటలమీదికి చేరింది. కాని పెళ్ళి కొడుకు తప్పతాగి, తూలుతూ నోటికొచ్చినట్టు వాగుతూ రావడంతో ''ఇలాంటి త్రాగుబోతు భర్త నాకొద్దు'' అంటూ పీటల మీద నుంచి లేచింది!

పెళ్లికొడుకు తాలూకు వాళ్లు, ఆమె తల్లితండ్రులూ ఎంతో బ్రతిమాలారు. కాని ససేమిరా కాదంది మంజుల. పెళ్ళికి వచ్చిన వారందరూ ముక్కుపై వేలేసుకున్నారు.

ఈ తతంగాన్నంతా గమనిస్తూన్న శేఖర్ అనే యువకుడు అదే ముహూర్తంలో ఆమెను పెళ్ళాడ డానికి తన సమ్మతిని తెలియజేశాడు. అంతే! మంజుల-శేఖర్‌లకు పెళ్ళి జరిగిపోయింది!

ఇదే సమయానికి కాంచీపురం వచ్చిన తమిళ నాడు గవర్నరు ఈ ఉదంతం విన్నారు. ఆయన ఆ నూతన దంపతులకు తన హార్దిక అభినందనలు తెలియజేస్తూ 1001 రూపాయలు కానుకగా అందించారు. చదువుకోకపోయినా, ఎంతో మనోధైర్యం, తెగువ చూపిన మంజులను ప్రశంసించారు.

పెళ్ళికొడుకు శేఖర్ చదువుకున్నవాడే. కాని నిరుద్యోగి. అందువల్ల ఏదైనా ఒక ఉద్యోగం యిప్పించమని గవర్నరుకు విన్నవించుకున్నాడు. బ్యాంక్ ఆఫ్ బరోడాలో ఒక చిన్న ఉద్యోగం యేర్పాటు చేయబడింది శేఖర్‌కు.

చదవడానికి ఏదో సినిమా కథలా వున్న ఈ సంఘటనకు కారణమైన మంజుల తెలుగు అమ్మాయే!



# పీకాక్ ఫ్రేమ్

ఇళ్ళల్లో అలంకారంగా గోడలకి తగిలించుకునేందుకు, ఫోటో స్టాండుల లాగా టేబుల్ మీద పెట్టుకునేందుకు కొన్ని వస్తువులు ఎంతో బాగుంటాయి. ఇవి బజారులో కొనుక్కోవాలంటే చాలా ఖరీదుగా వుంటాయి. అలా కాక వాటిని మనమే తయారు చేసుకుంటే ఖర్చు తక్కువ అవుతుంది. సంతృప్తి కలుగుతుంది. అంతేకాక మిత్రులకి, సన్నిహితులకి మనం స్వయంగా చేసిన వస్తువులను చూపించడంలో ఎంతో ఆనందముంటుంది. అటువంటి కోవకు చెందినదే అయిన 'పీకాక్ ఫ్రేమ్' గురించి ఈసారి తెలుసుకుందాం.

ఈ పీకాక్ ఫ్రేమ్ తయారు చేసుకోవడానికి కావలసిన వస్తువులు: అర మీటరు పసుపు రంగు పట్టుగుడ్డ (ఇది ఖరీదయిన పట్టుగుడ్డ కానవసరం లేదు. బజారులో చవకగా లభించే చిన్నాళపట్టి వంటివి కూడా తీసుకోవచ్చును; లేదా శాటిన్ గుడ్డతో చేసుకోవచ్చు). బంగారు వన్నెదారం. 15″ నిడివిగల ఊదారంగు, నలుపు

రంగు వంకీలు తిరిగిన రిక్‌రాక్ లేసు గానీ సాదా లేసు గానీ, అడ్‌హెసివ్ ట్యూబ్ ఒకటి. (ఫెవికాల్, అరల్‌డైట్, క్విక్‌ఫిక్స్ వంటివి ఉపయోగించాలి. మామూలు జిగురు లాభంలేదు).

ఇవికాక వెల్వెట్ లాగా వుండే ఫెల్ట్ గుడ్డలు ఈ క్రింద యివ్వబడిన కొలతలలో ఆయా రంగులలో తీసుకోవాలి. (ఫెల్ట్ గుడ్డ ఎంబ్రాయిడరీ వస్తువులు అమ్మే అన్ని దుకాణాలలో లభిస్తుంది.)

జేగురురంగు, ఎరుపురంగు, ఊదారంగు ఒక్కొక్కటి 8"×8" గులాబిరంగు 6"×6", పచ్చరంగు 12"×12".

ఇక కావలసినవి వివిధ రంగుల దారాలు. సాధారణంగా ఏంకర్ వారి దారాలు అయితే ఎంబ్రాయిడరీకి బాగా పనికివస్తాయి. ఉపయోగించవలసిన ఏంకర్ దారాలు, వాటి నెంబర్లు ఈ క్రింది పొందుపరుస్తున్నాము. ఒకవేళ అవి లభించక పోతే మరో రకందారం ఏదయినా ఉపయోగించవచ్చును.

ఎరుపురంగు (047), లేతపసుపు (0289), ముదురుపసుపు (0291), లేత ఆకుపచ్చరంగు (0225), నారింజ లేక ఆరంజిరంగు (0332), ఊదారంగు (0107) గోధుమవర్ణము లేక బ్రౌన్ రంగు దారం (0360).

మనకి కావలసిన వస్తువులన్నీ తీసుకున్నాం కదా. ఇక పీకాక్ ఫ్రేమ్ తయారు చేసుకునే విధానం గురించి తెలుసుకుందాం.

మొదట వర్ణచిత్రంలో చూపిన విధంగా మనం తీసుకున్న పట్టు గుడ్డ మీద గానీ శాటిన్ గుడ్డ మీద గానీ నెమలి ఆకారాన్ని ట్రేస్ తీసుకోవాలి. ఆ విధంగా ట్రేస్ తీసుకున్న నెమలి ఆకారాన్ని ఎంబ్రాయిడరీ చేసుకోవాలి.

నెమలి మెడ అవుట్‌లైన్‌ని ఎరుపురంగు దారంతో బ్యాక్‌స్టిచ్ పద్ధతిలో ఎంబ్రాయిడరీ చెయ్యాలి. నెమలి ముఖాన్ని గొలుసు కుట్టు పద్ధతిలో లేత పసుపురంగు, ముదురు పసుపు రంగు దారాలతో కుట్టాలి. ఇక ముక్కుని గోధుమవర్ణం దారంతో ముద్ద కుట్టు పద్ధతిలో కుట్టుకోవాలి. మధ్యలో కాడకుట్టు పద్ధతిలో ఎరుపు రంగు దారంతో ఒక గీతలా కుట్టాలి.

ఇక మిగిలిందల్లా నెమలి పింఛాలు. వీటిని వివిధ వర్ణాలలో రూపొందించుకుంటే అందంగా వుంటాయి. ముదురు పచ్చ, లేత ఆకు పచ్చ, ముదురు పసుపు, లేత పసుపు, ఆరంజి రంగు దారాలు – ఈ పింఛాలు కుట్టుకునేందుకు తీసుకోవాలి. కాడకుట్టు పద్ధతిలో ఈ దారాలతో నెమలి పింఛాలను చిత్రంలో చూపినట్లుగా కుట్టుకోవాలి. నెమలి ఆకారానికి ఇరువైపులా బయటకు వచ్చే పింఛాలను హెర్రింగ్‌బోన్ కుట్టు పద్ధతిలో కుట్టాలి. (పేరు గంభీరంగా వుందేకానీ అదేమీ బ్రహ్మ విద్య కాదు. వర్ణచిత్రంలో చూపబడినట్లు కుట్టుకుంటే ఈ హెర్రింగ్‌బోన్ స్టిచ్ సులభంగా వస్తుంది.) మధ్య మధ్య కొన్ని పింఛాలను కూడా ఈ పద్ధతిలోనే కుట్టుకోవాలి. అలా కుట్టుకుంటే నెమలి మరింత అందంగా కనిపిస్తుంది.

చిత్రంలో నెమలి శిరస్సు మీద ఎనిమిది గీతలు వున్నాయి చూశారా. వాటిని ఒకటి విడిచి మరొకటి వివిధ రంగు దారాలను ఉపయోగిస్తూ కుట్టుకోవాలి. మొదట బ్యాక్ స్టిచ్ పద్ధతిలో ఎరుపు రంగు దారంతోనూ, తరువాత పసుపు రంగు దారంతో డబల్‌నాట్ పద్ధతిలోనూ, ఆ తరువాత గోధుమవర్ణం కానీ బ్రౌన్ దారంతో గానీ గొలుసు కుట్టు విధానంలోనూ–యిలా ఒకదాని తరువాత ఒకటిగా కుట్టుకోవాలి. వీటిపైన వున్న వంకర తిరిగిన గీతలను డబల్–నాట్ పద్ధతిలో ఎరుపు రంగు దారంతో కుట్టాలి.

చిత్రంలో చూపబడిన యితర గీతలన్నీ కూడా కాడకుట్టుతో గానీ, గొలుసుకుట్టుతో గానీ కుట్టుకోవచ్చును. వాటికి ఏఏ రంగులు ఉపయోగించాలో వర్ణచిత్రంలో చూస్తే మీకు యిట్టే బోధపడుతుంది.

నెమలి శిరస్సు మీద గజిబిజి గీతలు కనిపిస్తున్నాయి కదూ....వాటి మీద ఊదారంగు, నలుపు రంగు వంకీలు తిరిగిన రిక్–రాక్ లేసుగానీ సాదానూలు లేసుగానీ కుట్టుకోవాలి.

హమ్మయ్య దాదాపు నెమలి తయారు చేసుకోవడం పూర్తయినట్లే. ఇక మిగిలిందల్లా మనం చేసుకున్న నెమలి అందం యినుమడించడం కోసం ఫెల్టుగుడ్డలను అతికించడం. ముందుగా తీసి వుంచుకున్న వివిధ వర్ణాల ఫెల్టు గుడ్డలను చిత్రంలో చూపిన ఆకారంలో ట్రేస్ తీసుకుని కత్తిరించుకోవాలి. వాటిని అడ్‌హెసివ్‌తో వర్ణచిత్రంలో చూపినట్లుగా ఆయా ప్రదేశాలలో మనం చేసుకున్న నెమలి ఆకారం మీద అతికించాలి. ఇలా అతికించుకున్న ముక్కలను బంగారు వన్నె దారంతో ఎంబ్రాయిడరీ చెయ్యాలి. దీనికి సాదా కుట్టు పద్ధతిని ఉపయోగిస్తేచాలు.

ఈ విధంగా మనం తయారు చేసుకున్న నెమలిని 21"×16" అంగుళాల సైజులో ఫ్రేమ్ చేసుకుంటే – 'పీకాక్ ఫ్రేమ్' నిండుగా చూడ చక్కగా ఉంటుంది. □

### శ్రీమతి అధికార్ల సత్యవతి

కళలకు పుట్టిల్లయిన విజయనగరంలో జన్మించిన అధికార్ల సత్యవతి 'అభినవ మీరా'గా కీర్తి గడించారు. ఆమెను ఆ విధంగా ఆశీర్వదించిన వారు–కంచి (చిన్న) శంకరాచార్యులవారు కావడం విశేషం!

ఆగస్టు 16, 1971 నాడు తిరుమల వేంకటేశ్వరుని సన్నిధానంలో ప్రప్రథమంగా భజన కీర్తనలను ఆమె ఆలపించారు. అప్పటి నుంచి ఆమె దేశం నలుమూలలా ఎన్నో కచ్చేరీలు చేశారు. తన భక్తి రంజని కార్యక్రమాలతో నాస్తికులను కూడా ఆస్తికులను చేయగలరన్న పేరు పొందారు.

గత సంవత్సరం ఆమె గాన మాధుర్యానికి, భక్తి తత్పరతకూ ముగ్ధులైన శృంగేరీ స్వాముల వారు తమ హైద్రాబాదు మఠంలో ప్రత్యేక పారితోషికాలతో ఆమెను ఆశీర్వదించారు.



1976లో ఆమెకు మద్రాసులో ఘనమైన సన్మానం కూడా జరిగింది.

శ్రీమతి సత్యవతితో పాటు ఆమె నలుగురు కుమార్తెలు కూడా భజనల్లో పాల్గొంటూ వుంటారు–అదొక విశేషం!

—రావినూతల రాజ్యలక్ష్మి

వదినగారు కూడా అదే మాటనేసరికి మెత్త పడ్డాడు.

మురళీమోహన్. కొన్నాళ్ళపాటు యిల్లు వదిలి దూరంగా వెళ్ళాలని అంతరాంతరాలలో వున్న కోరిక కూడా దాన్ని దోహదం చేసింది.

మామగారింటికి వచ్చేసరికి వాస్తవంగానే అతని కెంతో రిలీఫ్ దొరికినట్లయింది! అక్కడున్నంత కాలం అతనికి ఇంటి పరిస్థితుల గురించి ఆలోచనలు రాలేదు. వదినగారి బాధలు గుర్తు రాలేదు. ఒక విధంగా అనుక్షణం దగ్గరుండే మాధవి అతన్ని అలా మైమరపింపజేసిందనటం న్యాయం!

## 32

బియ్యంలో రాళ్ళేరుకుంటూ ఆలోచనల్లో పడిపోయింది కృష్ణవేణి. బియ్యం నిండా రాళ్ళు. 'ఈ రాళ్ళేరే బదులు బియ్యమేరుకోవటం సుళువేమో వదినా!' అంటూంటుంది నిర్మల. ప్రతి పూట ఇదో గంట పని. యేరి యేరి వేళ్ళు నెప్పెడతాయి. చూసి చూసి కళ్ళు పోట్లు వస్తాయి. అయినా ఆమెకది తప్పదు. మంచి బియ్యం కొనాలంటే ఎక్కువ డబ్బు పెట్టాలి. అందుకు శక్తి లేదు. ఇలాగే కిలో కూర కొనవల్సిన చోట ముప్పావు కిలో కొంటుంది. మూడు లీటర్లు పాలు కావలిస్తే రెండు లీటర్లతోనే సరిపెడుతుంది.

సాధారణంగా వదినగారితోనే భోజనానికి వస్తానంటుంది నిర్మల. ఆధరవులు తను తక్కువ వేసుకొని ఆడపడుచుకి యెక్కువ వేస్తుంది కృష్ణవేణి. "నేనేమన్నా బకాసురుడి చెల్లెల్నా! అంతా నాకే వేసేస్తావు...." అంటూ చిరుకోపం తెచ్చుకొని తన కంచంలోది తీసి వదినగారి కంచంలో వేయబోతుంది నిర్మల.

"చిన్నవాళ్ళు ఎక్కువ తినాలి. ఈ వయసులో నాలాంటి వాళ్లు యెంత తక్కువ తింటే అంత మంచిది" అని నవ్వుతుంది కృష్ణవేణి చెయ్యి అడ్డుపెడుతూ.

"అలాగా! మీకిప్పుడెన్నేళ్ళు బామ్మగారూ!" అని మూతి ముడుస్తుంది నిర్మల.

రోజూ వాళ్లకి పోట్లాట మామూలయిపోయింది. ఆమె యిలా ఎందుకు చేస్తోందో నిర్మలకి తెలుసు. నిర్మలకి తెలుసని కూడా ఆమెకు తెలుసు. అయినా, విషయం విడిచి ఏవేవో మాట్లాడుకుంటారు. మభ్య పెట్టుకొనే మాటలతో మనసులు

తేలిక్పరచుకోటానికి ప్రయత్నిస్తారు. అంతకు మించి మరో మార్గమేదీ కనిపించటం లేదు. ఎన్నోవిధాల ఆదా చేస్తేకాని ఈ కుటుంబ ఖర్చుల్ని భరించటం ఆమె శక్యం కావటంలేదు. భర్త పేకాట నిప్పుల్లో పోసే డబ్బు పెడితే ఇంటి ఖర్చుల్ని నిక్షేపంలా గడపవచ్చు. కాని, అతను వినే స్థితిలో లేడు....

ఆ విషయం మీద అతనితో అనేక రోజులు వాదించి వాదించి విసిగి వేసారిపోయింది కృష్ణవేణి.

తన దగ్గర డబ్బులు అడగటంతో సరిపెట్టకుండా మురళిని కూడ అడిగి పుచ్చుకోవటం మొదలు పెట్టాక ఆమె బాధ మరింత ఎక్కువయింది. తానే స్థితిలో వున్నాడో మరింత స్పష్టంగా చెపితే భర్త అర్థం చేసుకుంటాడేమోనని

బుక్కు చూడండి... మాధవి మనింటికి వచ్చినప్పట్నించి అంతా వ్రాసుంచాను. చివరికి చిన్నపిల్ల నిర్మల కూడా తన జీతం తెచ్చి నా చేతుల్లో పెడుతోంది... చూడండి...." అంటూ పుస్తకం అతని చేతుల్లో పెట్టబోయింది.

ఆమె చేతుల్ని విసురుగా త్రోసేసాడతను: "రాయి. అక్కౌంటంతా బాగారాయి. నేను తెచ్చింది—పుచ్చుకుంది అంతా రాయి....వాళ్ళని కూడా బాగా వ్రాసుకోమను. ఎవరెవరికి నేనెంతెంత బాకీ వున్నానో వ్రాసి పెట్టుకోమను.... ఏదో ఒకనాడు వాళ్ళ బాకీ అంతా అణాపైసలతో చెల్లిస్తానని చెప్పు. కావాలంటే వడ్డీకూడా వసూలు చేసుకోమను...."

ఈ వితండ వాదానికి ఆమెకేమనాలో పాలు

సశేష నవల




విమలారామం

ఓనాడు మనసులోని బాధనంతా వెళ్ళగ్రక్కుకుంది.

ఇంతకాలం మురళి యిచ్చే డబ్బే కాకుండ ఇప్పుడు మాధవి కష్టార్జితం కూడా తను ఖర్చు పెట్టేస్తున్నానని – తన్నిలా యిరుకున పెట్టటం అతనికి భావ్యమేనా - అని అడిగింది.

విశ్వనాధానికి చ్రుర్రున కోపం వచ్చింది. "అందరు సంపాదించిందీ పట్టుకువెళ్ళి నేను తగలబెడుతున్నానంటావ్? అయితే, మరి ఇంట్లో తిండికి బట్టకి ఎక్కడ్నించి తెస్తున్నావ్? మీ పుట్టింటి నుంచి తెచ్చి పెడుతున్నావా?...." అని విరుచుకు పడ్డాడతను.

కృష్ణవేణి ఉద్వేగాన్ని అణచుకుంటూ అంది. "మన మధ్య మా పుట్టింటి వాళ్ళ విషయమెందుకు లెండి. ఈ యిల్లు నడుస్తున్నది.... మీ అందరి సంపాదనతోనే! కాని, ఎవరెవడు ఎంత తెస్తున్నారు? స్వంతానికి ఎంత ఖర్చు పెట్టుకుంటున్నారు....అది మీరు గ్రహిస్తున్నారా అనే నేనడిగేది! కావాలంటే ఈ అక్కౌంటు

పోలేదు. "మీరపార్థం చేసుకోకండి. పాపం వాళ్ళెవరూ అలాంటి మాటలనలేదు. మనసులో కూడా అనుకోరు. ఏమన్నా నేనే అంటున్నాను. నా బాధ కొద్దీ మీతో చెప్పుకుంటున్నాను. నేను వాళ్ళకి చేస్తున్న అన్యాయమేమిటో మీకు చెప్పుకుంటే అర్థం చేసుకుంటారని... మనసు మార్చుకుంటారని...." అని నచ్చచెప్పబోయింది.

కాని, ఇంట్లో అంతా త్యాగధనులు-తనొక్కడు ఖర్చుదారుడు—అన్నట్టు భార్య మాట్లాడ్డం అతని కుడుకుమోతుతనం తెప్పించింది. "మనసు! నాకు మనస్సెక్కడుంది? మీ ఉద్దేశ్యంలో నాకు మనసంటూ లేదు. మనసులేదు కనుకనే ఏ లెక్కలూ వ్రాసుకోకుండా మీ మరిదిగారికి వందలకి వందలు పంపి పై చదువులు చదివించాను. మనసు లేదు కనుకనే నేను చదువుకోక పోయినా మీ ఆడపడుచుల్ని డిగ్రీ చదువులు చదివించాను. నాకు మనసు లేదే! నిజంగా నాకు మనసు లేదు. నేను మనిషినీ కాను....అనండి. మీ యిష్టం

వచ్చినట్టు అనండి!'' అని తన నోటికి వచ్చినట్టు సాధించిపోసాడు.

తనెంత నచ్చచెప్పబోతున్నా భర్త అపార్థం చేసుకొనేసరికి కృష్ణవేణి హతాశురాలయిపోయింది. కంఠశోష తప్ప ఆమెకు చివరికి మిగిలిందేమీ లేకపోయింది....ఇటువంటి వాడు తనంతట తను తెల్సుకోవల్సిందే కాని ఒకరి మాటలతో మారడు. అటువంటి రోజు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తోంది ఆమె.

బుర్రలో వేగిపోయే ఆలోచనలు ఆమెకు శరీరశ్రమని తెలియనివ్వటం లేదు. కళ్ళుపోట్లు పెట్టినా, వేళ్ళు నెప్పులు పెట్టినా, నడుం విరిగిపోతున్నట్లున్నా ఆమె నిత్యం బియ్యంలో రాళ్ళు యేరుకుంటూనే వుంటుంది, ఇలాగే తన సమస్యల్ని కూడా యేరి పారేసుకోగలిగితే ఎంత బావుండును....అనుకుంటూంటుంది.

ఆవేళప్పుడు ఇంట్లో వుంటే నిర్మల సాయం చేస్తుంది. అప్పుడామెకు కొంచెం విశ్రాంతి, లేకపోతే, ఆమెకాశ్రమ తప్పదు!

ఆవేళ తన స్నేహితురాలు మాలతికి పెళ్ళి చూపులంటే వాళ్ళింటికి వెళ్ళింది నిర్మల. ఆమె తిరిగి వచ్చేసరికి కృష్ణవేణి బియ్యం బాగు చేత అయిపోవచ్చింది.

వచ్చి మంచినీళ్ళు త్రాగి మౌనంగా కూర్చున్న నిర్మలవైపు వింతగా చూసింది కృష్ణవేణి. ''ఏమిటి పెళ్ళిచూపుల విశేషాలు?'' అని అడిగింది కుతూహలంగా.

నిర్మల పెదవి విరిచింది. ''ఏముంటాయి? అన్నీ మామూలే! అబ్బాయికి అమ్మాయి నచ్చుతుంది....కాని, అమ్మాయి తెచ్చే కట్నం నచ్చాలి కదా!''

కృష్ణవేణి పల్చగా నవ్వింది. ఆ నవ్వులో బాధ నిండి వుంది.

''కట్నంపిశాచి నశించాలని కాలేజీలో స్టేజి మీదకెక్కి ఉపన్యాసాలిచ్చాం. కట్నం పుచ్చుకొనే వాడిని పెళ్ళి చేసుకోమంటూ ప్రతిజ్ఞలు చేసాం.



# సూపర్ 777

## మురికికి ముప్పు, మెరుపుల తెలుపు -




భారతదేశంలో లక్షలాది గృహిణులు మెచ్చిన సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్.

**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**

Shilpi dm. 15 A/78 Tel

ఇప్పుడు దేశంలో వస్తున్న ఎన్నో మార్పుల్లో ఇదీ ఒక మంచికే దారి తీస్తుందని ఆశపడ్డాం. రోజులు మారుతున్నాయి కాని....ప్చ్! మనుషు లింకా మారుతున్నట్టెక్కడా కనిపించటం లేదు!"

కృష్ణవేణి కేమనాలో తోచలేదు. ఆమె గుండె మరింత బరువెక్కింది. మాట వరసకి "ఏం జరిగింది?" అని అడిగింది.

"ఇప్పటికి మూడుసార్లు పెళ్ళిచూపులయ్యాయి దానికి....చూసి వెళ్ళటం, పిల్లనచ్చిందని ఉత్తరం వ్రాయటం, ఆ తర్వాత సంప్రదింపుల్లో ఫెయిలవటం. కట్నం సరిపోదని మనస్సు మార్చుకున్న వాళ్ళే అంతా. ఇప్పుడు వచ్చింది నాల్గో సంబంధం! యథావిధిగా ఊరు వెళ్ళాక ఉత్తరం వ్రాస్తామని చెప్పి వెళ్ళారు. వ్రాస్తారు. వాళ్ళు వ్రాయబోయేదేదో కూడా మనకి తెలుసు....తర్వాత మరోసారి పెళ్ళి చూపులకి గంగిరెద్దులా అలంకరించుకొని మాలతి సిద్ధం కావల్సిందే!...."

"ఛ! అలాగెందుకనుకోవాలి. ఈ మాటిది ఖాయమవుతుందేమో!"

నిర్మల తల అడ్డంగా త్రిప్పింది. "లేదు వదినా! అంత మంచివాళ్ళయితే అభిప్రాయం చెప్పటానికి వాళ్ళూరు వెళ్ళి ఆలోచించనక్కర్లేదు. ఇక్కడే కచ్చితంగా మాట్లాడుకొని వెళ్ళొచ్చు. కనీసం ఈ సస్పెన్సయినా తప్పుతుంది...."

"ఎవరూ ఆలా చేయరు. ఆడపిల్ల తరపు వాళ్ళు వాళ్ళింటికి వెళ్ళి ఖాయపర్చుకోవటం సంప్రదాయం...."

"అలాగా! మరి – ఆడపిల్లనిచ్చుకునేవాళ్ళకి శక్తి లేకపోయినా వచ్చినంత కట్నం రాబట్టటం కూడా ఒక సంప్రదాయమే కాబోలు! మనవాళ్ళ సంప్రదాయాలు ఎంత గొప్పవి వదినా!" అంది నిర్మల వ్యంగ్యంగా.

కృష్ణవేణి గాఢంగా నిట్టూర్చింది.

## 33

"ఒకసారి అన్నయ్యనీ, వదిన్నీ చూసొస్తా వదినా!" అంది నిర్మల.

కృష్ణవేణి నవ్వింది. "ఈ నాల్గు రోజుల్నుంచీ ఆ మాట అన్నావు కాదేమా అని ఆశ్చర్య పోతున్నా!"

నిర్మల మునిమునిగా నవ్వింది.

"సరే, వెళ్ళి త్వరగా వచ్చెయ్. ఇంటి మీద దృష్టి పెట్టుకోకుండా ప్రశాంతంగా మనస్సుంచుకొని చదువుకోమని మురళితో చెప్పు.... మాధవితో...."

కృష్ణవేణి చెప్పటం పూర్తి కాలేదు. మాధవి చిరునవ్వుతో ప్రత్యక్షమయింది.

"నీ మాటే అనుకుంటున్నాం. నీకు వెయ్యేళ్ళాయిష్షు! మీ అక్కయ్య నీకేదో చెప్పాలిట.... డైరక్టుగానే విను!" అని నవ్వింది నిర్మల.

"ఏమిటి విశేషాలు?" అని కుశల ప్రశ్న వేసింది కృష్ణవేణి – మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ.

"ఒకసారి మిమ్మల్నందర్నీ చూద్దామనిపించిందక్కా! అందుకని –" అంది మాధవి.

కృష్ణవేణి ఆమె వైపు ప్రేమగా చూసింది. "అందరిదీ ఒక్కటే మాట...."

నిర్మల చిరుకోపం తెచ్చుకుంది. "ఏం లాభం! నేనే ఓడిపోయాను."

మాధవి చిత్రంగా చూసింది. "ఏమిటి నిర్మలా?"

"నిన్ను చూద్దామని తాను బయలుదేరబోతోంది. ఇంతలో నువ్వే వచ్చావు. అందుకని...." అని సంగతి చెప్పింది కృష్ణవేణి.

"ఇంతలో ఏం పోయింది? నేనక్కయ్యని చూడ్డానికి వచ్చాననుకో! నన్ను నువ్వు చూడలేదనుకో!....ఈ రోడ్డమ్మట నువ్వు మా యింటికి రా. ఆ రోడ్డమ్మట నీకంటె ముందు మా యింటికి వెళ్ళి సిద్ధంగా వుంటాను...." అంది మాధవి.

నిర్మల మూతి మురిపెంగా త్రిప్పింది. "చూసావా వదినా! మా యింటికి........మా యింటికి....అంటూ మననం చేస్తోంది. ఇప్పుడు ఈవిడగారిల్లు ఇదా అదా?"

మాధవి ముఖం ఎర్రనయింది.

"పెళ్ళయినంతమాత్రాన పుట్టిల్లు తన యిల్లు కాకపోతుందా నిర్మలా!" అంది కృష్ణవేణి.

"రేపు నీ పెళ్ళయ్యాక ఈ యిల్లు మా యిల్లు-అను. అప్పుడు నీపని పట్టిస్తాను!" అంది మాధవి నిర్మల బుగ్గ గిల్లుతూ.

"రేపు నా పెళ్ళా? అరే....నాకు తెలియదే! ఎవడు చెప్మా పెళ్ళికొడుకు!" అంది నిర్మల సీరియస్‌గా ముఖంపెట్టి.

అక్కచెల్లెళ్ళు పకపక నవ్వుకున్నారు.

వాళ్ళలా కబుర్లలో ఉండగానే పిల్లలు బడి నుంచి వచ్చారు. మాధవి అత్తగారి దగ్గరకి వెళ్ళి కాసేపు మాట్లాడింది.

మరి కొంతసేపటికి తన ట్యైపుపనికి వేళయిందని చెప్పి బయలుదేరింది నిర్మల. అందరితోటి చెప్పి మాధవి బయలుదేరింది. సరదాగా రమ్మంటే నిర్మల పనిచేసే చోటికి తనూ వచ్చింది.

వాళ్ళని చూస్తూనే ప్రొప్రయిటరు షణ్ముఖరావు "కంగ్రాట్యులేషన్స్ నిర్మలా!" అన్నాడు.

"థ్యేంక్యూ సర్! కంగ్రాట్సు దేనికండి." అంది నిర్మల చిరునవ్వునవ్వుతూ.

"ఏమ్మా మాధవీ! మీ నాన్నగారింకా మీకు చెప్పలేదూ?"

మాధవి ఆశ్చర్యంగా చూసింది. "లేదండీ! పోనీ, ఆ గుడ్‌న్యూస్ మీరే చెప్పండి!"

షణ్ముఖరావు చెప్పారు. ఆయనకు తెల్సిన మరో పెద్ద కంపెనీవాళ్ళు ఆ వూళ్ళో క్రొత్తగా బ్రాంచి తెరుస్తున్నారుట. దానికో ట్యైపిస్టు అమ్మాయి వుంటే రికమెండ్ చేయమని ఆయనతో చెప్పారట. చటుక్కున నిర్మల పేరు చెప్పాడుట ఆయన. రాఘవరావుగారేదో పని మీద అటువైపు వస్తే ఈ సంగతి నిర్మలకి చెప్పమని చెప్పాడట.

ఆ సంగతి విని నిర్మలకి తనూ శుభాకాంక్షలందించింది మాధవి.

నిర్మల ఆనందంతో ఉక్కిరిబిక్కిరయినట్టయింది. "నిజంగానేనండీ!" అంది.

షణ్ముఖరావు గలగల నవ్వారు. "అలేదాని వమ్మాయ్! ఇన్నాళ్ళూ ఉద్యోగం కావాలి కావాలి అన్నావు. ఇప్పుడు వచ్చిందంటే నమ్మవేమిటి?"

నిర్మల పనితనం గురించి తాను కంపెనీ వాళ్ళతో చెప్పానని–ఆ ఉద్యోగం ఆమెకు తప్పకుండా వస్తుందని ఆయన చెప్పారు.

మాటల సందర్భంలో ఇంకా నిర్మల డిగ్రీ పూర్తిచేయలేదని తెల్సి "అరే, నువ్వు బియ్యే పాసయ్యావని వాళ్ళతో చెప్పాను! ఎప్పుడో ఆ పార్టుకి కట్టేసావనుకుంటున్నాను. నువ్వూ చెప్పలేదు. రాఘవరావుగారయినా చెప్పారు కాదు..." అన్నాడు షణ్ముఖరావు నిరుత్సాహంగా.

"అది కట్టి పాసవమని నేను పోరుతూనే వున్నానండి. కాని, వింటేకాదు...." అంది మాధవి అంతకన్న నిరుత్సాహపడిపోతూ.

కొన్ని నిమిషాలక్రితం ఉవ్వెత్తునపొంగిన ఆనందం చటుక్కున ఉసిపోయినట్టయి నిర్మల

ముఖం ముకిళించుకుపోయింది.

అది గుర్తించి "నిర్మలచేత వచ్చే పరీక్షకి కట్టించి పాసుచేయించే పూచీనాది. ముందీ జాబ్ వచ్చేలా చూడండి!" అంది మాధవి.

"ఈ పార్టు కట్టినంతమాత్రాన గొప్ప నాలెడ్జి వచ్చేస్తుందని....కట్టకపోతే ఆ పనికి పనికిరారని కాదు—వాళ్ళు గ్రాడ్యుయేట్ కావాలన్నారు. తీరా నిర్మల బియ్యే పాసయిందనుకొని చెప్పాను. సరే, నేను చెప్పవల్సింది ఎలాగో చెపుతాను. చూద్దాం ఏమవుతుందో!" అన్నాడు షణ్ముఖరావు.

"పోనీ ఆ ఉద్యోగం మా అక్కయ్యకి యిప్పించండి సార్!" అంది నిర్మల చటుక్కున.

షణ్ముఖరావుతోపాటు మాధవి కూడా ఆశ్చర్య పోయింది.

"మీ అక్కయ్యా?...."

"అవునండి. మా అక్కయ్య బియ్యే పాస యింది. టైపు లోయరు కూడా పాసయింది. షార్టుహేండ్ కూడా కొన్నాళ్ళు ప్రాక్టీసు చేసింది."

"అదిసరే, ఆ అమ్మాయి పెళ్ళయి అత్తా రింటికి వెళ్ళిపోయింది కదా!"

నిర్మల బలవంతంగా నవ్వు తెచ్చుకుంది. "అవుననుకోండి. ప్రస్తుతం వాళ్ళకేవో యిబ్బం దులున్నాయి. మా అక్కయ్యకి ఉద్యోగం చాలా అవసరం. దయవుంచి యిప్పించండి...."

షణ్ముఖరావు చిత్తరువే అయిపోయాడు.

మాధవికి నోటమాట రాలేదు.

మరో అరగంట పోయాక "........పార్వతి ఈ ఉద్యోగం చేస్తుందంటావా?" అంది మాధవి అనుమానంగా.

"ఏమో! మన ప్రయత్నం మనం చేద్దాం. ఆ తర్వాత దాని అదృష్టం. రేపే అక్కయ్యని రమ్మని ఉత్తరం వ్రాస్తాను!" అంది నిర్మల.

## 34

అక్కకి ఉత్తరం వ్రాసేముందు ఈ విషయం గురించి వదినగారితోను తల్లిదండ్రులతోను సంప్రదించి మరీ వ్రాసింది నిర్మల. సత్యనారాయణ గారు కూడా పార్వతి ఉద్యోగం చేస్తుందన్న నమ్మకం తనకు లేదన్నాడు.

"....నిజం చెప్పాలంటే నాకన్న అక్కయ్య కిప్పుడి ఉద్యోగం అవసరం. కనీసం, బావగారి సస్పెన్షన్ వ్యవహారం తేలేవరకయినా అక్కయ్య ఉద్యోగం చేయటం మంచిది...." అంది నిర్మల.

"....నువ్వు చెప్పింది బాగానే ఉందమ్మా! పార్వతి చేస్తానన్నా అతగాడు చెయ్యనివ్వద్దా?" అన్నాడు సత్యనారాయణగారు.

"అదేమిటి నాన్నా! తను సంపాదించకపోతే పోయేదు - అక్కయ్యనైనా చెయ్యనివ్వదేమిటి?"

సత్యనారాయణగారు నవ్వారు. "పెళ్ళాం సంపాదన మీద గడపాలంటే అవమానం కదూ మరి!"

"భార్య పుట్టింటికి వెళ్ళి డబ్బు తెచ్చిస్తే తీసుకోటానికి లేని అవమానం ఆవిడ స్వయంగా సంపాదించి తెస్తేనే ఎందుకుండాలి!" అంది నిర్మల ఆవేశపడుతూ.

"అది వేరు. ఇది వేరు. తనింట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటున్నప్పుడు పెళ్ళాం వెళ్ళి ఉద్యోగం చేయటం మగాడు భరించగలడా? నలుగురూ ఏమనుకుంటారోనని భయం...."

"ఇదెక్కడి న్యాయం! అత్తవారిని పీడిస్తే ఎవరూ ఏమీ అనరు కాని అవసరం వచ్చి పెళ్ళాం చేత ఉద్యోగం చేయిస్తే తప్పు పడతారా?"

"ఎవరన్నా అనకపోయినా అతగాడలా అను కుంటాడు. అదే అసలు చిక్కు."

"అలాంటి వాళ్ళకి బుద్ధి చెప్పాలంటే అక్కయ్య తప్పకుండా ఉద్యోగం చెయ్యాలి. ఒక గుణపాఠం నేర్పాలి..."

"నీ ఉద్దేశం బాగానే వుంది కాని ఎంత వరకు మీ అక్కయ్య పాటిస్తుందా అని!...."

"నన్నేం చేయమంటావో నువ్వే చెప్పమ్మా!" అంది నిర్మల తల్లితో.

కూతురి మంచి మనసుకి సుభద్రమ్మ ఎంతో సంతోష పడింది. "....గుర్రాన్ని చెరువు దగ్గరికి తీసుకువెళ్ళగలమే కాని నీళ్ళు తాగించలేము కదా! ఈ విషయమేదీ వ్రాయకుండా నేనోసారి చూడా లనుకుంటున్నానని మాత్రం వ్రాయి. వచ్చాక అంతా వివరంగా చెపుదాము. మన మాట వింటా మంచిదే....వినకపోతే దాని కర్మ!"

ఈమధ్య కాలంలో తనంతట తను పుట్టింటికి రావటమే కాని....తన వాళ్ళు రమ్మని వ్రాయటం అంటూ లేదు. అందులో వ్రాసింది ఎవరో కాదు. '....తన పొడ బొత్తిగా గిట్టని' చెల్లెలు!.... ఎంతో పరమానంద పడిపోతూ మర్నాడే బయలు దేరి వచ్చింది పార్వతి.

గుమ్మంలోనే ఎంతో ఆప్యాయంగా పలక రించింది నిర్మల. పేరు పేరునా వాళ్ళ అత్తింటి వారిని గురించి ప్రశ్నలు వేసింది. ఆమెను చూసి ఎన్నో రోజులయిందంది. బావగారిని కూడా తీసుకు రాకపోయావా అంది....

చెల్లెలింత ప్రసన్నవదనంతో ప్రేమగా మాట్లాడ్డం ఎప్పుడూ చూడలేదు పార్వతి. ఆఖరికి ఆ పూట కూర కూడ ఎలా చేయమంటావని అడిగి తనే వండింది. ఉతికి ఇస్త్రీ చేసిన తన చీర తెచ్చి కట్టుకోమని బ్రతిమాలింది. తనే ఆమెకి జడవేసి పూల చెండు తురిమింది.

ఇన్నాళ్ళు తనంటే విసుక్కునేది చెల్లెలు ఒక్కతేనని పార్వతికి దురభిప్రాయం. కాని, ఇప్పుడా యింట్లో ఎవ్వరూ చూపించనంతటి ఆప్యాయతను కనపరచింది. తియ్యని మాటలతో

### దీపికలు

కరిగిన గతం వేసిన చెరగని ముద్రలు
మరిపించే కాలం కన్నా బలమైన గుర్తులు
స్మృతుల కడలిలో తరగని అనుభూతుల
తరగలు కనిపించని రూపాన్ని తలపించే
తీయనితలపులు
శ్రుతి చెదిరిన బ్రతుకు వీణపై
వినిపించే సుస్వరగతులు
కల కరిగిన కన్నియ ఎదలో
రవళించే రమ్యగీతికలు

తావి పూవును విడిచినా
తారకలు చంద్రుని మరచినా
కెరటాలు కడలికి కరువైనా
విడనివి – వని వాడనివి
మరువలేనివి – కరువులేనివి

ఎవరు శాసించినా ఆగనివి
వేరెవరు ఆశించినా అందనివి
ఆ రాగ హృదయానికి సంకేతాలు
ఈ మూగ హృదయంలో సంగతులు
నీరస నిర్లిప్త నిరాశాంధకార ప్రస్తుతంలో
భావి జీవిని దీపించే నిలువెత్తు దీపికలు

—నిమిషకవి స్వరాజ్యలక్ష్మి, యం. ఏ

ఉక్కిరి బిక్కిరి చేసింది. చెల్లెలు హఠాత్తుగా మారిపోయిందా — లేక యిదంతా కలా?.... పార్వతికి అంతు పట్టటం లేదు.

ఇదివరలో మాదిరి కూతురు రాగానే "....మీ ఆయన ఉద్యోగం విషయం ఏమయినా తెల్సిందా?" అని సుభద్రమ్మ అడగలేదు.

సుబ్బారావు ఉద్యోగం విషయం తేలి వుంటే ఈ పాటికా సంగతి పార్వతే గొప్పగా చెప్పుకుని వుండేదని అందరికీ తెలుసు. అందుకనే, ఎవ్వరూ ఆ ప్రస్తావనే తీసుకు రాలేదు.

"నిన్ను చూసి చాలా రోజులయిందని రమ్మని ఉత్తరం వ్రాయించాను" అని తల్లి చెప్పింది. ఎవరి మాటలూ క్రొత్తగా లేవు కాని చెల్లెలు ప్రవర్తనే ఆమెను తబ్బిబ్బు చేసింది.

ఏమిటా ఈ 'విపరీతం' అని ఆమె ఆశ్చర్య పడుతుండగా ఆవేళ మధ్యాహ్నం సుభద్రమ్మ ఉద్యోగం ప్రస్తావన లేవనెత్తింది.

"....ఉన్న ఊళ్ళోనే ఉద్యోగం. మాకు దగ్గరిగా ఉంటావు. ఎవరిచేతా మాట అనిపించుకో నక్కర్లేదు....మీ సంపాదన మీరు హాయిగా ఖర్చుపెట్టుకోవచ్చు...." అంటూ ఎన్నోవిధాల ప్రోత్సాహకరంగానే చెప్పింది.

విషయం విన్న వెంటనే పార్వతికి షాక్ తగిలినట్లయింది.

లిప్తకాలం కూడా ఆలోచించకుండా బిరబిర మాట్లాడే అక్కయ్య నోరు విప్పటం లేదంటే సుముఖంగానే ఆలోచిస్తోందని అనుకుంది నిర్మల.

"ఒక పది రోజులు ప్రాక్టీసు చేస్తే షార్టుహేండ్ బాగా టచ్‌లోకి వస్తుంది. నీకున్న క్వాలిఫికేషన్సు ఉన్నాయి. మా ప్రొప్రయిటరుగారు రికమెండ్ చేస్తానన్నారు. నీకే ఉద్యోగం రావటం ఖాయం."

పార్వతికి గుండెలు దడదడలాడాయి.

ఆమె ఎంతో నిదానంగా వింటోందనుకుంది మాధవి. తాననవసరంగా ఆమెననుమానించా నని మనస్సులో నొచ్చుకుంది. పార్వతి ఉద్యోగం చేయటానికిక ఒప్పుకున్నట్టేనని భావించింది. ఆ ఆనందంలో "వాళ్ళ ప్రొప్రయిటరు గారితో నిర్మల ఏమందో తెల్సా పార్వతీ! మా అక్కయ్యకా ఉద్యోగం యిప్పిస్తే నాకిచ్చినంతగా సంతోషిస్తానంది—అంది. నాకన్న మా అక్కయ్యకే ఉద్యోగం చాలా ముఖ్యమని కూడా చెప్పింది...." అంది.

పార్వతి గుండెల్లో ఆటంబాంబు ప్రేలినట్ల యింది. 'తనకిస్తానన్న ఉద్యోగం అక్కగారి కిమ్మంది. అంటే ఎలాగయినా తనచేత ఉద్యోగం చేయించాలని పథకం వేసిందన్నమాట! పుట్టింటికి వచ్చినప్పుడల్లా డబ్బుడుగుతున్నాననేకదా! ఎంత చప్పనాతి గుణం!....ఇదాతల్లీ యింతసేపు నువ్వు చూపించిన ప్రేమ రహస్యం! ఏ బండారం కనిపెట్టలేనంతటి అమాయకురాలిననుకున్నావా?'

క్షణంలో పార్వతి మనసు విషపూరితమయి పోయింది. చెల్లెలి మీద పీకదాకా కోపం ముంచుకు వచ్చింది. అయితే, అంతా తలోమూల తనని ఉద్యోగం చేయమని అనటంతో ఆ కోపాన్ని చెల్లెలి మీద ప్రదర్శించటానికి వీలులేకపోయింది.

ఇంకా ఎంతో ప్రోత్సహంగా చెపుదామనుకున్న నిర్మల, అక్కగారి ముఖంలో రంగులు మారటం గుర్తించింది. "....తొందరేం లేదక్కా! బాగా ఆలోచించుకొనే చెప్పు!..." అంది.

"ఆలోచించటానికేముంది? నాకు చేయటానికి వీలుండదు." అంది పార్వతి కరుగ్గా.

అంతా నిర్ఘాంతపోయారు. మొదట తేరుకున్న సుభద్రమ్మ అడిగింది. "ఏం? ఎందుకు వీలుండదు?"

"ఓమూల ఉద్యోగం పోయి ఆయన బాధ పడుతుంటే తగుదునమ్మా అని నన్నుద్యోగంలో చేరమంటావా? ఆయనెంత బాధపడతారు!...."

"ఇందులో బాధపడటానికేముందే! సంపాదన ఉన్నా లేకపోయినా ఖర్చులంటూ ఉంటాయి కదా!....మీ అత్తవారి మీద మీ బరువు బాధ్యతలు పెట్టేబదులు మీ సంపాదన మీద నిక్షేపంలా గడపవచ్చుననే మేము చెప్పేది...."

"నేను ఉద్యోగం చేయటానికాయన ఒప్పుకోరు...." అంది పార్వతి మొండిగా.

"నువ్వు చెప్పేలా చెపితే ఎందుకొప్పుకోడు! తనేమన్నా కష్టపడాలా యేమన్నానా? కష్టపడేది నువ్వు. సంపాదించేది నువ్వు. నువ్వాపని చేస్తే తనూ అభిమానం తెచ్చుకొని ఏదో ఒక పని చూసుకుంటాడు....ఆ సన్నెన్నను గొడవ ఒక పట్టాన తేలే వ్యవహారమా యేమిటి? అవసర మయితే రేపు కోర్టు క్కూడా వెళ్ళాల్సి వస్తుంది. దానికయినా డబ్బుంటేను! లేకపోతే పోయిన ఉద్యోగం రాబట్టుకోవటం మాటలు కాదు...." అన్నాడు సత్యనారాయణగారు.

తండ్రి కూడా అదే మాట! పార్వతికి పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. ఎరక్క పోయి పుట్టింటికి వచ్చానే అనుకుంది.

"మాట్లాడవేమే?" అంది సుభద్రమ్మ.

"మా అత్తగారు, మామగారు ఒప్పుకుంటారో లేదో!...." అని నసిగింది.

"ఆయన ఉద్యోగం విషయం తేలిపోగానే కావాలంటే నువ్వు మానెయ్యొచ్చు పార్వతీ!...." అని యింకా ఏదో చెప్పబోయింది మాధవి.

అంతా తలోవైపునా ఊదరగొట్టేస్తున్నారన్న అక్కసుకొద్దీ చిన్న వదినగారి మీద విరుచుకు పడింది పార్వతి. "....ఒకళ్ళకి సలహా లివ్వటం సులువే వదినా! తనదాకా వస్తేనే తెలిసేది. రేపొకవేళ చిన్నన్నయ్య కుద్యోగంపోతే అప్పుడా బాధేమిటో నీకు తెలిసొస్తుంది!...."

ఆమె నోటి దురుసుతనానికి అంతా నివ్వెర పోయారు.

"ఛీ! పాపిష్టిదానా! అనవల్సింది అనకూడ నిది అంటూ లేదటే! నోటికెంతవస్తే అంత మాట్లాడ్డమేనా? ఇలాంటి పాడుబుద్ధులున్నాయి కనుకనే అనుభవిస్తున్నావు...." అంటూ సుభద్రమ్మ కేకలు వేసింది.

"ఊర్కోండత్తయ్యా....!" అని సర్ది చెప్ప బోయింది కృష్ణవేణి.

ఆవిడ కోపం యింకా తగ్గలేదు. "పొర పాటున కూడా ఇంట్లో ఒక్కరయినా పాడు మాట మాట్లాడరే! దీని నోటికిలాంటి మాటలు ఎలా వస్తాయి? బుద్ధి పద్దం లేకుండా అది నోరు పారేసుకుంటుంటే ఎలా వూర్కోమంటావు?.... దౌర్భాగ్యురాలు నా కడుపున చెడబుట్టింది!"

"కష్టంలో కన్నవారింటికి వచ్చిన పిల్లను మనమిలా నిందించటం మంచిది కాదత్తయ్యా! ఏదో తొందరపాటుకొద్దీ నోరు జారింది కాని, అనాలని అంటుందా?" అంది కృష్ణవేణి.

"తిట్టనీ వదినా: తిట్టనీ! అత్తారింట్లోనూ నాకు తిట్లే—పుట్టింట్లోను తిట్లే. నాది తిట్లమారి బ్రతుకయిపోయింది...." అంటూ ఏడవసాగింది పార్వతి.

"ఇన్నాళ్ళూ అదెంత నోరు పారేసుకున్నా ఊరుకున్నాను. నిర్మలెంత మంచి చెపుతున్నా దీని తరపునే మాట్లాడి దాన్ని కేకలేసాను. ఒక నాడు కాకపోతే మరోనాడయినా దాన్ని చూసి బుద్ధి తెచ్చుకుంటుందనుకున్నాను. కాని, ఇంత మూర్ఖురాలవుతుందనుకోలేదు...."

"అవును. నేను మూర్ఖురాల్ని. ఎందుకూ పనికిరానిదాన్ని. నీ చిన్నకూతురే గొప్పది...." అంటూ మరింత రెచ్చిపోయింది పార్వతి.

"నువ్వీలారా !...." అని పార్వతిని లేవదీసి తీసుకుపోయింది కృష్ణవేణి.

"రాస్తాను రాస్తాను అని ఉత్తరం రాసి రప్పించావు. మీ అక్కయ్య మర్యాదా మాబాగా దక్కించింది...." అంది సుభద్రమ్మ చిన్న కూతురివైపు తిరిగి.

నిర్మల ఢిగాలుపడి కూర్చుండిపోయింది.

"ఇలా చేస్తుందని నాకెప్పుడో తెలుసు...." అన్నాడు సత్యనారాయణగారు.

"దాని కర్మ. అనుభవించనియ్యండి...." అంటూ మంచం మీద వాలి తల త్రిప్పుకు పడుకుంది సుభద్రమ్మ.

నిర్మల చేయి పట్టుకొని లేవదీసి తన గదిలోకి తీసుకుపోయింది మాధవి.

"....మా యింటికిక రావద్దని స్పష్టంగా చెప్పమను. చస్తే ఇంకీ గుమ్మం తొక్కను. ఉంటే తింటాను. లేకపోతే పస్తుంది చస్తాను. అంతేకాని....ఇంటికి రమ్మని పిల్చి నానా మాటలు అంటే ఊర్కోను. నాకూ చీమూ నెత్తురూ ఉన్నాయి...." అంటూ గొంతు చించుకుంది పార్వతి.

"ఊర్కో పార్వతీ! అత్తయ్య ఆవేశంలో ఏదో అన్నారు కాని నువ్వంటే యిష్టం లేక కాదు...." అని నచ్చ చెప్పబోయింది కృష్ణవేణి.

"అవునులే వదినా! నువ్వూ దాని పక్షమే! అందర్కీ చెడ్డదాన్ని నేనే!...." అంటూ మళ్ళీ ఏడుపు మొదలుపెట్టింది పార్వతి.

ఆమె నెలా సమాధానపరచాలో తెలియక వూరుకుంది కృష్ణవేణి.

నిర్మల బుగ్గల మీదకి జలజల జారి వచ్చిన కన్నీటిని చూసి చలించింది మాధవి. "ఛ! ఏమిటిది నిర్మలా! మన ప్రయత్నం మనం చేసాము. ఫలించలేదు. పోనియ్. పార్వతి తత్వం మనకి క్రొత్తా యేమిటి?...." అంది తన చీర చెంగుతో ఆమె కన్నీటిని ఒత్తుతూ.

"అసలీ జన్మలో నాచేతల్లో నామాటల్లో మంచితనాన్ని అక్కయ్య కాస్తంతయినా చూస్తుందా అని!....అదే నా బాధ వదినా!" అంది నిర్మల గద్గద స్వరంతో.

ఆమె నెలా సముదాయించాలో మాధవికి తోచలేదు.

## 35

షణ్ముగరావు సిఫార్సు చేయటం వల్లనే కాకుండ నిర్మల పనితనం కూడా చూసి సంతృప్తిపడి ఉద్యోగం యిచ్చారు ఆ కంపెనీవారు. ఆమె వెంటనే చేరిపోయింది. మొదటిరోజున ఆఫీసు పని అయిపోయాక తిన్నగా షణ్ముగరావు దగ్గరికి వెళ్ళింది నిర్మల. ఆమె క్రొత్తపని ఎలా వుందని వివరంగా అడిగి తెల్సుకున్నాడాయన.

"మీరు చేసిన సహాయానికి నేను జీవితాంతం ఋణపడి వుంటానండి!" అంది నిర్మల నిండు మనస్సుతో.

"ఇందులో నాగొప్పేముందమ్మా! నువ్వు పనిమంతురాలివి....ఎవరయినా కళ్ళకద్దుకొని తీసుకుంటారు...." అని పనికుర్రాడిని పిలిచి కాఫీ టిఫిను తెప్పించాడాయన.

దానికి తాను డబ్బిస్తానని పట్టుపట్టింది నిర్మల. "ఎప్పుడూ మీరు నన్నివ్వనివ్వలేదు....నేనిచ్చే పార్టీ అనుకొని ఈసారేనా నన్నివ్వనివ్వండి." అంది.

## లోకజ్ఞానం

1. కేంద్ర పాలిత ప్రాంతాలలో అండమాన్. నికోబార్ దీవులు కూడా వున్నాయని మీకు తెలుసు. అయితే అవి ఎన్ని ద్వీపాల సముదాయంతో ఏర్పడ్డాయి? వాటి రాజధాని ఏది?
2. భారత జాతీయ చిహ్నంలో 'సత్యమేవ జయతే' అనే పదాలు వున్నాయి. ఆ వాక్యం ఎక్కడి నుంచి గ్రహించబడిందో చెప్పగలరా?
3. ఐక్యరాజ్య సమితిలో ఎన్నో విభాగాలు వున్నాయి. వాటిలో 'యూనిడో' లేక యు. ఎన్. ఐ. డి. ఓ. (UNIDO) ఒకటి. ఈ అక్షరాలకి అర్థం ఏమిటి?
4. మన దేశంలో తంతి తపాలా శాఖవారు పిన్‌కోడ్ పద్ధతి- ప్రారంభించారు. ఉత్తరాలు రాసేటప్పుడు ఈ పిన్‌కోడ్‌ను అందరూ ఉపయోగిస్తూనే వుంటారు. అసలు పిన్‌కోడ్ పద్ధతి మన దేశంలో ఎప్పుడు ప్రవేశపెట్టబడిందో చెప్పగలరా?
5. మానవ దేహంలో అతి పెద్ద గ్రంధి ఏది?
6. కప్ప నీటిలో వున్నా కళ్ళు తెరుచుకునే వుంటుంది. అదెలా సాధ్యమో చెప్ప గలరా?
7. మన రక్తంలో ఎర్రకణాలు, తెల్లకణాలు అని రెండు కణాలు వున్నాయి. వీటిలో ఏ కణాలవల్ల చీము ఏర్పడుతుంది?
8. ఈ యాంత్రిక యుగంలో కాలగమనం ఎంత వేగంగా పయనిస్తున్నదీ తెలియజేసేవాటిల్లో ముఖ్యమైనది–గడియారం. ఈ గడియారాలలో గోడ గడియారం ఒకటి. అయితే ఈ గోడ గడియారాన్ని కనుగొన్న వ్యక్తి ఎవరు? ఏ దేశస్థుడు?
9. ఈ మధ్య ప్రపంచస్థాయిలో వింబుల్‌డన్ టెన్నిస్ పోటీలు జరిగాయి. అందులో స్త్రీలకు జరిగిన పోటీలలో గెలుపొందిన వనిత ఎవరు?
10. మన దేశంలోని అన్ని ముఖ్య నగరాలలోనూ వస్తుప్రదర్శనశాలలు (మ్యూజియమ్స్) వున్నాయి. అయితే ప్రపంచంలో కల్లా అతి ప్రాచీనమైన వస్తు ప్రదర్శనశాల ఎక్కడ వుంది? ఏ సంవత్సరంలో నెలకొల్పబడింది?

[సమాధానాలు ఈసంచికలోనే వుంటాయి. చూడండి]

ఆయన వాత్సల్యంగా చూసాడు. "నిన్ను మాటల్లో గెలవటం చాలా కష్టం సుమా!...."

నిర్మల చిన్నగా నవ్వింది. "....ఏమయినా కాగితాలుంటే యివ్వండి. టైపు చేస్తాను."

"ఇంకా ఈ బాదరబందీ నీకెందుకమ్మా!...."

"అదేమిటండి. మీరింతకాలం నాకు సహాయం చేసారు. ఇప్పుడు హఠాత్తుగా పనివదిలి పెట్టి పోతే మీకిబ్బంది కదా!....ఎవరో ఒకరు మళ్ళీ మీదగ్గర పనికి కుదిరే దాకా నేను చేయటం నా ధర్మం!...."

షణ్ముగరావుకి కళ్ళు ఆర్ద్రిత చెందాయి. వెంటనే ఆయనకి మాటలు దొరకలేదు.

అక్కడ వున్న కాగితాలు తీసుకుని టైపు చేయటం ప్రారంభించింది నిర్మల.

"ఇంత చిన్న వయసులో ఎంతో బాధ్యత మీద వేసుకోవాలని చూస్తున్నావు....నీ బుద్ధిలో వందోవంతు మా అబ్బాయి కున్నా నాకీ వయసుల్లో బరువు బాధ్యతలు తప్పేవికదా!" అన్నాడాయన.

'ప్రతి మనిషి జీవితంలో ఏదో ఒక బాధ. ఏదో ఒక సమస్య'—అనుకుంది నిర్మల.

ఆవేళేకాదు ఆ తర్వాత కూడా ప్రతిరోజూ తన ఆఫీసు నుంచి తిన్నగా అక్కడికి వెళ్ళేది నిర్మల.

అలిసిపోయిన ఆమె ముఖం చూస్తే షణ్ముగరావుకి జాలి వేసేది. "....అక్కడ రోజల్లా శ్రమపడి వచ్చావు. మళ్ళీ ఈ పని యెందుకమ్మా! హాయిగా యింటికి వెళ్ళి రెస్టుతీసుకో!...." అంటాడాయన.

"ఇంకెంతండి!....నేడో రేపో మీ దగ్గరికి పనికెవరో వస్తారు. అప్పుడెలాగా మాని వేస్తాను...." అని నవ్వుతూ టైపు మిషను ముందు కూర్చుంటుంది ఆమె.

ఆవేళ ఆమె పనిలో వుండగా ఆకాశమంతా మబ్బు పట్టింది. బాగా చీకటి పడింది. "పెద్ద వాన వచ్చేలా వుంది. యింటికి వెళ్ళిపోమ్మా!" అని రెండు మూడు సార్లు చెప్పాడు షణ్ముగరావు.

"ఇదిగో ఇదొక్కటి పూర్తిచేసి వెళ్ళిపోతానండి...." అంటూ పనిలోనే వుండిపోయింది నిర్మల.

ఆమె పని పూర్తిచేసి బయలుదేరే వేళకి ఈదురు గాలి ప్రారంభమయింది. రిక్షాలో బయలుదేరి వెళ్ళమన్నాడు షణ్ముగరావు. పని కుర్రాడు వీధిలోకి వెళ్ళి చూసాడు కాని దరిదాపుల్లో ఎక్కడా రిక్షాలు కనిపించ లేదు.

"గబగబా నాలుగడుగులు వేస్తే ఎంత సేపండి! ఐదు నిమిషాల్లో ఇంట్లో వుంటాను. అలవాటయిన దారి." అని బయలుదేరింది నిర్మల.

'పని కుర్రాడ్ని తోడుపంపమంటావామ్మా'—అని ఆయన అన్న మాటలు ఆమెకా గాలి హోరులో వినిపించనేలేదు.

నిర్మల రెండు ఫర్లాంగులు నడిచిందో లేదో టపటప చినుకులు పడటం ప్రారంభించాయి. రిక్షా కోసం అటూ యిటూ చూసింది. ఏదీ కనిపించలేదు. ఎంతోమంది హడావిడిగా నడిచి పోతున్నారు. వాళ్ళతో పాటే తనూ—అనుకుంటూ నడక వేగాన్ని హెచ్చించింది. మరో వంద గజాలు వెళ్ళేసరికి వాన ఉధృతం పెరిగింది. ఇలా వానలో తడిసి వెడితే వదిన కోప్పడుతుంది. జలుబు చేసి ఏజ్వరమయినా వస్తే మర్నాడు ఆఫీసుకు వెళ్ళటం కష్టం. ఆఫీసులో చేరి అట్టే రోజులు కాలేదు....ఆ లిప్తకాలంలో యింత దూరం ఆలోచించి ఏ పంచక్రిందయినా తలదాచుకుందామని మెయిన్‌రోడ్డు వదిలి పక్కసందులోకి పరిగెత్తింది నిర్మల.

ఆ వీధిలో దీపాలు లేవు. చీకటి గుయ్యారంగా వుంది. ముందు కనిపించిన పెంకుటింటి పంచ క్రిందకి వెళ్ళింది. అక్కడ కూడ చీకటిగానే వుంది. వరండా వెడల్పుగానే వున్నా ఈదురు గాలికి జల్లు వచ్చి మీద పడుతోంది. అక్కడికి చేరేటప్పటికే తడిసి ముద్దయిపోయింది ఆమె.

ఆ యింటి వాళ్ళు తలుపులు బిడాయించుకున్నారు. ఎక్కడా మసక వెలుతురు కూడా బయటకి కనిపించటం లేదు.

ఈ చీకటిలో—వానలో తనకీ 'జైలు' ఎంత సేపో!....తానింటికి చేరిందో లేదోనని అక్కడ షణ్ముగరావుగారు....ఇంకా రాలేదేమిటని యింట్లో వాళ్ళు కంగారు పడుతుంటారు. అక్కడేనా ఉండిపోవల్సింది—లేక ఆయన మాట విని ముందేనా యింటికి వెళ్ళిపోవాల్సింది...ఆలోచన లేని పనులు... అని తన్నుతాను విసుక్కుంది నిర్మల.

ఇంతలో ఏదో ఆమె పాదాలకి తగిలినట్టయి ఒక్కసారిగా ఒళ్ళంతా భయంతో జలదరించిపోయింది. చటుక్కున పక్కకి గెంతింది.

అక్కడే పామయినా లేదు కదా! ఆ ఆలోచన వచ్చేసరికి ఆమెకు గుండెలు దడదడలాడాయి. ఆ కంగారులో యింటివాళ్ళ తలుపులు దబదబ బాదింది.

తలుపులు తెరచుకోటానికి అరనిమిషమే పట్టినా ఎంతోసేపయినట్టనిపించిందామెకు.

"వర్షం .... చీకటి .... భయమేసి తలుపు తట్టాను...." అంది ఆమె కంగారుగా.

"నిర్మలా!...." తలుపు తీసిన వ్యక్తి కంఠం ఉద్వేగంగా పలికింది.

అతని వెనగ్గా లైటు వెలుగుతుండటం వల్ల ముఖం స్పష్టంగా కనిపించటం లేదు. రేగిన జుట్టు, మాసినగెడ్డం, నలిగిన బట్టలు....ఆ ఆకారంలో అతనెవరో వెంటనే గుర్తు పట్టలేక పోయింది ఆమె.

"నన్ను గుర్తు పట్టలేదా నిర్మలా?"

అదే గొంతు. ఎలా మర్చిపోగలదు?

కాలేజీ విద్యార్థులలో నిర్మలకి 'సీమ మిరపకాయ' అన్న బిరుదుండేది. ఏ అమ్మాయితోనేనా అబ్బాయిల ఆటలు సాగేవేమో కాని నిర్మల దగ్గర కాదు. మాటకి మాట చెప్పటమే కాదు.... ఎదురు ప్రశ్నలువేసి వాళ్ళని చాకచక్యంగా ఏడిపించేది. మరో దారిలేక చేతలలోకి దిగిన అబ్బాయిలిద్దర్కి చెంపదెబ్బలు కూడా రుచి చూపించింది.

ఆ యిద్దర్లో శ్యాం సుందర్ ఒకడు. ఆనాడు నలుగుర్లో తన్ను వాటేసుకుని ముద్దుపెట్టుకున్న 'రౌడీ శ్యాం'ని నిర్మల ఎప్పుడూ మర్చిపోలేదు.

"....వానజల్లు పడుతోంది. లోపలికి రా నిర్మలా!...." అన్నాడు శ్యాం సుందర్.

నిర్మల ముఖం ఎర్రనయింది. అతనివైపోసారి, కాంపౌండులో వున్న మొక్కల గుబుర్లనోసారి చూసింది....'ఆ మొక్కల్లో పాములున్నాయో లేదో కాని....లోపలికి రమ్మంటున్న మనిషిలో పాములున్నాయి! పాము కాటుకి మందుందేమో కాని మనిషి కాటుకి మందులేదు....' అనుకుంటూ అక్కడే నిలబడిపోయింది.

ఇంట్లో ఇంకెవరూ వున్నట్టు లేదు....మరెవ్వరూ బయటికి రాలేదు.

మరోసారి విపరీతంగా గాలివీచి వాన నీళ్ళు వచ్చి ఇద్దరి మీదా పడ్డాయి.

"అయ్యో, బాగా తడిసిపోయావు. లోపలికి

రా నిర్మలా!'' అతని కంఠంలో ఎంతో అనునయం తొణికిసలాడినా ఆతంతా తెచ్చి పెట్టుకున్నదేననుకుంది ఆమె.

''ఫర్వాలేదు. ఇక్కడ కాసేపు నిలబడనిస్తే చాలు!'' అంది ఆమె తల త్రిప్పుకుంటూ.

''నేనింకా అప్పటి శ్యాంననే అనుకుంటున్నావా నిర్మలా!....'' అన్నాడతను బాధగా.

ఆమె మాట్లాడలేదు.

''మారిన మనిషినని వెంటనే నేను ఋజువు చేసుకోలేకపోవచ్చు. ఒక్కటి మాత్రం స్పష్టంగా చెప్పగలను. ఆ రోజుల్లో అల్లరి చిల్లరిగా తిరిగినందుకు....సరిగ్గా చదువుకోనందుకు ఇప్పటిదాకా బాగా శిక్ష అనుభవిస్తూనే వున్నాను....''

ఎక్కడో పెద్ద పిడుగు పడింది. దడదడలాడే గుండెలతో గోడ దగ్గరకి జరిగి బల్లిలా అతుక్కుపోయింది నిర్మల.

''లోపలికి రా నిర్మలా! నేను నీకు దూరంగానే వుంటాను....అంతగా నీకు అనుమానమయితే ఈ తలుపులు తీసే వుంచుతాను....''

''ఫర్వాలేదు....ఇక్కడ వుండగలను.''

''నన్ను నమ్మలేకపోతున్నావు కదూ!''

ప్రతి మగవాడూ మంచివాడే....అవకాశం దొరికేవరకు! ఆ తర్వాత ఫలితం అనుభవించేది ఆడది. ఆ అవకాశమే ఆడవాళ్ళివ్వకపోతే?... ఇంతమంది మగవాళ్ళు అత్యాచారాలకి పాల్పడతారా?....''నమ్మలేకపోతున్నది నిన్ను కాదు... ముందున్న క్షణాన్ని. ఎవరి జాగ్రత్తలో వాళ్ళుండటం మంచిది!'' అంది నిర్మల తొణక్కుండా.

అతను గాఢంగా నిట్టూర్చాడు. ''అవును నిర్మలా! ఈ మనిషి మంచివాడు – ఈ మనిషి చెడ్డవాడు అని ఎక్కడా ముఖంమీద వ్రాసుండదు. ఎవడికెప్పుడు ఎలాంటి బుద్ధి పుడుతుందో! నువ్వు చాలా తెలివైన దానివి....''

ఆమె తల త్రిప్పుకుంది.

''కాని, నువ్వు నమ్ముతావో లేదో....ఐదు నిమిషాల క్రితం నువ్వే కనుక తలుపులు బాదకపోయుంటే....ఈపాటికి నా శవం ఆ గదిలో వ్రేలాడుతుండేది!....''

అతని గొంతులోని ఆవేశం ఆమె గుర్తించి చకితురాలైంది.

''కనీసం చచ్చిపోయే ముందయినా మనిషి అబద్ధమాడడని నమ్ముతావా నిర్మలా!'' అంటూ ఆవేశంగా లోపలికి వెళ్ళి కిటికీ తలుపులు భళ్ళున తెరిచాడు. లోపలి దృశ్యం స్పష్టంగా కనిపిస్తోంది వాసానికి వ్రేళ్ళాడుతున్న ఉరిత్రాడుని చూసి భయ కంపితురాలైంది నిర్మల. కంగారుగా ఆ గదిలోకి పరిగెత్తింది. ''....ఎందుకు? ఎందుకింత ఘోరాన్ని తలపెట్టావు?....''

చటుక్కున కుర్చీలో కూలబడి చేతులతో ముఖాని కప్పుకొని ఏడువసాగాడు శ్యాంసుందర్.

కొన్ని క్షణాల క్రితం అతని మీదున్న అనుమానాలన్నీ పటాపంచలయిపోయాయి. ఇప్పుడతని మీద జాలితో ఆమె గుండె నిండింది. ''ఎందుకింత బాధపడుతున్నావు శ్యాం? ఏం జరిగింది? నాతో చెప్పు....'' అంటూ అనునయించింది.

''నాలాంటి చేతకాని వాడికి ఏడుపు తప్ప యింకేమీ మిగలదు....''

''ఛ! ఎందుకింతగా నిన్ను నువ్వు నిందించుకుంటావు? అసలు బాధేమిటో నాతో చెప్పు. నాకు తోచిన సలహా నేను చెపుతాను....''

గబగబా కళ్ళు తుడుచుకొని ఆమెవైపు క్షణంపాటు రెప్పవేయకుండా చూసాడు. ''నేను మారానని కనీసం నువ్వయినా నమ్ముతావా!''

''మనిషికి మార్పన్నది సహజం. మెచ్యూరిటీతో మనిషి తత్వం అదే మారుతుంది. నువ్వేమిటి – నేను మాత్రం మారలేదూ?''

''కాని, అంతా నీలా ఆలోచించటం లేదు. ఎవరినేనా పని యివ్వండి అని అడిగితే–నీలాంటి జులాయి మనుషులకిక్కడ చోటులేదు అంటున్నారు. మా నాన్నగారు వాళ్ళు ప్రయత్నం చేయటం లేదు సరికదా–నీలాంటి రౌడీకి ఎవ్వడూ ఉద్యోగం యివ్వడని తిడుతున్నారు. ఆ రోజుల్లో సరిగ్గా చదువుకోలేదు. ఈ థర్డ్‌క్లాస్ డిగ్రీకి ఉద్యోగం యిచ్చేవాళ్ళు లేరు....అప్పుడే బాధ్యత తెల్సుకొనుంటే నేనిప్పుడీ దుస్థితిలో ఉండేవాడ్ని కాదు. ఓ మూల నిరుద్యోగం; మరో మూల యింటా బయటా అంతా చీదరించుకొని అసహ్యించుకొనే వాళ్ళే! సానుభూతి చూపించే వాళ్ళు లేరు. ఇలాంటి బ్రతుకు బతికేకన్న చావటం నయమనిపించింది....''

[సశేషం]

ఇటీవల నైనిటాల్ సమీపంలోని నవాలి ప్రాంతంలో-ఎన్. సి. సి. ఆలిండియా బేసిక్ లీడర్‌షిప్ కోర్సు క్యాంప్ జరిగింది. దేశంలోని ప్రతి రాష్ట్రం నుంచీ ఎన్. సి. సి. కేడట్స్ అందులో కలుసుకున్నారు.

ఈ క్యాంప్ సందర్భంగా కేడట్స్ అందరికీ ఎన్నో పోటీలు జరిగాయి. వనితా కేడట్స్‌కు జరిగిన పోటీలన్నిటిలోనూ పాల్గొన్నారు కుమారి మోహనా ఈశ్వరన్. అంతేకాదు, పాల్గొన్న ప్రతి పోటీలోనూ బాగా రాణించి-ఈ సంవత్సరం అఖిలభారత ఉత్తమ కేడట్ (ఆల్ ఇండియా బెస్ట్ కేడట్) ప్రశంస (సిల్వర్ ప్లేట్) పొందారు. తుపాకి పేల్చడంలో ప్రథమస్థానం అందుకుని బంగారు పతకం కూడా గెలుచుకున్నారు.

కలకత్తాలోని గోఖలే మెమోరియల్ వనితా కళాశాలలో బి. యస్ సి. తుదిసంవత్సరం చదువుతున్న ఈ విద్యార్థిని, మూడేళ్ళుగా ఎన్. సి. సి. లో వుంటూ తన ప్రతిభను ప్రదర్శించి ఎన్నో పతకాలు, ప్రశంసాపత్రాలు అందుకున్నారు.

పశ్చిమంగా 'మనాలి'లోనూ, తూర్పున డార్జిలింగ్ సమీపంలోనూ, హిమాలయ పర్వతారోహణలో పాల్గొని విజయం సాధించారు. 1977 వ సం॥ న్యూఢిల్లీలో జరిగిన రిపబ్లిక్ దినోత్సవ 'పెరేడ్'లో కూడా ఆమె పాల్గొన్నారు.



ఈయేడు ఆమెకు కళాశాల నుంచి - 'ఉత్తమ విద్యార్థిని'గా సిల్వర్‌షీల్డ్ లభించింది. అవిరళంగా ఆమె క్రీడారంగంలోనే కాకుండా విద్యారంగంలో కూడా చాలా ప్రతిభ గల విద్యార్థినిగా పేరు పొందారు.

ఆట పాటలతోపాటు చదువుసంధ్యలలో కూడా సమానమైన ప్రతిభాపాటవాలను ప్రదర్శించే ఆదర్శయువతి మోహనా ఈశ్వరన్.

# తరతరాల భారత సంస్కృతిలో స్త్రీ

నేటి వనితలలో కొందరు తరతరాలుగా స్త్రీలకు అన్యాయాలు జరిగాయని, ఆ అన్యాయాలకు కారణం పురుషులేనని వాపోతున్నారు. అనాదిగా పురుషులే రచయితలుగా, కవులుగా వుండి స్త్రీని ఆటవస్తువుగా, విలాస వస్తువుగా చిత్రించారని కొందరి అభియోగం. మరికొందరు మతాధిపత్యం వలన స్త్రీ స్వాతంత్ర్యం నశించి, స్త్రీ బానిసగా పురుషుల పాదాలకు ప్రణమిల్లవలసిన దుర్గతి పట్టినదని వాపోతున్నారు. ఇలా వాపోతున్నవారు ఈ అన్యాయాలకు కొంతవరకు పైవారే కాక, స్త్రీ అదృశ్య హస్తం వుందనే సత్యం కూడా మరువరాదు. బిడ్డకు భావి తీర్చి దిద్దవలసినది మాతృమూర్తి. ఆ తల్లే బిడ్డకు ఉగ్గుపాలతో పాటు ఎన్నో మూఢాచారాలను, మూఢ విశ్వాసాలను రంగరించి పోస్తున్నదనే సత్యం మనం గమనించాలి. దయ్యాలు, భూతాలు, దిష్టి ఇలాంటివన్నీ బిడ్డకు పసితనంలోనే మనసులో నాటుకుపోతాయి. ఆ భయాలకు అతీతంగా బిడ్డను పెంచవలసిన బాధ్యత తల్లిది కాదా! స్త్రీని మాతృమూర్తిగా 'మాతృదేవోభవ' అని గౌరవించాయి ఉపనిషత్తులు. జననీ, జన్మభూమి స్వర్గం కంటె ఎక్కువని మన గ్రంథాలు చాటి చెప్పాయి. చదువు చెప్పే గురువులలో ఆచార్యుడు ఉపాధ్యాయుని కన్న పదిరెట్లు గౌరవనీయుడు. తండ్రి ఆచార్యుని కన్న వందరెట్లు పూజనీయుడు. తల్లి నేర్పే విద్య తండ్రి నేర్పే విద్య కన్న వేయిరెట్లు గొప్పదని వశిష్టుడు చెప్పటంలో ఎంతో విశిష్టత వుంది. బిడ్డలను ఉత్తమ పౌరులుగా రూపొందించే బాధ్యత తల్లి ఎంతవరకు స్వీకరించినదని గతం మనం పరిశీలిస్తే అందుకు సాక్ష్యంగా నిలిచే మహిళలు సంఖ్యలో తక్కువ.

మన ప్రాచీన సంస్కృతికి ప్రతీకగా నిలిచిన వేదాలను పరిశీలిస్తే స్త్రీలను గురించి ఎన్నో ఆసక్తిదాయకమైన విషయాలు మనకు తెలుస్తాయి. వేదాలలో స్త్రీకి సాంఘికంగా పురుషునితో పాటు సమాన ప్రతిపత్తి లభించింది. అధర్వణవేదంలో అవివాహితగావున్న స్త్రీ ఆమె తండ్రి ఆస్తిలో భాగానికి హక్కుదారువుతుందని వుంది. ఋగ్వేదంలో కూడా అవివాహిత స్త్రీకి తండ్రి ఆస్తిలో నాలుగవవంతు చెందుతుందని చెప్పబడింది. స్త్రీలు వివాహాన్ని పవిత్రబంధంగా భావించి భర్త చేసే వైదిక కార్యాల్లో పాల్గొనేవారు. అత్తవారింట స్త్రీకి గౌరవముండేది. భర్త కూడా, ఆమె తనతో కలకాలమూ కాపురం చేసి తనకు, ఇంటికి 'లక్ష్మి'గా చేయవలసినదిగా సూర్యుని ప్రార్థించే వాడు. విధవా పునర్వివాహం ఆ నాడు సమ్మతమే. సతీ సహగమనం నాడు లేదు. యాజ్ఞవల్క్య స్మృతిలో భర్త లేని స్త్రీ, కొడుకులతో సహభాగిని అవుతుందని పేర్కొనబడింది.

హిందూమతపరంగా చూస్తే స్త్రీకి యిచ్చిన ఆధిపత్యం సామాన్యమైంది కాదు. సృష్టికారకుడైన బ్రహ్మ, సరస్వతిని తన నాలుకమీద, విష్ణుమూర్తి లక్ష్మీదేవిని—వక్షస్థలం మీద నిలుపుకుంటే, శివుడు తన అర్ధ శరీరాన్నే పార్వతికిచ్చి 'అర్ధనారీశ్వరు'డయ్యాడు. ఇక మహిషాసురుడు వంటి దానవుణ్ణి సంహరించడానికి త్రిమూర్తులు తమ శక్తులన్ని స్త్రీమూర్తిలో ఆవహింపజేసి సంహరించినట్లుగా పురాణాలబట్టి తెలుస్తోంది. మనం విద్యాప్రదాతగా సరస్వతిని, ఐశ్వర్యప్రదాయినిగా లక్ష్మీదేవిని, మంగళప్రదాయినిగా పార్వతీదేవిని సేవిస్తూనే వున్నాము. సావిత్రి వంటి సౌశీల్య, భర్త ప్రాణాలకై యమునితో పోరాడటం స్త్రీ గొప్పతనానికి నిదర్శనం. పురాణ స్త్రీలు అగ్ని పరీక్షలకు గురియైనా, మరి ఏ యితర పరీక్షల నెదుర్కొన్నా అవి నేటి మన వూహకు అందని విషయాలు. సీత అగ్ని ప్రవేశమే అందుకు నిదర్శనం. సూర్య గమనాన్ని ఆపిన స్త్రీలున్నారు. మరింకెన్నో అద్భుతాలు పురాణాలలో మనకు గోచరమవుతాయి. అయోనిజలు (గర్భమున పుట్టనివారు) ఆయా గ్రంథాలలో ప్రధాన పాత్రధారులు. పురాణ స్త్రీలు ఎవ్వరును భర్త సేవలో బానిస భావాన్ని పొందినట్లుగా దాఖలాలు లేవు. వారు మనసా వాచా కర్మణా భర్త సేవలో ఆనందం పొందారని మనం గ్రహించవచ్చు. పురాణ పాత్రలను నేటి కాలమాన పరిస్థితులకు అన్వయించి విమర్శిస్తున్నామంటే మనం యుగధర్మాలను విస్మరిస్తున్నామని గ్రహించాలి. ఎందువల్ల మనలో ఈ తేడా వచ్చింది? కాలధర్మాన్నిబట్టి కాదా? స్త్రీ స్వాతంత్ర్యానికి అర్హురాలు కాదన్న మనువే ''యత్రనార్యాస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః'' అని స్త్రీకి మకుటాన్ని పెట్టాడు. 'కలకంఠి కంట కన్నీరొలికిన సిరి ఇంటనుండనొల్లదు సుమతీ' అని సుమతీ శతకకారుడు కూడా స్త్రీ ఔన్నత్యాన్ని గుర్తించాడు.

ఇక స్త్రీ 'కార్యేషుదాసీ....' శ్లోకం ప్రకారం ఇంటి పనులు నిర్వహించడంలో దాసివలె, రూపంలో లక్ష్మీదేవి లాగా, ఓర్మిలో భూదేవి వలె, భోజన సమయంలో తల్లివలె, సలహా సంప్రతింపులలో మంత్రివలె, పడకటింట రంభవలె ప్రవర్తించమని కులస్త్రీకి ఆరు గుణాలను నిర్దేశించటం స్త్రీ సుఖజీవన సోపాన మార్గాలే గాని అన్యంకాదు. పురుషుడు కూడా వివాహ సమయంలో ధర్మార్థ కామాలను నా సహధర్మచారిణితో సమానంగా ఆచరిస్తానని చేసిన బాస అది దంపతుల జీవితానికే రాచబాట వంటిది.

తరతరాలుగా స్త్రీలు అన్యాయాలకు బలైపోయారనే స్త్రీలు కొందరు నేడు సమాజంలో జరిగే ఎన్నో సాంఘిక దురాచారాలను మౌనంగా చూస్తూ, పరోక్షంగా ప్రోత్సహించడం విడ్డూరం కాదా? వరకట్న దురాచారాన్ని రచనలలో, ఉపన్యాస వేదికలపై ఖండించే స్త్రీలే తమ బిడ్డల (మగబిడ్డల) విషయంలో సాధ్యమైనంత ఎక్కువ కట్నం రాబట్టటానికి ప్రయత్నించటం విడ్డూరం కాదా? అదే స్త్రీ ఆడపిల్లల తల్లిగా లోకంలో వరకట్నాలపై దుమ్మెత్తి పోస్తున్నది. ఈ అన్యాయం ఎవరు ప్రతిఘటించాలి? కుటుంబంలో ఒక వ్యక్తిగా సాటిస్త్రీకి వెలకట్టటం సమంజసమా? ఈ శోకన కార్యక్రమాన్ని ఎవరు చేబట్టాలి? మన కళ్ళెదుట జరిగే అన్యాయాలకు, సాంఘిక దురాచారాలకు మౌనం వహించే స్త్రీలే గతంలో స్త్రీలకు అన్యాయాలు జరిగాయని వాపోవడం నేల విడిచి సాము చేయడం గతంలో జరిగిన దానిని పదే పదే తలచుకుని ధ్వజమెత్తటం సమంజసం కాదు. వర్తమాన సమాజంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయాలకు, అక్రమాలకు, సాంఘిక దురాచారాలకు స్త్రీశక్తి ఎదురు నిలిచి పోరాడి, మహిళాభ్యుదయానికి కృషి చేస్తే అది ఎంతో సుఖదాయకం.

—గుంటి సరస్వతి

# పుట్టిన రోజులు



టి. వి. గౌతమ్ (త్రివేంద్రమ్) పుట్టిన తేదీ: 3-10-77 తల్లిపేరు: టి. పద్మలత

ఈ నెలలో పుట్టిన రోజులు గల శిశువుల్లో- ఏడాది పిల్లల గ్రూపులో టి. వి. గౌతమ్; రెండేళ్ళ గ్రూపులో జి. నీరజ; మూడేళ్ళ గ్రూపులో సునీతారెడ్డి – 'పుట్టిన రోజు' బహుమతులకు ఎన్నికైనారు. వీరితో పాటు, మొత్తం మీద అన్ని గ్రూపుల లోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నికచేసి విడిగా ప్రచురిస్తున్నాము. నవంబర్ సంచికలోని ఈ శీర్షికకు ఫోటోలు పంపేవారు–పూర్తి వివరాలు, చిరునామాతో సహా-(ఫోటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి; ఫోటో వెనక పెన్సిల్‌తో పేరు మాత్రమే రాయాలి.) అక్టోబర్ 5వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.

జి. నీరజ (సికింద్రాబాదు) పుట్టిన తేదీ: 8-10-76 తల్లిపేరు: జి. యస్. లక్ష్మీసారధి

సునీతారెడ్డి (నాగార్జునసాగర్) పుట్టిన తేదీ: 11-10-75 తల్లిపేరు: లతారెడ్డి

నవీద్ అహ్మద్ (హైద్రాబాదు) పుట్టిన తేదీ: 2-10-77 తల్లిపేరు: నసీమ్ బేగమ్





కె. మృదుల (విజయవాడ) పుట్టిన తేదీ: 15-10-76 తల్లిపేరు: కె. యం. గౌరీదేవి





Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

# చూడండి...

# సర్వోత్తమ తెలుపు కోసం రానిపాల్®









బట్టలను ఆఖరుసారి జాడించునపుడు కొంచెము రానిపాల్ వేయండి. అపుడు చూడండి...
బట్టలపై మెరిసే తెలుపు! రానిపాల్ తెలుపు! తెల్లటి బట్టలు ఏవైనా కాని—
నూలు, సింథెటిక్ మరియు మిశ్రమ బట్టలు రానిపాల్‌తో మెరుస్తూ వుంటాయి.

**నియమానుసారంగా రానిపాల్‌ను వేయండి...తెలుపు చూడండి, చూపండి!**

నూలు దుస్తులకు **రానిపాల్®**
సింథెటిక్ మరియు మిశ్రమ దుస్తులకు **రానిపాల్®-ఎస్.**

REGD. No. TN/MS(S)/64 VANITHA (Telugu) October 1978